# కవిద్వయము

కవి సమ్రాట్

నోరి నరసింహశాస్త్రి

జయంతి పబ్లికేషన్స్
కారల్‌మార్క్సు రోడ్. విజయవాడ-2

# KAVI DWAYAMU

BY

NORI NARASIMHA SASTRY

JAYANTI PUBLICATIONS
Vijayawada-520 002.

Edition:
OCTOBER 1986

Price :
**Rs. 13-00**

Printers :
NAGARJUNA PRINTERS
Vijayawada-2

* ఒక ఎడిషన్-కాలపరిమితి 1989అక్టోబరు వరకు

# పరిచయము

కవిద్వయములో శ్రీనాథకవిని గూర్చి శ్రీయుతులు వేటూరి ప్రభాకర శాస్త్రి, బండారు తమ్మయ్య, చిలుకూరి పాపయ్య శాస్త్రిగారలు ఎన్నో గ్రంథాలు, వ్యాసాలు, పీఠికలు వ్రాసి అనేక విషయాలు తెలిపినారు. శ్రీ వాగంటి శేషయ్యగారు కవితరంగణిలో వ్రాసిన వ్యాసముకూడా అమూల్య మయినదే. పల్నాటి వీర చరిత్రకు శ్రీ అక్కిరాజు ఉమా కాంతంగారు వ్రాసిన పీఠికతో ఆరంభమై, అది శ్రీనాథ రచన అవునా కాదా అనే విషయముమీద జరిగిన తర్జన భర్జనలు కూడా ఉపయోగకరమైనవే. వారి కందరికీ ఆంధ్ర పాఠక లోకము నాతోపాటు కృతజ్ఞత చూపవలసి ఉన్నది. ఐనా అన్నిటికంటె శ్రీనాథుని స్వరూపము మనము విశ్వాసయోగ్యంగా తెలుసుకోవలెనంటే ఎక్కువ పఠించవలసినవి ఆయన గ్రంథాలూ, ఆయన పేర చలామణీ అవుతున్న చాటువులూనూ.

ఇక పోతననుగూర్చి వెలువడ్డ గ్రంథాలలో ముఖ్యమైనవి శ్రీయుతులు అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రి, నిడుదవోలు వెంకటరావు గార్లవి. కవి తరంగిణిలోని వ్యాసముకూడా ఎన్నదగినదే. భాగవత పీఠికలు కూడా కొంత సంభావ్యమైనవే. పోతనను గూర్చిన తక్కిన వాఙ్మయమంతా ఎక్కువ భాగము రెండు విషయాలమీద కేంద్రీకరించినది. ఒకటి ఆయన ఒంటి మిట్టవాసి అనే వ్యర్థ వివాదము. రెండవది ఆయన మహత్త్వాన్ని తెలిపే అద్భుత గాథలను ఉగ్గడించేవి. ఈ రెండవదానికి సంబంధించిన గ్రంథాలు ఆంధ్రలోకములో పోతనమీద ఉన్న ప్రేమను, భక్తిని వెల్లడిస్తవి. పోతన నిజ స్వరూపము తెలుసుకోడానికి ఎక్కువ ఉపయోగకరమైనది భాగవతావ

తారిక. వీరభద్ర విజయావతారిక కూడా, ఎంతో సందేహముతో కొంత

ఏమైనా, నిస్సందేహంగా ఈ కవిద్వయము ఆంధ్ర కవులందరిలో అపూర్వాద్భుత వ్యక్తులు. పాతిక ముప్పయి సంవత్సరాల వయోభేదమున్న సమకాలికులు. పోతన పద్యాలలో అక్కడక్కడ శ్రీనాథుని ఛాయలు స్పష్టముగా గోచరిస్తవి. ఈ ఇద్దరు కవులకూ ఉన్న సంబంధాన్ని గూర్చి పుట్టిన గాథలు మొత్తముమీద శ్రీనాథునికి అన్యాయం చేసినవి.

ఇద్దరూ మహాభక్తులే. ఇద్దరూ శృంగారవర్ణనలు చేయడములో అభినివేశము చూపినవారే. ఇద్దరూ అసామాన్యమయిన ప్రతిభావ్యుత్పత్తులు కలవారే. ఆ రెంటిలో పోతనలో ప్రతిభా, శ్రీనాథునిలో వ్యుత్పత్తీ ఎక్కువ పాలులో ఉన్నవనడము సత్యదూరముకాదు. పోతన సహజ పాండిత్యుడు, శ్రీనాథుడు కవిసార్వభౌముడు.

శ్రీనాథుడు పాకనాటి నియోగి బ్రాహ్మణుడని కొందరూ, ఆరాధ్యుడని కొందరూ అన్నారు. పోతన ఆరువేల నియోగి బ్రాహ్మణుడని చాలామంది అంటున్నారు. ఇవి నాకు వింతగా వున్నవి. వాళ్ళిద్దరూ అట్లా ఏమి ఎక్కడా చెప్పుకోలేదు. ఇద్దరూ నిర్దుష్టమయిన వైదికాచారసంపద కల స్మార్త బ్రాహ్మణులమని మాత్రము స్పష్టము చేసుకొన్నారు. నేను అట్లే గ్రహించినాను.

ఆ కాలపు ఆంధ్ర బ్రాహ్మణులలో పెద్ద మార్పులు వచ్చి చీలికలు వస్తూవున్నవి. భీమేశ్వర పురాణము కృతిపొందిన బెండపూడి అన్నమంత్రి కుటుంబములో కొన్ని విశేషాలు ఇంతవరకు విమర్శకుల దృష్టిలో పడ్డట్లు లేదు. కృతిభర్త అన్నమంత్రి తాతపేరు కూడా అన్నయయ్యే. ఆయన "యవన సంహార విలయ కాలాగ్ని"యై ప్రతాపరుద్ర నృపకుంజరుచేత సూర్యగ్రహణవేళ కొలను అగ్రహారముగా దానము గ్రహించినవాడు.

కృతిభర్త అన్నమంత్రికి జ్యేష్ఠ సోదరుడయిన లింగన మంత్రిత్వము చేస్తూనే, వేమ వసుధాధిపుని వల్ల బోడసకుర్తి మహాస్థలములో ఏదో పర్వ సమయములలో చోడవర మహాగ్రహారము తివిరి దానప్రతిగ్రహము చేసినాడు. అటువంటి బెండపూడివారికి శ్రీనాథుడు బాంధవుడు. కాబట్టి వారిని ఈనాడున్న శాఖలలో ఒక శాఖకు ముడిపెట్టక "ఇదం బ్రాహ్మ మిదం క్షాత్ర"మ్మని కాలానుగుణంగా ప్రవర్తించిన బ్రాహ్మణోత్తములనుగానే ప్రదర్శించినాను.

భాగవతావతారికలో గూఢముగా స్పృశించిన మాటలు ఆధారము చేసుకుని స్మార్తాచారము అవలంబించే ఒక కుటుంబములో ఒకరిద్దరు వ్యక్తులు లింగధారణము చేస్తే, ఎంత కుటుంబ కల్లోలానికి దారితీస్తుందో, ఈ నవలలో ప్రదర్శించినాను. ఇటువంటి కారణాలే నేడు బ్రాహ్మణులలో కనపడే అంతర భేదాలకు కారణమయి ఉంటుందని నా విశ్వాసము. అటువంటివే ఇంకా ఎన్నో భేదాలు మన మూహించవచ్చును.

శ్రీనాథుని చాటువులలో "అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి" అనే దానిని బట్టి ఆయన బహుశః "మహాప్రస్థాన"మనే ఉత్తమ వైదిక కర్మతో దేహత్యాగము చేసి ఉంటాడని నేను బహుకాలము నుండి ఊహించి ప్రచారము చేస్తున్నాను. దానిని గమనించిన వారు ఇతరులెవరూ నాకు కనబడలేదు. కాని ఈ మధ్య వచ్చిన శ్రీ ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యములో శ్రీనాథుడు మహా ప్రస్థానము చేసినాడనే వాక్యము వున్నది. వారు బహుశః వేదోక్తకర్మ అనే భావముతో కాకుండా, పరలోక యాత్రి అనే సామాన్యార్థములో వాడి వుండవచ్చును. ఏమయినా వారి నందులకు సంభావిస్తున్నాను.

పోతన జీవితములో మహాద్భుత మొకటి అవతారికలో కనబడు

తున్నది. ఆయన శివపూజాధురంధరుడూ, శ్రీకృష్ణభక్తుడూ, దుర్గోపాసకుడూ, ఐనా ఈశ్వరుడాయనకు శ్రీ సీతారామభద్ర రూపములో సాక్షాత్కరించి భాగవత మాంధ్రీకరించి తన కంకితము చేయమని ఆదేశించి "నీకు భవబంధంబులు తెగు"నని అనుగ్రహించినాడు.

శ్రీరామరక్షకల ఆయన కృతికి క్షతి వుండదు. సింగభూపాలుడు కృతిపతిత్వ మర్థించి విఫలుడై గ్రంథము పాతించినాడనే ఇటీవలి కథను ఇప్పుడు విమర్శకులెవ్వరూ విశ్వసించుటలేదు. పోతన ప్రియశిష్యుడయిన నారయగాని, గంగన, సింగనలు కాని ఆ విషయము ప్రస్తావింపనే లేదని మనం ముఖ్యంగా గమనింపవలెను.

మహాప్రస్థాన కర్మ విశేషాలు సాధారణంగా లభ్యమయ్యే నిబంధన గ్రంథాలలోగాని, స్మార్తాను క్రమణికలలోగాని నాకు లభించలేదు. ఆ విషయము నేను ప్రస్తావించినంతనే, దాని స్వరూపము శ్రుతిస్మృతి ప్రమాణాలతో నాకు తెలిసిన వేదార్థప్రవీణ, బ్రహ్మశ్రీ చివుకుల వెంకట రమణ శాస్త్రిగారికి నా కృతజ్ఞతా పూర్వక వందనము లర్పిస్తున్నాను.

బొడ్డుపల్లి గ్రామము ఉనికిని గూర్చి తెలిసినచో వ్రాయుడని నేను వ్రాసినంతనే, శ్రద్ధతో స్వగ్రామమునకు వెళ్ళి పెద్దలను విచారించి, అమరావతికి ఎదురుగా ఉన్న దిబ్బవేసిన కృష్ణలంకయే దాని పూర్వస్థానమని నాకు తెలిపిన డాక్టరు బొడ్డుపల్లి పురుషోత్తము ఎం.ఏ.గారికి కృతజ్ఞుడను.

పోతన గోదావరి గంగలో స్నానము చేసినది భద్రాచల క్షేత్రములోఐ ఉండునని ప్రథమములో ఊహించిన శ్రీ నిడుదవోలు వెంకటరావుగారికి కృతజ్ఞుడనై, ఆ ఊహనే ఈ నవలలో గ్రహించినాను. అప్పటికి భద్రాచల శిఖరముమీద శ్రీ రామాలయము ఉన్నట్లు తోచదు. అందుచేత, రామాలయ ప్రశంస చేయలేదని పాఠకులు గ్రహింతురుగాక!

ఇక, నే నడుగనిదే, "హొగడదండ" స్వరూపమునుగూర్చి విద్వద్వ రేణ్యులయిన బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు ప్రభావతీ ప్రద్యుమ్న పీఠికలో చూపిన ప్రామాణికవచనాలను ప్రీతితో నా దృష్టికి తెచ్చిన మిత్రులు శ్రీ వావిలాల సోమయాజులుగారికి ప్రత్యేకముగా కృతజ్ఞత తెలుపుతున్నాను.

ఈ నవల 1961లో ఒకసారి, 1962లో ఇంకొకసారి రెండు విధాలుగా ప్రారంభించినా, రచన పూర్తికాక ఆగిపోయినది. చివరకు ఇప్పుడిది ఈ సంవత్సరము మార్చిలో ఆరంభించి అక్టోబరులో పూర్తిచేయగలిగాను. ఈ ప్రయత్నము ఫలించడానికి ప్రధాన కారకులైన శ్రీ ఎమ్.ఎన్. రావుగారికిని, మిత్రులు శ్రీమాన్ టి.వి. రంగాచార్యులుగారికిన్ని హృదయపూర్వకముగా కృతజ్ఞత తెలుపుతున్నాను.

ఆంధ్రకవి జీవితాలు ప్రదర్శించడానికి ఇంతవరకూ నేను తలపెట్టిన ప్రణాళికలలో ఈ నవల చివరిది. ఇంతవరకూ నా నవలలమీద చూపుతూ వచ్చిన అభిమానాన్నే, దీనిమీద కూడా ఆంధ్రపాఠక లోకము చూపగలదని ఆశిస్తున్నాను.

రేపల్లె
27-10-66

నోరి నరసింహశాస్త్రి

# కవిద్వయము

"యశ్శివో నామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళా
తయో స్సంస్మరణాత్ పుంసాం సర్వతో జయమంగళమ్"
"ఆపదా మపహర్తారం దాతారం సర్వ సంపదాం,
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్"

ఈ మొదలైన విధంగా ప్రయాణ మంగళ దేవతలను శ్రీనాథ కవిసార్వభౌముడు తన శ్రీశైలయాత్ర చివరి మజిలీలో ధ్యానించినాడు. ఆ నాటి ఉదయమే, జాముప్రొద్దువేళ, అతడు సపరివారముగా శిఖరేశ్వరము చేరుకొన్నాడు. శిఖరేశ్వరస్వామిని భక్తిపూర్వకముగా రుద్రాభిషేకముతో అర్చించినాడు. ఆలయ సమీపమందే ఆనుకొని నిలువున నిలిచి ఉన్న మహాశిలపైకి భార్య భూదేవితో అధిరోహించి తిలాదికముతో ఉలూఖల మందు యాత్రికులు చేసే శిష్టాచారము నెరపినాడు. కాని ఆ అమృత

బిందువులు, వారు తమ శిరస్సులను ఎంత ఒగ్గినను, వారి తలలపై పడలేదు. అక్కడి నుండి మూడుకోసుల దూరంగా వున్న శ్రీశైల నగరము వెళ్ళి. అందలి భ్రమరాంబా మల్లికార్జునుల ఆలయములు దర్శించి మ్రొక్కినారు చెట్లతో, పొదలతో, శిలలతో ఆవరింపబడి ఉన్నా స్పష్టముగా స్వామి ఆలయ శిఖరము వాళ్ళకు కనిపించింది. ఇద్దరూ ఆ శిఖర కనకకుంభానికి భక్తితో నమస్కరించినారు.

ఆ తర్వాత దగ్గరనే ఉన్న మహాపుష్కరిణీ తీరాన చల్లని చెట్ల నీడలలో వండిన ఆహారము సదాశివునికి నివేదించి ప్రసాద మారగించి శ్రీనాథుడు విశ్రమించినాడు. మూడు జాముల వేళకు అతడు శుచియై యాత్రోన్ముఖుడై పై విధముగా ప్రయాణ మంగళ దేవతలను స్మరించినాడు.

పరిజను లాతనికిని, భార్యకును అందలములు సిద్ధము చేసి నిలిపినారు. భూదేవి తన అందలమెక్కి అందులో కుమారుని కూడ ఎక్కించుకొని బయలుదేరినది. శ్రీనాథుడు తన అందలము ఎక్కబోతూ ఉండెను. అంతలోనే స్వామిదర్శనానికి అందలములో గాక, పాదచారియై పోవలెననే సంకల్పము కలిగినది. ఇది శ్రీశైల యాత్రలో చివరి ఘట్టముకదా! వార్ధక్యముచేత ఓపిక తగ్గిననూ బోయీలను అందలముతో సాగుడని చెప్పి తాను కాలి నడకనే బయలుదేరినాడు.

ఈ ఘట్టములో దారి ఎక్కువ భాగము దిగుడే అయినా మధ్య మధ్య ఎగుడు కూడా తటస్థిస్తున్నది. కోసు నడచునప్పటికే బడలిక అనిపించినది. ఐనా పట్టు విడువక నడుస్తూ ఉన్నాడు. అతి కష్టము మీద సాక్షిగణపతిని సమీపించి భక్తితో మ్రొక్కినాడు. ఆ పైన నడవలేక అక్కడనే కూలబడినాడు ఆయన. అందలముతో బోయీలు కనబడకుండా ముందుకు పోయినారు. తక్కిన పరిజనము కూడా శ్రీశైలమల్లేశ్వరస్వామి దర్శన కాంక్షతోనేమి, కవిసార్వభౌముడు తరుచుగా ఏకాంతవాసము కోరు

పనుకొనుట వలన నేమి ఆయన వెంట నుండక ముందు సాగిపోయినారు. అందలము శ్రీశైల ద్వారము చేరుకొన్నది.

అడుగు వేయలేక సాక్షిగణపతి ఎదుట కూలబడిపోయిన శ్రీనాథుడు శ్రీశైల మల్లికార్జునుని వంక ఉత్కంఠతో దృష్టిసారించినాడు. అస్తాద్రిలో సూర్యభగవానుడు కెంజాయలతో అస్తమిస్తున్నాడు. భగవానుని కిరణముల కిమ్మీరిత కాంతిలో శ్రీనాథ కవిసార్వభౌముని ఎరుపు కలసిన పచ్చని దేహకాంతి మరింత ఎఱ్ఱనై ప్రకాశిస్తూ ఉండగా, అస్తంగతు డవుతున్న రెండవ సూర్యునివలె వెలుగుతున్నాడు.

ముందు సాగిన బోయీలు ఆయన ఎంత సేపటికిని రానందున ప్రమాదము శంకించి అందలముతో పరుగు పరుగున "ఓహోం భీం భీం" వినాదములు చేస్తూ వెనుకకు తిరిగివస్తూ ఉండిరి. ఆ పరుగు తొందరలో ముందున్న బోయీలలో ఒకడు కాలికి రాయి తగిలి ఒరిగినాడు. తొందరగా సాగుతున్న బోయీలు ఈ ఆకస్మికపు అడ్డంకికి అందలపు బరువు తోడు కాగా అందరూ తలా ఒక ప్రక్కకు ఒరిగినారు. వారికి అందలముపై పట్టు తప్పిపోగా అది కూలి పడిపోయినది. అందములతోపాటు బోయీలుకూడా కూలబడిరి.

ఆ దారిని పోతున్న యాత్రికులు ఆ ప్రమాదమును చూచి దాని చుట్టు మూగి పరిపరి విధముల మాట్లాడసాగినారు. కొందరు "అయ్యో" అను వారు, కొందరు "అందలము ఖాళీగా వున్నది కనుక సరిపోయినది కాని అందులో ఎవరయినా ఉండి ఉంటే ఎంత ప్రమాదము సంభవించేది" అని బోయీలను మందలించే వారుగా ఉండిరి. కొందరు మాత్రము "ఈ అందల మేవరిద"ని విచారణ చేసినారు. ఇది అంతా శ్రీనాథుడు కదలలేక కూలబడి యున్నచోటికి యాభై విండ్ల దూరము లోపలనే జరిగినది.

శ్రీనాథుడు తన అందలమునూ, బోయీలనూ గుర్తించినాడు. తన

కన్నుల ఎదుటనే జరిగిన ఆ ప్రమాదమునుచూచి నిట్టూర్చినాడు. భూదేవి అందలమైనా సరిగా చేరి ఉండునా అని సందేహము కలిగి కొంచెము ఆతురుడై, లేని ఓపిక తెచ్చుకొని, బయలుదేరి అక్కడకు వచ్చినాడు.

ఆయన వార్ధకములో ఉన్న దివ్యతేజస్సును చూచి ఎవరో మహాత్ముడను భావము కలుగుటచేత ముగ్ధులై అక్కడ కూడిన జనము దారి ఇచ్చినారు.

తన పరివార జనముతో సహా తన అందలము ఆ విధముగా శిథిల ప్రాయమైనందున ఆయనకు హృదయములో శూలఘాతము తాకినట్లు బాధ కలిగినది. కాని వెంటనే నిగ్రహించుకొని ధైర్య మవలంబించి ముందు బోయీల గాయముల సంగతి విచారించినాడు. వారికి కూడా తమ ప్రభువును చూడగానే ధైర్యము కలిగి, దెబ్బలబాధ ఓర్చుకుంటూ, నమస్కరించి తమ పాటు చెప్పుకో తగినంతదికాదని అందలము సరిచేయటానికి యత్నము సాగించినారు. కాని అది తమ ప్రభువును వహించేందుకు యోగ్యముగా లేదు. దాని కొమ్ము ఒకటి భగ్నమైనది. తాము చేసిన తప్పుకు వారు క్షమాపణ చెప్పుకో సాగినారు. అందలము ఎక్కుటకు అవకాశము లేనందున శ్రీనాథుడు ఏమి చేయనూ తోచక నిలుచుండెను. ఇప్పటి బడలికలో కొంత దూరమైనా అందలములో పోయి వుంటే బాగుండు ననిపించింది.

అంతలో భీముని కొలనువైపు నుండి చుక్కల పర్వతము మీదుగా కైలాస పర్వతము నెక్కి వచ్చిన ఒకానొక తండము చేసిన సందడి దగ్గరలో వినబడినది.

అది మహా శివభక్తుల సందడి!

"అమృతదేవయ్యా మహాత్మదేవయ్యా
విమలాత్మ దేవయ్యా విశ్వనాథయ్యా
సర్వజ్ఞ దేవయ్యా శాంతిదేవయ్యా

పర్వత దేవయ్య భద్రదేవయ్య
బాణదేవయ్య నిర్వాణ దేవయ్య
జాణదేవయ్య కల్యాణదేవయ్య
పరసె హోయితు వేగ బన్ని యివగళ
తరలాటనీవు నిందరసిరి యెనుత
గొడ్డవ్వ దుగ్గవ్వ గుగ్గవ్వ బన్ని
సొడ్డల సోవవ్వ షోడశి బన్ని...."

చీకటి పడుతున్నందున ఆ తండమువారు కొంచెము ఆగి వైభవముగా కాగడాలు వెలిగించినారు. సందడిగా వస్తున్నవారు ఎవరో మహాధికార పరివారమై యుండవలెను. విరిగిన శ్రీనాథుని మేనాచుట్టును మూగిన జనమును చూచి వారును ఆగినారు! ఆ తండములో ప్రధాన పురుషుడు తన అందలము ఆపి ఆదరాతిశయముతో ప్రమాద విశేషాలు విచారించినాడు. లోనుండి తొంగి చూడగా వంజుల కాంతిలో గౌరవభావము కలిగిస్తున్న శ్రీనాథుని వృద్ధబ్రాహ్మణమూర్తి కనిపించినది. దానితో ఆకృష్టుడై వెంటనే అందలము ఆపించి దిగినాడు. ఆ నిలిచియున్న వృద్ధుడు ఎవరో మహా ప్రభువు, మహా భక్తుడూ అయి ఉండునని తోచి "విరిగిన అందల మెవరి" దని అడిగినాడు. వెంటనే శ్రీనాథుని బోయీలు శ్రీనాథకవిసార్వభౌమునిదని ప్రత్యుత్తరమిచ్చినారు. ఆయన దానిలో ఉండగానే ప్రమాదము జరిగి ఉంటుందని భావించి, వ్యగ్రతతో, దెబ్బలు తగులలేదు గదా అని అడిగి, లేదని విని, నిట్టూర్పు పుచ్చినాడు.

ఆ అధికారపురుషునికి శ్రీనాథ కవిసార్వభౌముల నామము శ్రుతపూర్వమైనట్లున్నది. అయన శ్రీనాథుని సమీపించి "ముమ్మడి శాంతయ్యను-నమస్కరించుచున్నాను"అని భక్తితో నమస్కరించి "తమ దర్శనభాగ్యము చేత ధన్యుడనైనాను" అని ప్రమాద విశేషాలు తెలుసుకొన్నాడు. ఆ పిమ్మట

అతడు శ్రీనాథుని బలవంతము చేసి సగౌరవముగా తన అందలముపై ఎక్కించి తాను పాదచారియై సాగినాడు. వద్దని శ్రీనాథు డెంత చెప్పినా వినలేదు. అయినా అప్పటికే చాలా బడలి ఉన్నందున తాను ఎక్కువ పట్టు పట్టక కొద్ది ఒత్తిడితోనే సమ్మతించినాడు.

ఇంత సేపూ అవతల భూదేవి అందలము దింపించి శ్రీనాథుని అందలమునకై ఎదురు చూస్తున్నది. ఎంత సేపటికీ అది రానందున ఆమెకు, బోయీలకు, పరివారమునకు కలిగిన ఆతురత ఇంతా అంతా కాదు. అందులో భూదేవి లోకానుభవము లేనిది. సంసారయాత్ర అంతా శ్రీనాథుని సూచనం ప్రకారమే జరిగిపోతున్నది. ఆమె స్వతంత్రముగా ఏదీ ఆలోచించలేదు, చేయలేదు. ఇప్పుడు తన్ను ఇట్లా అసహాయురాలిగా భర్త వదలి వేస్తున్నా డనే తోస్తుంది. దానితో అసమర్థతతో కూడిన చిరుకోపముకూడా వస్తున్నది. కాని భర్త కాలి నడకతో వస్తుంటే ప్రమాద మేమైనా సంభవించిందేమోనని అనుమానము కూడా కలుగలేదు. ఎదురుపోయిన అందలమూ, బోయీలూ ఏమైనారో అను ఉత్కంఠకూడా కలుగలేదు. నన్ను బాధపెట్టుటకే అందరూ కలిసికట్టుగా పని చేస్తున్నారనియే ఆమె కనిపిస్తున్నది. వెంట ఉన్న బోయీల మీదను, పరివారము మీదను, చిర్రు బుస్సు లాడుతున్నదే కాని వారిని భర్తకొరకై వెళ్ళుడని పురమాయించనయినా లేదు. ఒకరిద్దరు వెళ్ళి వత్తుమని సూచింపగా "అంతా నన్ను వదలివెళ్ళటానికి ప్రయత్నించేవారే." అని నిష్ఠురము లాడినది. దానితో పరిజనమునకు ఏ మనుటకును భయమై అక్కడనే నిలిచిపోయిరి.

## 2

శ్రీనాథుడు అందలమెక్కిన కొద్ది సేపటికే విశ్రాంతుడైనాడు. ముమ్మడి శాంతయ్య చూపుతున్న వినయ గౌరవాలు అతన్ని ఎంతగానో

ముగ్ధుణ్ణి చేసినవి. అతడు చూపుచున్న వినీత భావము తన యెడల పెద్దలు ప్రదర్శించడము చూచి రెండు మూడు సంవత్సరాలు కావచ్చింది. కపిలేశ్వర గజపతి సేనలకూ, రాజమహేంద్రవరపు రెడ్డి సేనలకూ ఆరంభమైన యుద్ధాలతోనే ఆయనకు చిక్కులారంభించినవి. వీరారెడ్డి ప్రభువుల సేవకులు ఆయనకు నియతముగా చేదుస్తూ ఉండిన పెద్దాలు, కట్టడులు బరువ లేకుండిరి. బెండపూడి అన్నామాత్యుల దర్శనమే అసాధ్యమయినది. ఆయనకూడా ప్రభువులతో కలిసి యుద్ధాలుచేస్తూ, సేనలు నడుపుతూ తీరిక లేకున్నాడు. వరుసగా రాజమహేంద్రవర సేనలు అనేక యుద్ధాలలో పరాఘాతములైనవి. రాజమహేంద్రవర మహాదుర్గము కూడా తుదకు గజపతి సేనల వశమైనది.

అంతకుముందే శ్రీనాథుడు కుటుంబముతో రాజమహేంద్రవరము వదలి తనకున్న విలువగల అంబరాభరణాదులతో సప్త గోదావర మధ్య మందలి కోనసీమ చేరుకొన్నాడు. అక్కడ మారుమూల గ్రామాలలో తలదాచుకుంటూ తన ప్రభువుల విజయమునే కాంక్షచేస్తూ రోజులు వెళ్ళబుచ్చుతున్నాడు. ఆయన కాంక్షలు నెరవేర లేదు. గజపతులే జయించిరి.

రాజమహేంద్రవర దుర్గము గజపతి వశమైన తర్వాత అన్నామాత్యుని జాడగాని, ప్రభువుల జాడగాని తెలియ రాలేదు. వారు వీర స్వర్గమలంకరించినారని కొందరు అంటున్నారు. కాదు, పలాయితులై శ్రీవిద్యానగర రాజ్యములో తలదాచుకొంటూ సమయము కోసము ఎదురు చూస్తున్నారని మరి కొందరంటున్నారు.

ఇంతలో గజపతుల సేనానులు, ఉద్యోగులు రాజమహేంద్రవర రెడ్డి రాజ్యమును నెమ్మది నెమ్మదిగా ఆక్రమిస్తూ, పూర్వము కొండవీటి రాజ్యము క్రింద ఉండి, శ్రీవిద్యానగర నరపతుల వశమైన భాగాలు కూడా

కొన్ని తమ హస్తగతము చేసుకొంటున్నారు. వారిలో చాలా మందికి ఆంధ్రభాషరాదు. వారికి ఓఢ్రమూ కచ్చా పచ్చాగా ఆంధ్రమూ వచ్చిన వారి సేవకులో, కచ్చాపచ్చాగా ఓఢ్రము వచ్చిన ఆంధ్రులో దుబాసీలుగా వ్యవహరిస్తున్నారు. అసలే ఆ ఉద్యోగులకు క్రొత్తగా జయించిన ఈ దేశములోని ప్రజల యందు విశ్వాసముగాని, ఆదరము కాని లేదు. ఇక భాషలు వచ్చీరాని దుబాసీలు పొరపాట్లవల్లనో, తమకు లంచములు ముట్టనందున బుద్ధి పూర్వకముగానో చేస్తున్న విపరీతపు తర్జుమాలవల్ల, స్వభావ సిద్ధముగా మంచి అధికారులు కూడా ఉగ్రులై ప్రజలను పీడిస్తూ ఉన్నారు. ఇక లంచగొండి ఉద్యోగులు చేస్తున్న దుండగాలకు అంతే లేకున్నది.

పైగా వారిలో కొందరు మునల్మానులు కూడా ఉన్నారు. వారికి తాము చేసిన సహాయమువల్లనే గజపతి సేనలకు విజయము ప్రాప్తించినదనే దురహంకార మున్నది. అట్టివారు స్వయంగా నిష్కారణంగా వ్యవరిస్తూ ఓఢ్రోద్యోగులచేత దుష్కార్యాలు చేయిస్తున్నారు. ఈ విధముగా దేశము అల్లకల్లోలముగా ఉన్నది.

ఈ స్థితిగతులలో శ్రీనాథుడు కింకర్తవ్యతామూఢుడై ఉన్నాడు. ఐనా భూదేవికి వెనుకటి దర్పము పోలేదు. భర్తకూ, పరిజనులకూ ఏమి కష్టము కలుగుతున్నదో అనే ఆలోచనయే ఆమెకు రాదు. అందరూ తన సుఖజీవనానికీ, గౌరవ స్థితికీ పాటుపడవలసినవారే అని ఆమె భావన. భార్యను భరింపవలసిన విధి కాదా భర్తది: శ్రీనాథుడు కూడా ప్రకృతి సిద్ధమైన సహృదయతవల్లనేమి, తన కంటె భార్య ముప్పదేళ్ళు చిన్నదనే ఆలోచనతోనేమి, ప్రేమతో పితృవాత్సల్యము కూడా జోడించి, ఆమె మాటలు పసిపిల్ల మాటలుగా గ్రహిస్తూ, ఆమెకు ఏ విధంగానూ ఏ మాత్రమూ కష్టము కలుగకుండా పాటుపడుతున్నాడు! ఆమెకు రవ్వంత

సౌఖ్యలోపము కలిగించినా పరిజనులను సహించేవాడుకాదు. అందుచేత అందరూ తాము ఎన్ని కష్టాలైనా పడి ఆమెకు సుఖముగా గడిచి పోవడానికి ప్రయత్నిస్తున్నారు.

ధనాభావముచేత శ్రీనాథుడు నానాటికీ పరివారమును తగ్గింపవలసి వస్తున్నది. ఒక్క సేవకుడు తగ్గినా, భూదేవి తానెంతో ఇబ్బంది పడుతున్నట్లు గుసిపి గోలచేసేది. కాని శ్రీనాథున కది తప్పనిసరి అవుట చేత ఆమెను బ్రతిమాలి బుజ్జగించి ఏదో విధముగా సమాధానపెట్టు చున్నాడు.

పైగా శ్రీనాథుని ప్రథమ కళత్రమైన శ్రీదేవి పరమ పదించుచు వదలి వెళ్ళిన కుమార్తె బ్రాహ్మికూడా ఈ మధ్య కాలగతిపొందినది. ఆమెకు ఒక్కడే కుమారుడు. అతనిపేరు కుమారస్వామి. ఆ బాలుని పోషణముకూడ శ్రీనాథుడు భరింపక తప్పలేదు. వానిని పోషించుట భూదేవికి ఏ మాత్ర మిష్టములేదు. అతడు కనపడిననే ఆమెకు అసహ్య మనిపించును. తనకు పిల్లలు పుట్టలేదు. ఎన్నడో గతించిన తన సవతి దౌహిత్రుని పోషణ భారము తనమీద పడుట ఆమెకు భరింప రాకున్నది. ఆమె తన అయిష్టము దాపరికముచేసే అలవాటు లేనిది. ఈ వార్ధకములో తనకున్న ఒక్క కుమార్తెకూడా గతించి ఈ పిల్లవానిని తనకు అప్పగించి పోయినందున వానిమీద శ్రీనాథునకు విపరీతమైన ప్రేమ పొంగి పొరలు తున్నది. తనకు శ్రీదేవీ, బ్రాహ్మి సాక్షాత్తుగా కుమారస్వామినే, ఈ బాలుని రూపములో, తమ ఇద్దరికి మారుగా, వదలి పోయినట్లు ఆయనకు అనిపిస్తున్నది. ఆయనకు దౌహిత్రునిమీద వాత్సల్యము శ్రీదేవీ బ్రాహ్మిల స్మరణచేత ముప్పిరిగా ఉప్పొంగు తున్నది. కుమారుని పోషణ విషయములో మాత్రము శ్రీనాథుడు భూదేవి మాటగూడ ఎంత మాత్రము సాగనిచ్చుటలేదు. అది భూదేవికి బాలునిపై గల ద్వేషమును ద్విగుణీ

కరిస్తున్నది. కుమారునికిగూడ శ్రీనాథుడంటే అపరిమితమైన ప్రేమ. వానికి ఆయనే తల్లి, తండ్రి, తాత! ఆ పసివాడు తనమాట ఇంటిలో నిరాఘాటముగా నెగ్గించుకుంటున్నాడు.

ఈనాడు భూదేవి అందలములో వచ్చిన కుమారుడు తమ అందలము బయలుదేరినప్పటి నుండి "తాత ఏడీ?—తాత నడిచివస్తున్నాడు—నేనూ దిగి నడుస్తాను!—తాతా, తాతా!" ఈ మొదలుగాగల గోలచేస్తూ కేకలు పెట్టుతూ ఏడుపు సాగించినాడు.

భూదేవి కసరుచున్నది, కళ్ళెఱ్ఱచేసి తర్జిస్తున్నది. కుమారుడామె బెదిరింపులు లెక్కచేయుట లేదు. వానిని కొట్టవలెనని ఆమె చేయి ఎన్నో సారులు పైకి లేచినది. కాని దెబ్బ వేయుటకు ఆమెకు ధైర్యము చాలలేదు. తమ యింటి కతడు వచ్చిన కొత్తరోజులలో, ఆతనిని ఒకనాడు గట్టిగా బుగ్గలు సాగదీసినది. శ్రీనాథు డింటికి వచ్చినప్పటికి వాని బుగ్గలు ఎఱ్ఱపడి వాచి కమలివున్నవి. శ్రీనాథుడు కారణమడిగినాడు. భూదేవియే "కారణమిది" అని పిల్లవాడానాడు చేసిన ఆగడమంతా చెప్పినది. ఆమె కాపురానికి వచ్చిన ఇన్నేళ్ళగా ఎన్నడూ ఆమె చూచి ఎరుగని ఉగ్ర భయంకర రూపము శ్రీనాథునిలో ఆనా డామె చూచినది. అప్పుడాతడు తన్ను చంపిపారవేయునేమో అని కూడా భయపడినది. పురాణాలలో విన్న వీరభద్రరౌద్రాకారమే తన భర్తలో మొదటిసారి దర్శించి గడగడలాడినది. అది తన్ను ప్రేమతో,-లాలనతో, ఓర్పుతో, వాత్సల్యముతో బుజ్జగించే ప్రేమ మూర్తికాదు. ఆమె ఆపాదమస్తకము కంపించినది. కాళ్ళు నేలపై నిలువ లేదు. మూర్ఛ వచ్చుచున్నట్లయినది. అది శ్రీనాథుడు కనిపెట్టినాడేమో, వెంటనే తన రౌద్రాకారము ఉపసంహరించుకొని, కుమారుని చేతులతో నెత్తుకొని బుజ్జగిస్తూ, వాడు తన్ను కౌగిలించుకొని ఏడ్వగా శ్రీనాథుడును కంట తడిపెట్టినాడు.

భర్తకంట తడిపెట్టుట భూదేవికి ఎరుకలోలేదు. ఆయనకు ప్రథమ కళత్రమైన శ్రీదేవిమీదను, కుమార్తెయైన బ్రాహ్మిమీదను ఎంత ప్రేమ ఉండెనో భూదేవికి ఏమి ఎరుక! అది ఆమె కానాడు చూచాయగా తెలియ వచ్చినది. ఆ యిద్దరిపైన శ్రీనాథునకు ఉన్న ప్రేమ దౌహిత్రునిపైన ప్రేమను శతగుణముగా చేసి రూపొందినది. దాని స్వరూప మిట్టిదని భూదేవికి తెలియకపోయినా, ఆయన కుమారుని యందు ఉన్న ప్రేమ తనకీ జన్మలో అందుకోరానిదని ఆమె కానాడు గ్రహింపు కలిగినది. ఆ తర్వాత ఆమె ఎన్నో సారులు పిల్లవానిమీద చేయి చేసుకోబోయినది కాని ఆమె కంతలో శ్రీనాథునిలో ఆనాడు దర్శించిన వీరభద్రాకారము స్మరణకు వచ్చి ఆ పని చేయసాహసించేదికాదు. మునుపెన్నడూ రానంత కోపము ఈనాడామెకు కలిగినా, పిల్లవానిమీదచేయి చేసుకొనడానికి ఈనాడు కూడా సాహసింప లేకపోయినది.

ఇంతలో దివిటీల వెలుగులో వైభవముగా తన భర్త వెండి పల్లకీలో వచ్చుచుండుట ఆమెకు కానవచ్చినది. భర్తను దూరాన చూడగానే, "అడుగో, మీ తాత వచ్చినాడు, పో!" అని కుమారుని చిన్న త్రోపు త్రోసినది, కాని మరుక్షణమే ఆలోచింపగా ఆ వెండి అందలములో నుండి అవతరించిన తన భర్తను ఎవరో పెద్ద అధికారి పరివార సహితముగా గౌరవాతిశయముతో తోడితెచ్చుట చూడగానే ఆమెకు ఆశ్చర్యమైనది. ఆ యద్భుతదర్శనముతో ఆమె నిర్విణ్ణురాలైనది. అంతవరకు పొందుతున్న విసుగూ, రోషమూ ఒక్క పెట్టున మాయమైనవి.

కుమారుడు మాత్రము ఆగక సరాసరి పోయి మరి ఎవ్వరిని పట్టించుకోక శ్రీనాథుని కాళ్ళు గట్టిగా కౌగిలించుకొన్నాడు. ఆర్ద్రస్పర్శకల కన్నులతో శ్రీనాథు డాతనిని ఎత్తుకొని వాని కన్నీరు తుడిచి చిబుకము, కపోలములు పుణికి శిరస్సు ముద్దాడినాడు. ఆపైన కుమారుడు తాత

చేతుల నుండి దిగక "తాతా, తాతా" అంటూ ఆయన కంఠము గట్టిగా పెనవేసుకొన్నాడు. వానిని బాహువులలో పొదువుకొనియే శ్రీనాథుడు ముందుకు సాగినాడు. శ్రీనాథుని పుత్రవాత్సల్యానికి ముగ్ధుడై శాంతయ్య గౌరవముతో సపరివారముగా వెంట అనుగమించినాడు.

ఇంతలో శ్రీనాథుని ప్రధాన సేవకుడు ఎదురు వచ్చి నమస్కరించి ఆ పట్టణములో స్వామి ఆలయ సమీపమునందే ఒక చిన్న గృహము తమ విడిదికి ఏర్పాటు చేసినానని విన్నవించినాడు. అది విన్నవెంటనే శాంతయ్య ఆ ఇంటికి శ్రీనాథులవారు రారని తన భటునిచేత కబురు పంపించి, శ్రీనాథుని సపరివారముగా శ్రీశైలములో ఉన్నన్నాళ్ళు తన గౌరవాతిథిగా ఉండుడని ప్రార్థించెను. శ్రీనాథునికి ఒప్పుకొనక తప్పలేదు. శాంతయ్య చిన్న కోటవంటి తన ఆవరణములోనే బ్రాహ్మణాతిథులకిచ్చే పెద్ద మందిరములో శ్రీనాథుని సపరివారముగా విడియింపజేసినాడు.

అంతట శ్రీనాథునకు శ్రీశైల మల్లేశ్వరస్వామి దర్శనములోని విశేషాచారములు తెలియునో తెలియవో అని సందేహించి "కవిసార్వభౌములవారు సకుటుంబ పరివారముగా ధూళి దర్శనార్థము దయచేయుచున్నారు" అని తన భటునకు బిగ్గరగా చెప్పి స్వామి కోవెలకు పంపెను. ఆ సూచనను ఆదేశముగా గ్రహించి స్థానికాచారమును మన్నించి ధూళి ధూసరమైన పాదముతోనే శ్రీనాథుడును, ధర్మపత్నియు, కుమారుడును స్వామిని దర్శించి, స్వామి లింగమూర్తికి శిరస్సును తాకించి "చెవిటి మల్లియ్య తండ్రీ! నీ దర్శనానికి వచ్చినాను. భారద్వాజసగోత్రుడ్ని. శ్రీనాథ శర్మను, కటాక్షించు దేవరా!" అని శ్రీనాథుడును, యథోచితముగా తక్కినవారును చెవిటిమల్లియ్యకు వినపడేటట్లు ఆర్తఘోష చేసినారు.

# 3

నూతన యాత్రాస్థలములో ఇంత సుఖముగు విడిది దొరకునని భూదేవి ఊహించలేదు. దొరికిన చిన్న విడిదితో ఇబ్బంది పడుటకే ఆమె సిద్ధపడి వచ్చినది. కాని ఎన్నడూ ఎరుగని ఈ క్రొత్తస్థలములో రెడ్డిరాజుల ఐశ్వర్య కాలములో రాజమహేంద్రవరమున ఉన్నట్లుగానే ఈనా డిక్కడ రాజభోగముగా జరుగుట భూదేవికి ఆశ్చర్య సంతోషములు కలిగించినవి. తన భర్త ఇంత గొప్పవాడా అనే భావము కూడా మొదటిసారిగా ఆమె కీ నాడు కలిగినట్లున్నది. ఆ రాత్రి అంతా ఆమె ఆ ఆలోచనలతోపాటు తనకు కుమారుని వంటి కుమారుడు కలుగలేదనే లోటు తలుచుకొని చింతలో గడపినది.

ఆ మరునాటి ఉదయమున భూదేవి స్వామి దర్శనము చేసి వస్తూ స్వామి ముఖమండపములో పౌరాణికు డొకడు పురాణ ప్రవచనము చేయు చుండగా చూచి కొంతసేపు ఆగి శ్రద్ధగా ఆలకించినది. సరిగా అప్పుడే మహాభారతములోని పుత్రోత్పత్తి ప్రశంస వచ్చినది. అపుత్రకులకు పుణ్య లోకము లేదని పౌరాణికు డానాడు విస్తరించి ప్రవచనము చేసెను. అది విన్న తరువాత భూదేవికి ఆ క్రిందటి రాత్రి కలిగిన పుత్రచింత యినుమ డించినది.

శ్రీశైలము వచ్చినదాది శ్రీనాథుడు శాంతయ్యతోను, ఆ పట్టణములో చేరిన పండితులతోనూ విద్యద్గోష్ఠులు చేయుచు ఎక్కువగా ప్రొద్దు పుచ్చు చున్నాడు. పాతాళగంగకు నడచిపోలేక శ్రీనాథుడొకనాడు డోలీమీదనే వెళ్ళి స్నానముచేసి వచ్చినాడు. నిత్యము త్రికాలములయందు స్వామిని దర్శించి శతరుద్రీయముతో అభిషేకించి సేవించుచున్నాడు.

ఒకనాటి సాయంకాల మాతడు పండిత గోష్ఠినుండి యింటికి వచ్చి

చూడగా భూదేవి కనబడలేదు. విచారింపగా ఆమె దిగులుతో మంచముమీద పరుండియున్నదని తెలియవచ్చినది. శ్రీనాథునకు కాళ్ళాడలేదు. వెంటనే ఆమె పరుండియున్న గదిలోకిపోయి, ఆదరముతో ఆమెను బుజ్జగింప సాగినాడు.

"ఏల ఏడ్చెదు, చెప్పవే యిందు వదన
విపుల శోకభరంబున వెక్కి వెక్కి
త్రాట గ్రుచ్చిన ముత్యాల దండవోలె
జిన్నుగవ నున్న వీ బాష్పజలకణములు.
"ఏల చింతించెదవు చెప్పు మిందువదన
గండపాళిక గెంగేలు గదియజేర్చి.
"నెలత, నులివేడియైన నీ నిడుదయూర్పు
మాటిమాటికి నిపుడు నా మానసంబు
గంప మొందించుచున్నది, కల్లగాదు
ప్రబల భవదీయ వక్షోభవంబు బోలె.
"అపరాధము సేయ గదా
చపలాయతనేత్ర! యేను జనవున నేని
న్నిపుణతతో జింతించిన
నెపమేదియు గానరాదు నీ నెగులునకున్.
"భవదాయత్తము విభవము
భవదాయత్తంబు సువ్వె ప్రాణము నాకున్
భవదాయత్తము సర్వము
ధవళాంబుజ పత్రనేత్ర తథ్యంబరయున్
"ఈ దుఃఖంబునకున్ గారణంబేమి చెప్పుము."

పై పద్యాలు చెప్పుకున్నా వాటి తాత్పర్యముగల మాటలతోనే అత డామెని బుజ్జగింపసాగినాడు. బుజ్జగించిన కొలది ఆమె ఏడ్పు అతిశయించి ఎగరొప్పు కూడా వచ్చినది. చివరకు ఆమె పరిచారిక ఆమె చింతకు కార ణము వివరించినది. ఆమె కీమధ్య సంతానము కలుగలేదనే చింత పట్టు కొన్నదని, ఆ మధ్య ఒకనాడు శ్రీశైల మల్లికార్జునస్వామి ముఖమండప ములో మహాభారత శ్రవణములో పుత్రులు లేనివారికి పుణ్యగతులు లేవని చెప్పగా విన్నప్పటి నుండి ఆ చింత మరింత అతిశయించినదని విన్న వించినది.

"ఇందుకేనా చింత!—నేను ఎంతకాలముగా ఈ చింతతో నుంటినో ఎరుగవు కాబోలు! ఈ శ్రీశైల ప్రయాణము తలపెట్టినది కూడా ఆ కోరిక తోనే సుమా! నీకు కూడా ఇంతకాలము ఈ చింత కలుగలేదనే విచారపడు తున్నాను. ఇప్పుడు నీ కీ చింత ఇక్కడ కలుగుట కూడా శుభ సూచనమే! మల్లికార్జునస్వామిని పుత్రార్థినివై ప్రార్థించు. నేను ఎన్నో వ్రతపూజాదులు తలపెట్టి కూడా నీకు శ్రమ కలిగించటానికి జంకి చెప్పకున్నాను. ఇప్పుడు నీ కీ చింత కలుగుటే స్వామికి మనలను అనుగ్రహించే ఇచ్ఛ కలిగిన దను టకు తార్కాణము! భక్తానుగ్రహ దీక్షితుడు మల్లికార్జునస్వామి! లే, శుచి వైరా, స్వామి దర్శనానికి ఇప్పుడే వెళ్ళుదాము" ఇట్లా అంటూ భూదేవి కన్నీరు తన ఉత్తరీయపు చెరగుతో, తుడిచి, అర్ధాలింగన మొనర్చుకొని ఆమెను లేవదీసినాడు. ఆమె స్వస్థురాలై లేచి శుచియై మడుగు వస్త్రము ధరించి భర్తతో కలసి మల్లికార్జునస్వామి దర్శనానికి బయలుదేరినది. శ్రీనాథుడు భూదేవితో కలసి స్వామిని భక్తిపూర్వకముగా మల్లికా పుష్పా లతో అర్చించినాడు. ఆ పిమ్మట భ్రమరాంబ సన్నిధికి వెళ్ళి ఆమెను విర జాజి పువ్వులతో అర్చించినాడు. ఆ రాత్రి భూదేవికి విచిత్రమైన స్వప్న మైనది.

ఆమె పూలపాన్పుమీద పరుండి ఉన్నది. సువాసన కలసిన చల్లని గాలి మెల్లిగా ఆమె నాసాపుటములలో చొచ్చి ఆమెకు చిత్రమైన మైమరపు కలిగించినది. తన పాన్పుమీద ఉన్న పుష్పములలో ఒక పద్మము చిత్రముగా ఆమె గర్భగోళములో చేరినట్లయినది. అది అంతతో బయటకువచ్చి తన రెండు రొమ్ములనూ హత్తుకొని చెప్పరాని మరపు కలిగింపసాగినది. ఆ పద్మము నెమ్మది నెమ్మదిగా పెద్ద పెద్దది కాసాగినది. ఆమెకు కలుగుతున్న హర్షము ఆమె జన్మలో అంతకుముం దెన్నడు అనుభవించినది కాదు. తన స్తనములేకాదు, తన దేహమంతా అమృతపూరములు ఊరుచూ చల్లదనము కలిగిస్తున్నట్టు తోపసాగినది. ఆ ఆనందములో మైమరచియుండగా ఎప్పుడు పోయినదో - తెలియకుండా తన కేశపాశము కనబడలేదు. ఒక్కసారి భయమై, కెవ్వున కేకవేసినది.

ఆ గదిలోనే వేరొక శయ్యపైన నిద్రిస్తున్న శ్రీనాథుడు ఆమెను వక్షస్స్థలముపై మృదువుగా నిమిరిలేపినాడు. ఆమె వడకుచూ ముందు శిరస్సును చేతులతో తడవుకొని తన కేశ పాశము ఉన్నట్లు నిశ్చయించుకొన్నది. కాని ఆమెకు కన్నీ రాగలేదు. ఆమె భర్తకు గాఢముగా స్వయంగ్రాహమిచ్చి మరింత ఏడువ సాగినది. కారణమేమని ఎంత అడిగిననూ మాట్లాడదు. కొంత సేపటికి తనకు వచ్చిన స్వప్నములోని సుఖభాగము మాత్రము చెప్పి మరింత ఏడువసాగినది.

అది విని, శ్రీనాథుడు, "నీకు శుభ స్వప్నము వచ్చినందుకు సంతోషింపక దుఃఖిస్తావేమి!" అని ఎన్నిసార్లు అడిగినా ఉత్తరమీయదు. భూదేవికి కూడా శ్రీదేవికివలెనే ఏమైనా ప్రసవ మరణము కలిగే సూచన ఉన్నదేమో అని మరి మరి శ్రీనాథుడు అడుగ సాగినాడు. కాని ఆమె మాట్లాడక ఏడ్చుచునే ఉన్నది. ఏడ్చి ఏడ్చి అలసి అలసి ఆమె తుదకు తన్నూదారుస్తూ ఉన్న భర్త రొమ్ముపై వ్రాలి సుఖనిద్రపోయినది.

శ్రీనాథునకు మరునాటినుండి శ్రీదేవి ప్రసవించి తన్ను ఒంటరిని చేసి పోయినట్లే భూదేవి కూడా సంతానమును ప్రసవించి ఒంటరిని చేసి పోవునేమో అనే దిగులు అంకురింపసాగినది. శ్రీదేవితో తన సంసారము స్వర్గతుల్యముగా సాగిపోయినది. తరువాత భూదేవితో కాపురము భూలోక జీవితమువలెనే సుఖదుఃఖ సమ్మిశ్రమమై సాగుతున్నది. ఇప్పు డీ భూదేవి ఈ ఈడులోనున్న తనను ఒంటరినిచేసిపోతే తనపని ఏమి కావలయును?— ఈ భావము స్ఫురించగానే ప్రయత్న పూర్వకముగా దానిని శ్రీనాథుడు మనస్సులోనుంచి నెట్టి వేయసాగెను.

భూదేవికి నెల తప్పినదే వ్యవధానముగా తీవ్రముగా వేవిళ్ళు ఆరంభించినవి. అవి కూడా వయస్సు ముదిరిన తరువాత కలిగిన ప్రథమ గర్భమైనందున బాధ తీవ్రతరముగా ఉన్నది. తరచుగా శ్రీనాథుడామెను వదలక బుజ్జగింపవలసి వస్తున్నది.

శాంతయ్యకు శ్రీనాథుని కోరిక మల్లికార్జునస్వామి కటాక్షముచేత ఫలించినందున కలిగిన సంతోషానికి మేరలేదు. ఆ సంతోషముతోపాటు శ్రీనాథకవిసార్వభౌముని యందు పర్వత మల్లయ్య సంపూర్ణానుగ్రహ భావముతో ఉన్నాడనే విశ్వాసము కలిగినందున ఆయన యందుగల భక్తి భావము ఇప్పుడు ఇనుమడించినది.

# 4

శ్రీనాథ మహాకవి ఒకనాటి సాయంకాలవేళ సంధ్యా వందనాదిక మాచరించి మల్లికార్జునస్వామిని అర్చించి ముఖ మండపములో కుశాసనాసీనుడై ఈశ్వర ధ్యానము చేస్తున్నాడు. అప్పుడు ఎదుట ఎవరో నూతన వ్యక్తి భయభక్తులతో నిలిచి ఉన్నట్లు సంధ్యా దీపకాంతిలో తోచినది. ఆ

నూతన వ్యక్తికి తన దర్శనానందముచేత దేహమంతట కలిగిన పులకాంకు రములు కాని, ముఖచంద్రుడు వెలార్చుచున్న చిరునవ్వు మొలకల క్రొత్త వెన్నెల కాని గమనించగల సూక్ష్మదృష్టి వార్ధకముతో శ్రీనాథునికి క్షీణించి నది. ఆ నూతనవ్యక్తి అప్పుడే శ్రీశైలముచేరి స్వామి ధూళి దర్శనముచేసి విడిది చూచుకొనబోతూ శ్రీనాథభట్టును చూచి గుర్తించి, పూర్వపరిచితు డగుటచేత కాబోలు, నమస్కరించవచ్చి, ధ్యానభంగము చేయుట కిష్టములేక వేచియున్నట్టున్నాడు. శ్రీనాథుడింతలో అతని గమనించి తేరిపారజూచినాడు. ఆ నూతనవ్యక్తికి తానంతకుముందే ఆలయములో దర్శించిన మల్లికార్జున స్వామియే ఈ ముఖ మండపములో శ్రీనాథ స్వరూపముతో ప్రత్యక్షమైనా డనిపించినది. వెంటనే అతడు అప్పటికే నడుముకు కట్టి ఉన్న ఉత్తరీయ ముతో వినీతుడై వంగి—

> "వాలిన భక్తి మ్రొక్కెద నవారిత తాండవ కేలికిన్ దయా
> శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మమయూఖ మాలికిన్
> బాలశశాంకమౌళికి గపాలికి మన్మథ గర్వపర్వతో
> న్మూలికి నారదాది ముని ముఖ్య మనస్సరసీరుహాలికిన్॥"

అనుచు పాదాభివందనముచేస్తూ, భక్తితాత్పర్యాలు కలసిన ప్రేమతో శ్రీనాథుని పాదములు కళ్ళకద్దుకొని నిలవబడినాడు.

ఈశ్వర ధ్యానము చేస్తూ ముఖ మండపములో తానుండగా, ప్రతి దినమూ ఎందరో మ్రొక్కిపోతూ ఉండుట అభ్యాసమే కాని తాను ఎన్నడు విని ఉండని ఈ క్రొత్త పద్యము కవిసార్వభౌముణ్ణి ఆకర్షించింది. ఇప్పుడు తేరి చూడగా ఆ వ్యక్తి ముఖములో తాను పూర్వపరిచితుడనని వ్యక్తము చేస్తున్న చిరునవ్వుకూడా అవగతమైనది. కాని గుర్తు తగులలేదు. ఇంతలో ఆ నూతన వ్యక్తి మరింత వికసించిన ముఖముతో ఇంకొక పద్యము చదివినాడు.

"అమ్మల గన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలపె
ద్దమ్మ, సురారులమ్మకడు పాఱడిపుచ్చినయమ్మ తన్ను లో
నమ్మినవేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వకవిత్వపటుత్వసంపదన్."

అప్పటికీ అతడెవ్వరో శ్రీనాథునకు గుర్తుతగులలేదు. నిండుయౌవ నముతో ముప్ఫయిఐదు, నలభై ఏళ్ళ మధ్య వయస్సుతో మానినీ మన్మథుని వలె ఉన్న అతని సుందరాకారము శ్రీనాథుని ఆకర్షించినది. ఆ వ్యక్తి ఇప్పుడు మరింత విప్పారిన ఆకారముతో గౌరవము పొంగువారుతుండగా మరొక్క పద్యము చదివినాడు.

"లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామమ్ము మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబు నై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై."

ఇప్పటికీ శ్రీనాథున కాతని రూపము గుర్తుకు రాకున్నా, అతని కంఠము స్పష్టముగా గుర్తించినాడు. తాను గుర్తించినట్లు ప్రత్యక్షంగా చెప్పక ఈ పద్యము చదివి సూచించినాడు.

"ఇంతింతై వటు డింతయై మరియు దా నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున కల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై."

ఈ పద్యము చదువుటతో శ్రీనాథు డప్పటికి పాతికేళ్ళ పై కాలము క్రిందట యాదాలాపంగావిని నోటబట్టి తన శతావధానములో దేవరాయల సభలో వినిపించిన పద్యము తనకింకా జ్ఞాపకమున్నదని ఆ వ్యక్తికి వాచ్య ముగా కాక వ్యంగ్యముగా వ్యక్తము చేసినాడు. వెంటనే ఆ వ్యక్తి దాపరి

కము మాని తన కౌండిన్య గోత్రప్రవరచెప్పి "ఆపస్తంబ సూత్రః యజుశ్శాఖాధ్యాయీ పోతనేశ్వర శర్మాహం భో అభివాదయే" అంటూ శ్రీనాథునకు అభివాదనము చేసినాడు. శ్రీనాథు డతనిని ప్రేమతో లేవనెత్తి గాఢాలింగనము చేసికొని చిబుకము దువ్వి మరల మరల మూర్ధాఘ్రాణముచేసి, "ఎంతవాడవైనావురా పోతన్నా" అంటూ వాత్సల్యాతిరేకముతో ఆదరించినాడు. పోతన ఆనంద బాష్పాలు కారుస్తూ శ్రీనాథుని కౌగిటిలో ఒదిగిపోయినాడు.

"ఇప్పుడే వస్తున్నట్టున్నావు, వాలకము కనబడుతూనే ఉన్నది. ఆ వెనక ఉన్నవారెవరు?"

అంతవరకు కొంచెము దూరంగా ఉన్న అరవై యేళ్ళ పండు ముత్తయిదువ వచ్చి శ్రీనాథునకు పాదాభివందనము చేయగా, "మా అమ్మ లక్కాంబ" అని పోతన పరిచయము చేసినాడు.

ఇంతలో రెండేళ్ళ పసివానిచేత ముందు శ్రీనాథునికి మ్రొక్కించి ముప్పదై దేళ్ళ ముత్తయిదువ నమస్కరించింది.

"వీడు మల్లన్న. నాకు పిల్లవాడు కలిగితే మల్లన్న అని పేరు పెట్టుకొని స్వామివారి దర్శనానికి తీసుకొని వస్తానని మా అమ్మ మ్రొక్కుకొన్నది. ఆ మ్రొక్కు తీర్చుకోడానికి ఇట్లా రాగా, అపర మల్లేశ్వరులయిన తమ దర్శనభాగ్యము కూడా కలిగింది."

"కాబట్టి ఈ అమ్మాయి నా చిట్టిచెల్లెలన్నమాట — నీ కంటె చెల్లెలే బాగున్నదిరా, పోతన్నా ! — తల్లీ, నీ పేరేమమ్మా, చెప్పినావు కాదు?"

"ఎల్లమ్మ అంటారు బాబూ!"

"తల్లీ, సరిగ్గా పోతన్న పేరుకు దీటైనదమ్మా!"

"మావైపున ఇంకా తెలుగు దేవతల పేర్లమీద అభిమానము పోలేదు!"—అక్కమ్మ అందుకొన్నది.

"కాబట్టి నాపేరు పోతన్న ముందే మీకు చెప్పినాడన్నమాట! తల్లీ, మావైపునా ఆ అభిమానము పోలేదు. మా నాన్న పేరు మారయ్య. మా అమ్మ పేరు భీమమ్మ. మా ముత్తాతగారికి ఉండిన సంస్కృతాభిమానముతో వారు మా తాతగారికి కమలనాభయ్య అని పేరు పెట్టినారు. నేను పుట్టినాటికి మా తాతగారు సజీవులయి ఉన్నందున ఆ పేరే కాస్త మార్పుతో పెట్టి మా నాన్న నన్ను శ్రీనాథుణ్ని చేసినాడు!"

ఇంతలో పోతన సేవకుడు వచ్చి వారికి బసకుదిర్చి సామాను అక్కడికి చేర్పించినామని చెప్పినాడు పోతన శ్రీనాథుని నివాసాదికము అడిగి తెలుసుకొని సెలవు తీసుకొని బసకు వెళ్ళినాడు.

బసకు చేరినప్పటినుండి పోతన పరధ్యానములో పడిపోయి అప్రయత్నముగా తాను వెనుక ఎరిగిన శ్రీనాథుని విషయాలే ఆలోచింపసాగినాడు. ఆయనతోపాటు రాజభోగముగా తాను శ్రీవిద్యానగర యాత్ర చేసిన రోజుల లోని అనుభవాలే ఎన్నో-పెద్దవీ చిన్నవీ-స్మృతికి వస్తున్నవి. ముఖ్యముగా అతనికి శ్రీదేవి అక్కను దర్శించి మొక్క రావలెననే ఉత్కంఠ విశేషముగా కలుగుతున్నది. ఆ రోజులలోనైతే శ్రీనాథుడు తన్ను కుటుంబముతో వేరే బసకు పోనిచ్చేవాడు కాదు. తన బసకే రమ్మనేవాడు. తనకు కూడా ఆ పూజ్యుని కోరిక మన్నింపక తప్పేది కాదు. ఈనాడో, ఆయన తన్ను తన బసకు రమ్మని అయినా పిలవలేదు. శ్రీదేవి అక్క నన్నంత వాత్సల్యముతో చూచేదని ఆయన ఎరుగును. అక్కను చూచిపొమ్మని ఐనా చెప్పలేదు. అక్క సంగతే ప్రస్తావించలేదు. అయ్యో, అక్క క్షేమంగా ఉన్నదా?—అయ్యో, తాను శ్రీదేవి అక్క క్షేమమైనా అడగకుండా వచ్చి నాడే! ఏమో, ఎందుకో తనకు అడుగుటకే నోరు రాలేదు. అయ్యో, అక్క

జీవించి క్షేమముగా ఉన్నదా? ఆమె జీవించి ఉంటే తప్పక ఆయన నన్ను తన యింటికి రమ్మని పిలిచి వుండేవాడే. అయ్యో, ఎంత అమంగళమైన ఊహలు వస్తున్నవి!

ఆ రాత్రి భోజనమైన వెంటనే కవిసార్వభౌముని బసకు వెళ్ళి శ్రీదేవిని దర్శించి రావలె ననిపించినది. కాని ధైర్యము చాలలేదు. అదికాక అప్పటికి చాలా ప్రొద్దుపోయినది. ఏలనో పోతన మనస్సు కీడు శంకింప సాగినది. ఆలోచించుకొన్న కొద్దీ యిప్పుడు శ్రీనాథుడు సుఖముగా ఉన్న ట్లనిపించలేదు. మహాసముద్రములో బడబాగ్నివలెనే ఆయన గంభీరోదాత్త రూపములో ఏదో గాఢచింత అడగవుండి తినివేస్తున్నట్లు స్పష్టముగా తోచ సాగినది.

తెల్లవారుజాముననే పోతన సకుటుంబముగా పాతాళగంగా తీర్థములో స్నానముచేసి, లింగాలగట్టుకు వెళ్ళి అక్కడ కూడా స్నానము చేసి, తిరుగు దారిలో నృసింహబిలము దర్శించి తాము తెచ్చిన పాతాళగంగ తీర్థముతో మల్లికార్జునస్వామిని అంతా అభిషేకించినారు. క్రొత్త బసలో ఏర్పాట్లు చేసికొన్నందునను, ఈ అభిషేక పూజాదికములతోనూ తక్కినవారితో పాటు పోతన కూడా బడలిపోయినాడు. మధ్యాహ్నము విశ్రమించి నిద్రపోగా కలలో శ్రీదేవి ప్రత్యక్షమై "నీ బావను చూచి రావా?" అన్నట్లయినది.

ఏమిటిది? తాను శ్రీనాథుని ముందే దర్శించి ఉన్నాడుకదా! చూడ కున్నది, చూడవలసినది, చూచి నమస్కరింప వలెనని తహతహలాడు తున్నదీ శ్రీదేవి అక్కనే. ఆమె ఇట్లా అంటున్నదేమి? ఇది కల. అందులో పగటికల అని పోతన సరిపెట్టుకో జూచినాడు. కాని కళ్ళకు కట్టి నట్లుగా అక్క పుణ్యమూర్తి స్పష్టముగా హృదయ వీధిలో నిలిచి ఉన్న ట్లయినది. ఆమె పలుకులు చెవులలో గింగురుమని మ్రోగుతూ ఏదో ఆర్తిని సూచిస్తున్నవి,

పోతన నిద్ర లేచినప్పటినుండి అతని మనస్సు వికలమైనది. ఏమైనా అత డిక శ్రీనాథుని దర్శనానికి బయలుదేరకుండా ఉండలేకపోయినాడు. లేచి పాదప్రక్షాళనాదికము చేసుకొని శుచియై ఒంటరిగా బయలుదేరినాడు. శ్రీశైల దండనాథుడై ప్రసిద్ధుడైన ఉప్పల శాంతయ్య నివాసము తెలుసుకొనుట కష్టము కాలేదు.

ముందు పోతనకు వాకిటిలో ఎదురయినది ఏడుస్తున్న కుమారుడు. వానిలో స్పష్టముగా శ్రీదేవి పోలికలు కనిపించుటచేత ఆదరాతిశయముతో ఎత్తుకొని ఉత్తరీయపు చెంగుతో కన్నీరు తుడిచి పిల్లవాని కన్నులు, శిరస్సు, బుగ్గలు ముద్దాడి ఓదార్చినాడు. కుమారు డేమాత్రము క్రొత్త లేకుండా అతని చేతులలో ఒదిగి, ఏడుపు చాలించి చిరునవ్వు మొగముతో పోతన కన్నుల లోనికి అమాయకముగా చూడసాగినాడు. శ్రీదేవి అక్క పాదాలు స్ఫురణకు వచ్చి పోతన వెంటనే ఆ పసివాని పాదాలు రెండూ కళ్ళకు అద్దుకొని ముద్దాడినాడు.

"కుమారా! నీ పేరేమి?"

"కుమార !"

"నిజంగా? కుమారే! తాతగారు ఇంట్లో ఉన్నారా ?"

"అమ్మమ్మ ఏడుస్తుంటే ఓదారుస్తున్నారు. నన్ను ఎత్తుకోలేదు?"

"నేను ఎత్తుకున్నాను కదా!"

"అమ్మమ్మ అనేటప్పటికి తెలిసి పోయింది. ఇతడు శ్రీదేవి అక్క దౌహిత్రుడు. కాబట్టి అక్క క్షేమమే అన్నమాట! మరి ఎందుకు ఏడుస్తున్నదో! శ్రీదేవి అక్క ఏడవగా తానెన్నడును చూడలేదే. కాల మేమైనా మార్పు తెచ్చినదేమో!

"నాయనా! మీ అమ్మ ఇక్కడ ఉన్నదా ?"

ఆ మాటలు వినగానే కుమారుడు వెక్కి వెక్కి ఏడవసాగినాడు.

ఓదార్చి అడుగగా అడుగగా ఆ ఎక్క మధ్య "అమ్మ పోయినది" అని చెప్పినాడు. ఇప్పుడు శ్రీదేవి దుఃఖానికి కారణము తట్టినది. ఆమె కుమార్తె పోయినందుకు దుఃఖపడుతున్న దన్నమాట!

ఇవతల పోతన కుమారునితో మాట్లాడుతున్నది వినబడుతున్నా గడియ నేపటికికాని శ్రీనాథుడు బయటికి రాలేదు. "మీ చిన్నక్కకు, పాపం, ఒంట్లో బాగాలేదు పోతన్నా!"

ఆ మాటలు వింటూనే పోతన నిర్ఘాంత పోయినాడు. చిన్నక్కట! ఈమె యేడుస్తున్నది. శ్రీదేవి ఆక్కగొంతుగా లేదు. శ్రీదేవి తాను వచ్చా నని తెలిస్తే ఎంత జబ్బుగా ఉన్నా వాకిట్లోకి వచ్చి ఆప్యాయంగా పలుక రించకుండా ఉండగలదా? తాను కూడా సరాసరి గదిలోకే పోయి ఆమెకు పాదాభివందనం చేసి ఉండేవాడు. బావ మాత్రం లోపలికి పిలిచేవాడు కాదా?—ఏవో ప్రమాదము శ్రీదేవి అక్కకు సంభవించే ఉండవలెను!

"ఎంతకాలమైంది; తమ దర్శనముచేసి! మీ మధ్య తమ సంగతులే నాకేమీ తెలియలేదు."

"ఏమున్నది నాయనా! హరవిలాసము, భీమేశ్వర పురాణము, కాశీ ఖండము అనే కృతులు వ్రాసినాను. శివరాత్రి మహాత్మ్యము వ్రాస్తున్నాను— నీవేమైనా భాగవతం వ్రాస్తున్నావా?"

"నేనా! తమబోటి విద్వత్కవీశ్వరులవద్ద చెప్పుకో దగినవేవీ వ్రాయలేదు. వ్రాద్దామని ఉంటుంది కాని ధైర్యము చాలదు."

"అదేమిటి నీవు సహజ పాండిత్యుడివి. ఆ కృష్ణ పరమాత్మ అంశ ఏ మాత్రమో ఉన్నవాడవు. ఎప్పుడయినా వంట చేసిన అనుభవమున్నదా?- కుంభములో అన్నమంతా ఉడికిందో లేదో చూడటానికి ప్రతి మెతుకూ పట్టిచూడవలెనటోయీ?—ఏమీ, ఆ వామనావతార ఘట్టములోని పద్యములు నాకు జ్ఞాపకము లేదనుకొన్నావా? ఇంతింతై "వటుడింతమై" అన్నది జ్ఞాప కమున్నది. నిన్ననే వినిపించినాను గదా! ఆ రెండో పద్యము ఎంత బాగా

అన్నావోయీ! ఎర్రయ పద్యానికి మెరుగు పెట్టినావు. ఏదీ! విను! ఎర్రయ వ్రాసింది ఇట్లా ఉన్నది.

"ఇనుని దన మౌళి రత్నంబు, నిర్ధహార
తరళ రత్నంబు, గటి సూత్ర పరిధి మధ్య
రత్నమును, నూపురాగ్ర విరాజమాన
రత్నమును జేయుచును బ్రవర్ధనము బొందె."

"దానినే నీవు పెంచి పదమూడేళ్ళ వాడవుగా ఉండగా చెప్పిన పద్యము నాకు జ్ఞాపకము లేదనుకున్నావా? ప్రబంధ పరమేశ్వరుడు సంక్షేపంగా చెప్పిన ఆ పద్యాన్నే అద్భుతంగా పెంచి ఎట్లా చెప్పావో నాకు జ్ఞాపకంలేదా?

రవిబింబంబుపమింప బాత్రమగు ఛత్రంబై శిరోరత్నమై
శ్రవణాలంకృతియై గళాభరణమై సౌవర్ణ కేయూరమై
ఛవిమత్కంకణమై కటిస్థలి నుదంచద్ఘంటయై నూపుర
ప్రవరంబై పదపీఠమై వటుడు దాబ్రహ్మాండమున్ నిండుచోన్.

శంభుదాసుడు వ్రాసిన పద్యానికే మెరుగు పెట్టినావు. ఆయన హరివంశములోనూ, నృసింహావతారములోనూ సంక్షేపంగా వ్రాసిన భాగాలేనోయీ, భాగవత మంతా. నీవే భాగవతము వ్రాయవలె—తెలుగుగడ్డ ధన్యము కావలె!"

"తమకు నాపైని ఉన్నవాత్సల్యమే అట్లా అనిపిస్తున్నది. ధన్యుణ్ణి. శ్రీదేవి అక్కయ్య ఎక్కడ?"

"నాయనా, అడుగకు. ఆవిడ వైకుంఠం చేరుకుంటూ కూతురు నిచ్చి పోయింది. ఆ కూతురు వైకుంఠం చేరుకుంటూ ఈ కుమారుణ్ణి ఇచ్చి పోయింది. ద్వితీయం చేసుకొన్నాను. ఆవిడ వేవిళ్ళతో విపరీతముగా బాధ పడుతున్నది. అదిగో! వింటున్నావు గదా!"

ఆ మాటలనే ముందే లోపలనుంచి భూదేవి ఆపశోపాలు వినిపించినవి. తనను ఎవరూ విడిచిపెట్టి పోరాదు. ఎవరితోనో కొత్త వారితో భర్తప్రీతి పూర్వకముగా మాట్లాడుతున్నారని పొడగట్టినది. అటువంటిది ఆమె ఎంత మాత్రమూ ఓర్చేదిలేదు. పైగా ఆ వచ్చిన వారెవరో కాని కుమారుణ్ణి ప్రేమతో బుజ్జగిస్తున్నట్లున్నాడు. తన భర్త తన సవతి కథ చెపుతున్నట్లున్నాడు.

"అయ్యో!" అని భూదేవి పెద్ద గావుకేక పెట్టినది....శ్రీనాథుడు లోపలికి వెళ్ళక పోతనతో కబుర్లు చెపుతున్నాడు. లోపల గొడవ ఎక్కువైపోయినది. చివరకు పోతనే కల్పించుకోవలసి వచ్చినది.

"చిన్నక్కకు నమస్కరించి వస్తాను!"

ఆ మాటలతో శ్రీనాథుడు ఉద్బుద్ధుడై పోతనను లోపలికి తీసుకొని వెళ్ళినాడు. కుమారుడు పోతన చంక దిగలేదు.

పోతన లోపలికివెళ్ళి "చిన్నక్కగారికి పోతన నమస్కరిస్తున్నాడు." అని భూదేవికి నమస్కరించినాడు.

పోతన సౌమ్యాకారము, వినీత పద్ధతి, హృదయ పూర్వకమైన నమస్కారమూ వింతగా భూదేవికి ఏదో తృప్తికలిగించినవి. ఆమె ముఖము విప్పారినది.

"నాయనా, నీవు సకుటుంబముగా రాక ఒంటరిగా వచ్చినావేమి?— నిన్నరాత్రి మీ బావగారు మీ కుటుంబము సంగతే చాలా చాలా చెప్పినారు. నీవు మంచి కవిత్వము చెప్పుతావటగా, సాక్షాత్తూ శ్రీకృష్ణుని అవతార మెత్తిన వాడవటగా!—ఆయన అంటుంటే ఏదో అనుకున్నానుగాని నిన్ను చూడగానే నా బాధ అంతా ఉపశమించినది తమ్ముడూ! మా అక్క నిన్ను స్వంత తమ్మునికంటే ఆపేక్షతో చూచేదటగా!—నాకు తమ్ముళ్ళు లేరు. నాయనా!...."

భూదేవి నోట అంత చల్లని మాటలు వచ్చునని శ్రీనాథుడు ఎన్నడూ అనుకోలేదు. ఆమె పోతన మనస్సును ఏమి నొప్పించునో అనియే ఆయన ఇంతవరకూ జంకుతున్నాడు. కాని ఇదేమి చోద్యము! ఈ పోతనలో ఏదో పుణ్యము మూర్తీభవించి ఉన్నది. అది ఎట్టి వారినైనా సౌమ్యులను చేస్తుంది. తాను ఎంత ఆదరముతో చూచినా, ఏవిధముగా బుజ్జగించినా లాలించినా సాధించలేని సౌమ్యత పోతన ప్రథమ దర్శనములోనే సాధించినాడు.

పునర్దర్శనానికి వస్తానంటూ ఆమెవద్ద సెలవు తీసికొని వాకిటిలోనికి రాగా, శ్రీనాథ మహాకవి తన రచనల సంగతీ, ఆయన ఇంటి సంగతులూ ప్రస్తావించినాడు.

"చెప్పినానుగా! హరవిలాసము, భీమేశ్వరపురాణము, కాశీ ఖండము వ్రాసినాననీ, శివరాత్రి మహాత్మ్యము వ్రాస్తున్నాననీ!—ఇప్పుడు విశేషమేమంటే కావ్య వ్యవసాయముతోపాటు భూమి వ్యవసాయము కూడా పెట్టినాను. కృష్ణలంక బొడ్డుపల్లి గ్రామంలో లంకభూమి విరగ పండుతుందని అనుకొంటున్నాము. ఈ సంవత్సరము ఫలసాయము చేతికివస్తే నా కీ జన్మకు మళ్ళీ వేరే ధన సంపాదనతో పని ఉండదని అనుకొంటున్నాను."

భూమి వ్యవసాయ మనగానే పోతన ఆశ్చర్యముతో కన్నులు పెద్దవి చేసి, తలఎత్తి శ్రీనాథుని వంక చూచినాడు. ఈ పుట్టుభోగి కష్టసాధ్యమైన వ్యవసాయ మెట్లు చేయగలడా అనిపించింది పోతనకు. అది కనిపెట్టి శ్రీనాథుడు తనకు ప్రాప్తించబోతున్న లాభాతిశయము వివరించినాడు. దానితో పోతనకు మొదట కలిగిన ఆశ్చర్యముతో కూడిన భయము కొంత ఉపశమించినది. కాని పూర్తిగా పోలేదు, ఆపైన అతడు వివరాలు

తెలుసుకోవలెననే కుతూహలం కలిగి కులాసాగా ఊసులాడుతున్నట్లే వివ
రాలు అడిగినాడు.

"ఎంతభూమి!—కొన్నదా, లేక గుత్తకు తీసుకొన్నదా?-ఎంతకు?-
ఏమేమి పైరులూ?—ఎక్కడెక్కడ, ఎంతెంత వేసినారు?—పంట ఏదైనా
చేతికి వచ్చినదా!—సొంత సేద్యమా, ఇతరులకు పాలి కిచ్చినారా—"
ఎన్నెన్నో ప్రశ్నలు ఒకదాని తర్వాత ఒకటి వేసినాడు. శ్రీనాథు డిచ్చిన
జవాబు ఇట్లా ఉన్నది:

"వ్యవసాయము సంగతి నాకు తెలియదనేగా నీ ఊహ?"

"కాదు కాదు. ఎంతమాట! మీరు సర్వజ్ఞులు!—"

"కాదులే, నీవు కొంటెవు. నగర వాసానికి అలవాటుపడ్డ ఈ కవి
సార్వభౌమునికి పల్లె పట్లలో జీవనము, ఏ కార్తెలో ఏపైరు వేయవలెనో,
ఏ భూమిలో ఏమి పైరు బాగా అవుతుందో, దేనికి ఏమి ఎరువు, ఎట్లా
వేయవలెనో, ఇవన్నీ ఈ గ్రంథ విద్వాంసునికి ఏమి తెలియును అనే కదా
నీ సందేహము! ఐతే విను, చెపుతాను!"

ఈ విధంగా ప్రారంభించి వ్యవసాయపు సంగతులు ఎన్నెన్నో
స్పష్టంగా, ఎంతో వివరంగా చిన్నచిన్న సంగతులతో సహా తెలిపినాడు.
పోతనకే ఆశ్చర్యమైనది.

"సొంత పొలము కాదు. బొడ్డుపల్లి ఊరికి ఊరే గుత్తకు తీసు
కొన్నాను. రెండువేలా వంద టంకాలకు. అందులో రెండువంతులు ముందే
చెల్లించినాను. ఇంకా చెల్లించవలసినది ఏడునూరులే. నావంటిమీదనే కాక
మీ అక్కవంటిమీద కూడా నగలు లేవేమని ఆలోచిస్తున్నావా!—అంతా
సంచకరానికీ, వ్యవసాయ ఖర్చులకూ ఖర్చయినదనుకో!—కొంత పాలికి
ఇచ్చినాను. మెరక పొలాలలో నువ్వూ, పెసరా వేశాము. వాటిమీదనే
ఎంతలేదన్నా మూడువేల టంకాలు రాగలవని అంచనా వేస్తున్నాము. నా
పాలేరు ఈ పాటికి తెస్తూ ఉండవలె కొంత పైకము. ఎదురు చూస్తున్నాను

వాని రాక కోసము. ఇంకొక రెండు నెలలకు తక్కిన పైర్లు రావలె. ఎంత తక్కువగా అంచనా వేసినా వాటిమీద పదివేల టంకాలైనా వస్తవంటు న్నారు. బొడ్డుపల్లి కరణము తనకు పైరుమీదనే ఐదువేలకు అమ్మమని అడుగుతున్నాడు. అతనికి ఎంత ఆశో చూడు!—"

"పోనీ, ఏదో ఇంకొక ధరకట్టి ఇచ్చేయక పోయినారా, మీకు భారము వదలి పోయేది కదా!—దైవికమైన చిక్కులు ఎన్నయినా, వరదా వంగుడూ ఉండవచ్చు గదా! వాటి బాధలేకుండా సుఖంగా చేతిలో టంకాలు రాలేవి గదా!"

"నిజమే. ఐతే మాత్రము మరీ అంత తక్కువకా? ఐనా భగవం తుడు అంత తప్ప చూస్తాడా?—నీకు నమ్మక మున్నదో లేదో కాని, నాకు ఈ దశలో మహారాజ యోగము పట్టుతుందని జాతక రీత్యా కనబడు తున్నది!"

"నాకు నమ్మకము లేకేమి కాని, తమకు మహారాజ యోగము లేని దెప్పుడు? ఎంత చిక్కులలో కూడా, తమ ప్రతిభవల్లా, దానికి తప్పక తోడుపడే భగవత్కటాక్షమువల్లా, ఆ చిక్కునే తమ అఖండ విజయంగా మార్చుకోగలరు!—డిండిమ భట్టారకులతో వివాదమైన తర్వాత, పరిషత్తు లోని ఆ వైయాకరణ సార్వభౌముని గడ్డు ప్రశ్న తమరిని ఎంత కలత పెట్టినదో, తమరు వేదమాత నానాడు దీక్షగా ఉపాసించి ఎట్లా విజయము చేపట్టినారో గుర్తున్నది.—ఈ ధనమేనా? తమరు కవి సార్వభౌములు, బ్రహ్మజ్ఞాన కళానిధానములకు — తమకు ఒకప్పుడు మాత్రము లోప మేమిటి?"

"పోతన్నా, అట్లాకాదు. శరీరదార్ఢ్యము తగ్గినదోయి. ధారణ కూడా క్షీణిస్తున్నది. లేకపోతే నిన్న నిన్ను అంతసేపు గుర్తు పట్టలేక పోయివుండే వాడనా? మీ పెద్దక్క బ్రదికి ఉన్నరోజులు అవి వేరోయి—"

ఆపైన మాట రాలేదు. ఉప్పెనవలె హృదయములో నిండిన దుఃఖము అతికష్టముమీద నిగ్రహించుకొన్నాడు. కాని దేహమంతా వడకి పోయినది. అది పోతన గమనించి, శ్రీనాథుడు ద్వితీయము చేసుకొన్నందున ఎంత బాధపడుతున్నాడో, ఎంతటి అంతర్బాధను అణచుకొని పైకి నిండుగా ప్రవర్తిస్తున్నాడో గ్రహించుకున్నాడు.

కొంతసేపు గృహ విషయాలు సంభాషించి శ్రీనాథుని నూతన రచనల ప్రతులు పోతన అడిగి తీసుకొని తన బసకు వెళ్ళినాడు.

ఆ సాయంకాలమూ, రాత్రి ఎక్కువ భాగము మేలుకొని ఉండి ఆముదపు దీపము వెలుగున, ముందు హరవిలాసము పూర్తిచేసి, భీమేశ్వర పురాణమూ, కాశీఖండమూ తిరుగవేసినాడు. ఆ మరునాడు పగలూ రాత్రి తక్కిన పనులన్నీ మానివేసి, ఆ రెండు గ్రంథాలు కూడా పూర్తిగా పఠించి మళ్ళీ మళ్ళీ అభిమాన పాత్రమైన భాగాలు చాలావరకు కంఠస్థము చేసుకొన్నాడు.

ఆ మరునాడు పొద్దుననే సంధ్యావందనాదికమైన తర్వాత స్వామి దర్శనము చేసుకొని శ్రీనాథభట్టు దర్శనార్థము పోతన వెళ్ళినాడు. ఆయన కుమారుణ్ణి ఆడిస్తున్నాడు. భూదేవి గదిలోనుంచి లేచి వచ్చి మూలుగుతూ ప్రక్కనే కూర్చున్నది.

"మనము ఇక బొడ్డుపల్లి పోదామా?—ఎన్నాళ్ళు యిక్కడ ?—"

"ఎప్పుడు స్వామి అనుగ్రహించి అనుమతి యిస్తే అప్పుడు."

"స్వామి అనుగ్రహము చేతనే కదా, నా ఒళ్ళంతా ఈ విధంగా వికారబాధ పడుతున్నది—ఇది అనుజ్ఞ కాదా?"

"కాదు, కాదు!—"

సరిగ్గా పోతన వచ్చినప్పుడు శ్రీనాథు డట్లా అంటున్నాడు పోతనను చూడగానే భూదేవి అతనితో ఇట్లా అన్నది :

"చూడు నాయనా, పోతనా! మీ బావ మాటలు వింటున్నావుగా! ఆయనకు నీవైనా చెప్పు! స్వామి అనుజ్ఞ కాలేదంటారు. ఇక వెళ్ళవచ్చునని స్వామి మనకు ప్రత్యక్షమై చెబుతాడా, ఎక్కడైనా?"

పోతన "అక్కా, బావగారికి ప్రత్యక్షముగానే చెప్పవచ్చును స్వామి. కాక కలలోనైనా అనుజ్ఞ ఇయ్యవచ్చు. వారు బ్రహ్మజ్ఞాన కళా విధానము, హృదయంలో సదాశివుడు నిత్యప్రత్యక్షుడే — నోటితో అనరు అక్కా!"

ఆ సంభాషణ శ్రీనాథుడు ఆలకించడములేదు. చిత్తస్థితుడైన శివుని అర్ధనిమీలితలోచనాలతో ధ్యానిస్తూ ఉన్నాడు.

భూదేవి : "నాయనా, వారికి శివుడు కనపడి చెప్పేలోపల, నే నీ కొండలలో గుట్టలలో నీటి ఎద్దడితో బ్రతికేట్లులేదు. కొండ గడ్డలలో ఎప్పుడూ నడిచిన అలవాటు ఉన్నదాన్ని కాదు. ఆ దొడ్డుపల్లి కాపురమే నానా చీదరగా ఉన్నది. నిక్షేపమువంటి ఆ గోదావరి నీళ్ళూ, కోనసీమా, కొబ్బరితోటలూ, పనసచెట్లూ వదిలి, ఆ చతుర్మధ్యపు కృష్ణలంకలో పడ్డాము, నాయనా! అదీ విడిచి కొండమీద ఈ అడివిలో చేరినాము. పైగా ఇక్కడ రాత్రింబగళ్ళు ఎప్పుడూ ఒకటే గోల, భక్తుల సింహనాదాలతో! ఇక్కడ ఇక ఒక్క-క్షణము నిలవలేను!"

పోతనకు ఏమనుటకూ పాలుపోలేదు. భూదేవి గర్భభారముతో సహజమైన చిరాకుతో ఉన్నదని భావించి మౌనంగా ఆలకిస్తున్నాడు. ఆమె ఇంకా సాగించినది:

"ఎప్పుడూ వచ్చేపోయే ఈ భక్తులుచేసే గోలతో రాత్రులు నిద్ర ఉండదు, పగలు మనశ్శాంతీ ఉండదు. గడిచిన రాత్రి అర్ధరాత్రి వేళకు కాస్త కునుకు పట్టినదో లేదో, ఇంతలో తప్పెట్లతో, తాళాలతో శ్రీశైల పర్వతమంతా దద్దరిల్లి పోయేట్లు, ఎవరో కొత్తగా వచ్చినారు కాబోలు,

స్వామి ఆలయానికి ప్రదక్షిణాలు సాగించినారు. నూట ఎనిమిదిసార్లు చేయవలెనట. తెల్లవారేదాకా ఒకటే గోల, నాయనా !—సరే గాని, మీ అమ్మనూ నీ భార్యనూ పిల్లవాణ్ణి తీసుకురాకపోయినావా, వాళ్ళను చూడవలెనని ఉన్నది తమ్ముడూ—"

"తప్పకుండా తెస్తాను!—మేము ఇంటికి రెండు మూడు రోజులలో బయలుదేరుదా మనుకొంటున్నాము కూడాను."

"అయ్యో నాయనా, ఇట్లా వచ్చినవాళ్ళు ఇట్లా వెళ్ళిపోతున్నారు!—మాకెప్పటికో ఈ చెర వదలడము! — ఇక్కడ నాకు ఒక్క క్షణము కూడా నిలవ బుద్ధిపుట్టడము లేదు, తమ్ముడూ!"

చిన్నక్కకు మాట ఇచ్చిన ప్రకారము ఆ మధ్యాహ్నమే పోతన్న తల్లితో, భార్యతో, కుమారునితో శ్రీనాథుని బసకు వెళ్ళినాడు లక్కమాంబ పురమాయించిన ప్రకారము వారు తమ వెంట భూదేవికి కానుకగా మంచి పట్టుచీరె, రవిక, పళ్ళూ పూలూ, పసుపు కుంకుమా తీసుకొని వెళ్ళినారు.

భూదేవికి తల్లి లేదని లక్కమాంబకు తెలిసి ఉన్నందున తల్లి మారుగా తానే సూడిదలు చేయదలచి ఆ ప్రయత్నముతోనే వెళ్ళినది, చలిమిడి కూడా వెంట తీసుకున్నది, లక్కమ్మ. అది తెలిసి శ్రీనాథుడు తాను కృతార్థుడనైనట్టే భావించినాడు. భూదేవి పొందిన ఆనందానికి మేర లేదు. ఆమెకు సోదర ప్రేమ అనుభవించిన భాగ్యము లేదు. అందు వల్ల పోతనను తమ్ముని వలెను, పోతన భార్య ఎల్లమ్మను ఆడుబిడ్డను వలెను ఆదరించినది; లక్కమ్మను తల్లిని వలెనే పూజించినది. ఆ సాయంకాలము భూదేవి తన అస్వస్థత అంతా మరచి పోయినది.

లక్కమ్మ భూదేవి సూడిదలు అందరిని పిలిచి వైభవముగా చేయదలచినది కాని మూడవ నెలలో అట్లా చేయుట అనుచితమైనందున

ఏకాంతముగానే చేసి తృప్తిపడినది. ఆ రాత్రి భూదేవియే బలవంతముచేసి పోతన కుటుంబమును భోజనాదులకు వారి విడిదికి పోనీయక బలవంతము చేసి తమ యింటనే నిలిపి సుష్టుగా విందు చేసినది. ఆనాడు మరల శ్రీనాథుడు తన మొదటి భార్య శ్రీదేవి జీవించి యుండిన నాళ్ళ ఆనందము అనుభవించినాడు.

మరి రెండు రోజులు మాత్రమే పోతన శ్రీశైలములో ఉన్నాడు. ఆ రెండు రోజులూ శ్రీనాథుడూ, పోతనా తమ రచనల సంగతి ప్రస్తావించుకొన్నారు. తన కిచ్చిన శ్రీనాథ గ్రంథప్రతులను పోతన శ్రీనాథునకు తిరిగి ఇయ్యబోగా, అతనినే ఉంచుకోమని శ్రీనాథుడు చెప్పినాడు. నారాయణ శతకములో కొన్ని పద్యాలు వ్రాసినానని వినిపించి, తనకు శ్రీ శృంగేరి విరూపాక్ష శ్రీ పీఠాధిపతులు గోపాల సుందరీ మంత్రము ఉపదేశించిన దాదిగా కృష్ణభక్తి అతిశయిస్తున్నదని పోతన చెప్పినాడు. మరియు సందర్భవశాత్తుగా తనకు నారాయణ కథా ప్రపంచ కుతూహలము అతిశయిస్తున్నదని ప్రస్తావించినాడు. "భాగవతము ప్రధానముగా శ్రీధర వ్యాఖ్యా సహితముగా పఠించినావా" అని పోతనను శ్రీనాథుడు ప్రశ్నించినాడు. పఠించినానని చెప్పగా శ్రీనాథు డానందించి పోతనను గాఢాలింగనము చేసుకొని ఇట్లా అన్నాడు:

"పోతనా, నీవు తప్పక భాగవతము ఆంధ్రీకరింపవలె. నీలో నాకు మొదటి నుంచీ శ్రీకృష్ణ పరమాత్మ కళావేశము గోచరిస్తున్నదోయి. తప్పక వ్రాసి కృతార్థుడవు కావలె."

"భాగవతము సుష్టుగా చెప్పడము ఆ బ్రహ్మకైనా, శూలికైనా సాధ్యమా అనిపిస్తుంది, శ్రీనాథ భట్టారకా!"

"నీ వనేది కొంత సత్యమే. ఉద్గ్రంథాలన్నీ అటువంటివే. మనకు చేతనైనంత వరకే మనముచేయగలము. నీవు భాగవతము ఆంధ్రీకరిస్తే

దాని భావనవల్ల నీవు తరిస్తావు: నీ గ్రంథము చదివిన వాళ్లూ తరిస్తారు."

ఆ పిమ్మట "అంత పెద్ద గ్రంథము తాను పూర్తిచేయగలనా అని అధైర్యముగా ఉన్న"దని పోతన చెప్పగా శ్రీనాథు డిట్లా సలహా చెప్పినాడు:

"పోతన, ఈ మహాగ్రంథాలలో రసవత్తర ఘట్టాలు కొన్నే ఉంటవి. నీకు బాగా నచ్చిన ఘట్టాలు ముందు ఆంధ్రీకరిస్తూ పో. కవితా వేశము తగ్గిన రోజులలో తక్కిన ఘట్టాలు పూర్తిచేస్తూ పో! ఈ విధంగా చేస్తే రచనలో నీకు ఉత్సాహము తగ్గకుండానూ ఉంటుంది: భాగవతంలో ఆయువుపట్టయిన ఘట్టాలు నీ చేతిమీదుగా తప్పకుండా పూర్తి అవుతవి. తక్కినవి చేస్తే చేస్తావు, లేకపోతే లేదు. అవి ఎవరైనా పూర్తి చేయ వచ్చు. కొన్ని ఉదాహరణ లిస్తాను - గజేంద్ర మోక్షము, ప్రహ్లాదచరిత్ర, అంబరీషోపాఖ్యానము, వామనావతారము, శ్రీకృష్ణలీలలు, కుచేలోపా ఖ్యానము ఇటువంటివే నీకే ఆలోచిస్తే తోస్తవి!—"

ఈ విధమైన సంభాషణలతో ఆ రెండు రోజులూ గడచినవి. పోత నకు భాగవతాంధ్రీకరణ కుతూహలము ఉద్వేలమైనది.

తిరుగుప్రయాణము చేసేనాడు పోతన తన భార్యను, పిల్లవాణ్ణి తీసు కొని శ్రీనాథుని దర్శించినాడు. శ్రీనాథునికి, భూదేవికి వారు నమస్కరించి నారు. పోతన శ్రీనాథదౌహిత్రుడైన కుమారుని కౌగలించుకొని ముద్దాడి నాడు. భూదేవి పోతనకుమారుడైన మల్లన్నను ఎత్తుకొని ముద్దాడుతూ పోత నతో ఇట్లా అన్నది:

"తమ్ముడూ, నీవైనా చెప్పు, ఇక వెంటనే బొడ్డుపల్లికి ప్రయా ణము కమ్మని, మీ బావగారితో!—ఇన్నాళ్ళు భూములు విడచివస్తే, వ్యవ సాయము పాడైపోదా, చెప్పు!"

పోతన సాభిప్రాయముగా శ్రీనాథుని వంక చూచి నవ్వి, ఆ దంప తుల సెలవు తీసుకొని, ఆశీర్వచనము పొంది బయలుదేరినాడు.

పోతన కుటుంబముతో శ్రీశైలము విడిచిన రోజుననే ఆకస్మికముగా శ్రీనాథుని మనస్సులో అవ్యక్తమైన తాపము, కుంగుపాటు ఆవేశించినది. ఇంతలో పాతాళగంగ విపరీతముగా పొంగుతున్నదని వార్త వచ్చినది. పోతన కుటుంబము కృష్ణదాటి ఏలేశ్వరము మీదుగా బమ్మెరకు చేరుకొనవలెను. వారు పాతాళగంగా ప్రవాహమును పుట్టిమీద దాటవలసి ఉన్నది. వారు క్షేమముగా దాటినారా అనే ఆతురత శ్రీనాథునికి కలిగినది. కొంతసేపటికి శాంతయ్య దండనాథుని భటులు తాము పోతన కుటుంబమును క్షేమముగా ఏరు దాటించితిమనీ, వారు దాటిన తర్వాతనే కృష్ణ పొంగడ మారంభించినదనీ వార్త తెచ్చినందున ఆ విషయములో భయశంక శాంతించినది. కాని శ్రీనాథుని ఆవేశించిన అవ్యక్తమైన కుంగుపాటు శాంతించలేదు.

శ్రీనాథుడు నిత్యమూ శ్రీశైల మల్లికార్జున స్వామికి ప్రాతఃకాలములో అభిషేకము చేసి వసతికి వచ్చి శివార్చనముచేసి ప్రాసాద పంచాక్షరి అయుత సంఖ్యాకముగా జపించి కాని భుజించుటలేదు, స్వామి అనుజ్ఞా సూచకముగా స్వప్నమో, మరి ఏదో ఆదేశమో వచ్చేవరకూ స్వామి సన్నిధానము వదల దలచలేదు. ఇట్లా మహాశివరాత్రి వరకూ గడువుగా పెట్టుకొని సేవిస్తున్నాడు. భూదేవి ఇంటికి పోవలెనని తొందరించ సాగినది.

శివరాత్రి మాహాత్మ్యరచన పూర్తికావస్తున్నది.

పోతన కుటుంబ సహితముగా వెళ్ళిపోయిన వారము రోజులకు బొడ్డుపల్లినుంచి శీఘ్రవార్తాహరుడు వచ్చినాడు. ఆత డెంతో ఉద్రిక్తుడై వచ్చినాడు. బొడ్డుపల్లి కరణము శిస్తుకై తొందరపెట్ట సాగినాడు. తమ ప్రధాన కార్యకర్త శ్రీనాథభట్టుగారు శ్రీశైలమునుంచి తిరిగి వచ్చేవరకూ

అగమన్నా ఆగే వీలులేదనీ, మండలాధిపతి త్వరలో అమరావతికి రానున్నాడనీ, ఆయన, వెంటనే శిస్తు బాకీలు వసూలు చేయవలసినదని తాఖీదులు పంపినట్లూ తొందర చేస్తున్నాడు. కార్యకర్త మహాశివరాత్రిపరకూ గడువున్నది కదా అని ప్రస్తావింపగా కరణము మండిపడి, "అది రెడ్డి రాజ్యములో, కర్ణాట రాజ్యములో మాట — ఇప్పుడు ఒడ్డె రాజ్యములో ఉన్నామని గమనించి, ఒళ్ళు దగ్గర పెట్టుకొని ప్రవర్తించవలె, జాగ్రత్త!" అని హెచ్చరించినాడు. కరణము తనకు పైరు పంటమీద అమ్మలేదని కచ్చ వహించినాడని తమ కార్యకర్త సందేహిస్తున్నాడు.

"ఈ వార్తలు తమకు శీఘ్రముగా చేర్చడానికి వస్తూ ఉంటే సరిగ్గా కృష్ణ పొంగడ మారంభించినది. దారి పొడుగున కృష్ణ వరదల వల్ల ముఖ్యంగా లంకభూములు మునిగి నాశనమైనవనే వార్తలు విన్నాను. మన భూములలో పైరులు ఏమైనవో అని నా కెంతో భయంగా ఉన్నది ప్రభూ!" ఈవిధంగా వార్తాహరుడు శ్రీనాథునకు నివేదించినాడు.

శ్రీనాథుని కేమి చేయను తోచలేదు. స్వామి తనకు శ్రీశైలము వదలడానికి అనుజ్ఞ ఇచ్చినట్లు సంజ్ఞ కనబడలేదు. బొడ్డుపల్లెలో పనులు తొందర చేస్తున్నవి. ఏమి చేయవలె? భగవద్ధ్యానము చేసి భావన చేసినాడు. ఈశ్వరానుజ్ఞ రాలేదు. ఎన్నిసార్లు ధ్యానించి భావించినా అనుజ్ఞ రాలేదు. పైగా శ్రీశైలమునుండి కదలవద్దని స్వామి సూచిస్తున్నట్లు స్ఫురణ కలుగుతున్నది. శాంతయ్య ఏర్పాటులవల్ల ఇక్కడ తమకు రాజభోగముగా జరుగుతున్నది. పైగా భూదేవి విలపనీయ కున్నది. దైవమానుషాల వల్ల శ్రీనాథుడు సతమత మవుతున్నాడు.

"స్వామీ, మహాదేవా, ఏమి ఆజ్ఞ?"—చెవిటి మల్లియ్య తన పేరు సార్థకము చేసుకున్నాడు. శ్రీనాథుని ఘోష ఆయన చెవిలో దూరినట్లు లేదు.

ఆరాత్రి "మల్లయ్యతండ్రీ, మల్లయ్యతండ్రీ, మల్లయ్యతండ్రీ" అని శ్రీనాథుడు పెద్దగా కలవరించినాడు.

ఆ కలవరింత విని భూదేవి ఉలిక్కిపడి లేచి కేకలువేసి ఇంటిలోని వారి నందరినీ లేపినది. "ఆయన కేదో గ్రహము పూనినది. లేకపోతే పరమ శాంతముగా నిద్రించేవారు ఇట్లా పొలికేకలు వేస్తారా?" అని గోల చేసినది. అందరూ ఆశ్చర్యపడ్డారు. శ్రీనాథభట్టు ఆమె అజ్ఞానానికి జాలి పడ్డాడు. ఆమె ఆయన ద్వితీయ కళత్రము. తాను ఎక్కువ మాట్లాడితే తన కాపురమే అల్లరిపాలవుతుంది.

ఆనాడు తెల్లవారిన తర్వాత భూదేవి, 'ఈ ఊరిలో ఈ ఇంటిలో ఒక్క నిముషముండ' నని ఇంటి వాకిట నిలుచున్నది. శ్రీనాథుడు ప్రతి మాలినా రాలేదు. ఇతరులు ఎందరో చెప్పినారు. ఐనా ఆమె వినిపించు కోలేదు.

అంతలో విచిత్ర మొకటి జరిగినది. భగవంతుడు పంపినట్లుగా, అక్కడికి శ్రీనాథుని పిచ్చిమామ్మ వచ్చినది. పిచ్చిమామ్మ అంటే పిచ్చిది కాదు. వెర్రిబాగులది. శ్రీనాథుని సన్నిహిత జ్ఞాతుల లోనిది. పెత్తల్లి వరుస. పేరు సుబ్బమ్మ.

ఆమె వాకిట్లో అడుగు పెడుతూనే బయట ఎండలో తపన పడు తున్న భూదేవిని చూచింది. ఆమెకు సహజంగా బాధపడుతున్న వాళ్ళ యందు కలిగే ప్రేమ పెల్లుబికినది. ఆమె తలయెత్తి చూడగా ఇంటి చూరు కింద ఏమిచేయనూ పాలుపోక నిలుచున్న శ్రీనాథుడు కనిపించినాడు. తప్పంతా అతనిదే అని నిశ్చయించింది. లేకపోతే ఓపలేని ఆడుబిడ్డ ఇంటి బయట ఎండలో ఆపసోపాలు పడుతూ ఎందుకట్లా నిలుచుంటుంది? వెంటనే ఆమె శ్రీనాథుణ్ని పరిపరి విధాల చీవాట్లు పెట్టసాగినది.

"నాయనా సీనయ్యా, ఎన్నేళ్ళు వచ్చినా నీ తొందరా, నీ కోపమూ

వదలకపోతే ఎట్లా తండ్రీ!—మా బంగారు తల్లిని, ఓపలేని పిచ్చితల్లిని ఇట్లా ఇంటి బయట ఎండలో నిలబెట్టి చూస్తూ ఊరుకున్నావు! ఎంత చదువులు చదువుకుంటే ఏమి లాభము! మనుష్యులకు కనికర మనేది లేకపోతే?"

ఇట్లా అంటూనే ఆమె భూదేవిని సమీపించి చెక్కులూ, శిరస్సూ నిమిరి చెంపల మీద రెండు చేతుల వేళ్ళూ ఒత్తి ప్రేమాతిశయముతో మెటికలు విరిగేట్లు అద్ది మాట్లాడసాగినది.

"మా తల్లి గదే!—వాడెప్పుడూ ఇంతే. వాళ్ళ నాన్న గారాబము చేసి నెత్తి కెక్కించుకొని ఇలా చేసినాడు. నేను వచ్చాగా తల్లీ, వాడి పెత్తన మేమిటి ఇంకా! నీకేమి కావలెనో చెప్పు నేను చూస్తాను!—"

ఈ మొదలైన విధంగా అంటూ ఆదరాతిశయముతో చేతులు పట్టుకొని భూదేవిని ఇంట్లోకి నడిపించుకొని వెళ్ళినది. భూదేవి కూడా, అప్పటికే ఎండబాధ ఓర్చలేనందువల్ల గాని, పిచ్చిమామ్మ ప్రేమాతిశయానికి ఎదురాడలేకగాని, మంత్ర ముగ్ధురాలివలె మౌనముగా వెంట అనుసరించినది. శ్రీనాథుడు సిగ్గుతో తొలగి, తన శయన మందిరములో ప్రవేశించినాడు.

సుబ్బమ్మ వెంటనే ఇంటి పెత్తనమంతా తానే వహించినది. ఎక్కడ ఏ వస్తువున్నదీ చూచుకొన్నది. లేనివాటిని సేవకులను తెమ్మని పురమాయించినది. వారూ మంత్రముగ్ధులైన వారివలెనే ఆమె ఆజ్ఞలు పాలింపసాగినారు.

ముందామె భూదేవిచేత కాళ్ళూ చేతులూ కడిగించి ఒంటి చెమటలు తుడిచి సుఖశయ్య మీద పరుండ జేసినది. "ఎన్నో నెల తల్లీ ?" అని ముందు ప్రశ్నించినది.

"మూడవ నెల, మొన్ననే వచ్చింది అత్తయ్యా!"

"సరేకాని వాడు పొమ్మంటే మాత్రము నీవు వాకిట్లోకి ఎందుకు

|! ఇది నీ యిల్లు, వాడి పెత్తన మేమిటి! నేను వచ్చానుగా! నిన్ను కాలు కింద పెట్టనీయను!—సరే కాని దాహము పుచ్చుకో!—వట్టి నీళ్ళు కాదు. నిమ్మరసము కలిపి ఇస్తాను తాగు!" అంటూ నిమ్మరసము నీళ్లూ, కొంచెము ఉప్పూ కలిపి ఇచ్చి తాగించినది. ఆమెకే తెలిసిన మరెన్నో సుఖోపచారాలు చేస్తూ ఉపచార వాక్యాలు జోడించినది. భూదేవి శాంతించి నది. ఇప్పు డామెకు కూడా తాను భర్త పొమ్మంటేనే వాకిట్లోకి వెళ్ళి నిలు చున్నా ననిపించినది. లేకపోతే తా నెందుకు అట్లా ఎండలో నిలబడుతుంది అంత సేపు!

అట్లా అని పిచ్చిమాంమ్మ శ్రీనాథుని సౌకర్యాల విషయములో కూడా ఏమాత్రము అశ్రద్ధ చేయలేదు. ఆయన పూజకు, జపానికి అన్నీ సిద్ధము చేసినది. రాగానే మొదట శ్రీనాథుని కోపిష్టి గుణము ప్రస్తావించినా మళ్ళీ ఆ ప్రస్తావనే చేయలేదు. అంత సుగుణాభిరాముడు మరొకడు లేనట్లే ప్రవర్తించినది. "భార్య ఓపలేనిది కావడం వల్ల మా నాయనకు ఎంత అసౌకర్యంగా ఉన్నదో!" అంటూ ఆయనకు అన్ని సౌకర్యాలూ కలి గించినది.

ఒక్క శ్రీనాథునకే కాదు. ఈ మధ్య కుమారునికీ సరిగా పోష ణమే జరగడము లేదు. సుబ్బమ్మ వచ్చిననాటి సాయంకాలమే వానికి చక్కగా తలంటి పోసినది. ముప్పూటలా వేళ తప్పకుండా కడుపునిండా భోజనము, ఈ మాటలూ ఆ మాటలూ చెప్పుతూ, తినిపింప సాగినది. నిద్రవేళకు సుఖశయ్య అమర్చమని సేవకులను పురమాయించేది. మూడు రోజులలోనే ఆ పిల్లవాడి ముఖములో కొత్త తేట కనిపించినది. వాడు తాతమ్మను క్షణము వదిలి ఉండడు. ఊళ్ళోకి పోయి ఆటలాడి మురికిగా వస్తే, వెంటనే అవసరాన్ని బట్టి ఒళ్ళు కడుగుటో, తుడుచుటో, నీళ్ళు పోయుటో, కట్టిన బట్టలు మార్చుటో చేసి శుభ్రముగా ఉంచుతున్నది. కుమా

రుడు ఎంతో ముద్దులు మూటకట్టుతూ ఉండగా, ముద్దాడుతూ "నాయనా! చిన్నప్పుడు మా సీనప్ప సరిగ్గా ఇలాగే నీ వలెనే ఉండేవాడురా!" అనేది.

శ్రీనాథుడూ, భూదేవీ, కుమారుడే కాదు—పరిచారకులు కూడా పిచ్చి మామ్మ ఆదరానికి పాత్రులైనారు. బోయీలకు, తక్కిన సేవకులకు ఆమె కడుపార భోజనము పెట్టి తినిపించేది.

ఈ విధంగా అందరికి భోజనాది వసతులు పుష్టిగా కల్పిస్తున్నా ద్రవ్య మేమాత్రమూ వృథాకానీయదు. పొదుపులో ఎంతో నేర్పు కలది.

ఇంటిలో ఇన్ని పనులు చేస్తూనే ఒక నాడామె పాతాళగంగా స్నానముచేసి వచ్చినది. ఒకనాడు హాటకేశ్వరము, ఒకనాడు పాలధార, పంచధార, ఇంకొకనాడు శిఖరేశ్వరము—ఈ విధంగా చుట్టుప్రక్కల తీర్థ క్షేత్రాలన్నీ సేవిస్తున్నది. నిత్యమూ స్వామి దర్శనము, భ్రమరాంబా దర్శనమూ తప్పక చేసేది. ఆమె శ్రీశైలయాత్ర పూర్తి ఐన వెంటనే ఇంటికి ప్రయాణమైనది. భూదేవీ, శ్రీనాథుడూ మరి రెణ్ణాళ్ళకంటె ఆపలేకపోయినారు. ఆపైన ఆమె నిలవలేదు.

ఆమె శ్రీశైలము విడిచి వెళ్ళిన మరునాటినుంచి శ్రీనాథుని ఇంటి వ్యవహారాలు అస్తవ్యస్తము కాసాగినవి. ఈ మాటు భూదేవి ప్రారంభించిన గొడవకు శ్రీనాథుడు తట్టుకొనలేకపోయినాడు. ఐనా ఆయన రెండువల్లనో శ్రీశైలము విడిచిపోవ మనస్కరించలేదు. కాని తానింక బొద్దుపల్లికి పోక తప్పదని శాంతయ్యకు చెప్పినాడు. శివరాత్రి మహాత్మ్యము రచన కూడా పూర్తి ఐనది.

శాంతయ్యకూడా మరి కొంతకాలము అక్కడనే ఉండమని శ్రీనాథుని బలవంతము చేసినాడు. మహాశివరాత్రి వరకైనా ఉండి ఆ మహాపర్వ సమయంలో స్వామి సన్నిధానములో కృతిసమర్పణము చేయుమని శాంతయ్య అర్థించినాడు. తనకు రావలసిన కట్టడులు కూడా అప్పటికి

పూర్తిగావచ్చుననీ, అప్పుడయితే తాను అనుకొన్నట్లు ఘనంగా—అదీ అల్పమే ఐనా—శ్రీనాథభట్టును సమ్మానించే అవకాశ ముంటుందని కూడా చెప్పినాడు. శ్రీనాథుడు తాను బొడ్డుపల్లి వెంటనే వెళ్ళవలసిన అవసర మున్నదనీ వెళ్ళక తప్పదనీ చెప్పినాడు. ఉత్తరాయణ పుణ్యకాలములో కృతి సమర్పణమూ, కనుము వెళ్ళగానే శ్రీనాథుని ప్రయాణమూ నిశ్చయ మైనవి.

శివరాత్రి మహాత్మ్యము కృతి సమర్పణోత్సవము చాలా క్లుప్తసరిగా జరిగినది. అందుకు శ్రీనాథునికి చింత కలుగలేదు. కాని శాంతయ్యకు మాత్రము చాలా విచారము కలిగినది.

శాంతయ్య సెట్టి వీరాగ్రగణ్యుడు. వంశపారం పర్యముగా శ్రీశైల సీమను నిజప్రతాపముచే రక్షిస్తూ పాలిస్తున్న దండనాథాగ్రణి.

ఆనాడు శాంతయ్య శ్రీశైల మల్లికార్జునస్వామిని శ్రీనాథ కవిసార్వ భౌమ పురస్సరముగా సేవించి స్వామి తీర్థప్రసాదములు గ్రహించి ఆ సమీపమందే ఉన్న తన దివాణములో వీరభటులతో కొలువు తీరినాడు.

"పరవాది మత్తేభ పంచాననాఖ్యుండు
పరవాది మండూక పన్నగుండు
పరవాది నవమేఘ పవమాన ధీరుండు
పరవాది సాగర బాడబుండు
పరవాది కుత్కీల భాసుర దంభోళి
పరవాది కేంధన పావకుండు
పరవాది చయతమఃపటలోగ్ర భానుండు
పరవాది భోగి సువర్ణ డనగ

చటులజైన కోలాహల సమర బిరుద
ఘనుడు సంగ్రామ పార్థుండు వినుత యశుడు
శుభుడు ముమ్మడి దేవయ్య సుతుడనంగ
వెలసె శాంతయ్య విక్రమ వీరవరుడు."

శ్రీనాథ కవి వరేణ్యుని కర్పూర తాంబూల జాంబూనదాభరణంబుల పూజించి స్కాందంబున నీశాన సంహితం జెప్పంబడిన శివరాత్రి మాహాత్మ్యంబు తన కంకితంబు గావింప వేడిన శ్రీనాథుడు స్వీకరించి, కృతిపతి వంశ వర్ణన మొనర్చి షష్ఠ్యంతంబులు ఆశ్వాసాద్యంతక పద్యంబులు కూర్చి కృతి వినిపించి సమర్పించినాడు. ముమ్మడి శాంతయ్యయు వినయ వినమిత శిరస్కుడై మరల మహాశివరాత్రి నాటికి శ్రీశైలమునకు దయచేయుడని కవీశ్వరుని ప్రార్థించినాడు.

ఆ తర్వాత మూడవనాడు శ్రీనాథ కవి సార్వభౌముడు సకుటుంబ పరివారముగా భ్రమరాంబా మల్లికార్జునులను పూజలుచేసి బొడ్డుపల్లికి తిరిగి ప్రయాణమైనాడు.

శ్రీనాథుడు మొదట తనవెంట తెచ్చిన ద్రవ్యమప్పటికే వ్యయమైనది. శాంతయ్య బహూకరించిన ద్రవ్యము తిరుగు ప్రయాణములో ఖర్చు కాసాగినది.

## 6

శ్రీనాథుడు తిరుగు ప్రయాణములో మాచర్లలో మజిలీ చేసినాడు. చంద్ర వంకలో స్నానముచేసి చెన్నకేశవ స్వామిని దర్శించి అక్కడ ఒక పగలూ రాత్రీ గడపినాడు. శ్రీశైలము వెళ్ళుతున్నప్పుడు కూడా అత డక్కడ ఒకరోజు గడిపినాడు. ఆ రెన్నాళ్ళూ పల్నాటి వీరుల కథలెన్నో అక్కడి వారు చెప్పగా ఆలకించినాడు. వెనక ఎప్పుడో తాను

పల్నాడు సంచారము చేసిన రోజులలో విన్న వీరుల కథలను అతడెప్పటికిని మరచి పోలేదు.

ఈ తిరుగు ప్రయాణములో ఆ తర్వాత ఒక పగలూ రాత్రీ కారెమపూడిలో గడిపినాడు.

కారెమపూడిలో మకాము చేసిన నాటిరాత్రి శ్రీనాథుడు ఏవో ఆలోచిస్తూ చాలా పొద్దుపోయే వరకు నిద్రరాక అలాపనగా ఉన్నాడు. ఆ సమయంలో దూరాన నుండి పల్నాటి వీర చరిత్ర ద్విపద ప్రబంధము గానము చేయుచుండుట వినిపించినది. అది వెనుక తాను పల్నాడు వెళ్ళి నప్పుడు విన్నదే. వల్లభరాయని క్రీడాభిరామములో తాను సరి చేసిన పద్యములో వర్ణించిన దాని వంటిదే.

> "ద్రుత తాళంబున వీరగుంఫితక ధుంధుంధుం కిటాత్కార సం
> గతి వాయింపుచు నాంతరాలిక యతి గ్రామాభిరామంబుగా
> యతిగూడన్ ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడె నో
> క్కతప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం దూలగన్."

ఐతే ఆ చెప్పేది స్త్రీ కాదు. స్పష్టముగా పురుషుని కంఠము. అతడు కత్తిపట్టుకొని ఆవేశంతో ఆడుతూ ఖంజణ్ళు వరపుతున్నట్లు అనిపిస్తున్నది. శ్రుతిగా తిత్తి మ్రోగుతున్నది. ఆవేశము తెప్పించే విధముగా పంబజోడు వాయిస్తున్నారు. ఆనాడు బాలచంద్రుని యుద్ధ కథ చెబుతున్నట్లు ఉన్నాడు. కథకుడు బాలచంద్రుడు నరసింహుని చంపుట, తనతండ్రి బ్రహ్మనాయని నిందించుట, సంకుల సమరములో ఎందరో వీరుల నతడు చంపి పలువుర చేతిలో వీరస్వర్గము పొందుట, లోకమంతటా దట్టంగా చీకట్లు కమ్ముకొనుటా వర్ణిస్తున్నాడు.

ఆ కవి ఎవరో చదువు రానివాడు. ఆ చెప్పే కథకుడు పిచ్చుకుంట. నోట అసలే పట్టలేకున్నాడు. ఐతేనేమి? ఆ అపశబ్దాల కూర్పుకు కథకుని

ఉచ్చారణ దోషాలు తోడై, కథా కథనానికి ఇది అది అని వర్ణింప సాధ్యము కాని వీర రస స్థాయి ఐన వీరోత్సాహము ఆవేశింప జేస్తున్నవి. అక్కడ తన అలంకార శాస్త్ర లక్షణాలేవీ—గుణాలు, దోషాలు అన్వయించడములేదు. వీరరసము మాత్రము ప్రత్యక్షముగా ఉత్పన్న మవుతున్నది. అపభ్రంశమైన ఆంధ్రభాష, మ్లేచ్ఛభాషలకైనా సాటి రాక పోతుందా అని అనుకొంటూ ఆలోచిస్తున్నాడు శ్రీనాథ కవి సార్వభౌముడు.

అవతల చీకటి వర్ణన సాగుతున్నది. అది విచిత్ర విధంగా శ్రీనాథుని హృదయములో కటికి చీకటిని ఆవేశింపజేసింది. ఆ చీకటి ఆవేశమునే ఆయనకు ఎప్పుడో కునుకు పట్టినది.

ఏమిటిది? ఆ మహా తమస్సులో నుంచి ముందు అపూర్వమైన నీలిరంగు దీపరేఖ వంటిది భాసించినది. బాకు పిడీ, దాని నంటుకొని బాకూగా అది సాక్షాత్కరించినది. ఆ బాకు వాదర కాంతులు కన్నులు మిరమిట్లు కొలుపుతున్నవి. దాని పిడి పీత వర్ణ ముతో వెలుగుతూ రత్నస్థగిత కాంచన కాంతులు వెదజల్లుతున్నది. అజ్ఞానంధ కారచ్ఛటలను ఛేదించే మహాశస్త్రము వలెనే శ్రీనాథుని కా దివ్యమూర్తి భాసించినది.

అంతలో ఆ మూర్తి తాను దర్శించి అర్చించిన మాచర్ల చెన్న కేశవస్వామివారి అర్చామూర్తి దివ్యాకారముగా ప్రత్యక్షమైనవి.

మురళీ మోహనుని వంశీవినాదము చెవులలో శ్రావ్యముగా మ్రోగిన ట్లనిపించినది.

"కమనీయ కిశోర ముగ్ధమూర్తేః
కలవేణుక్వణి తాదృతాననేందోః
మమ వాచి విజృంభతాం మురారేః
మధురిమ్ణః కణికాపి కాపి కాపి"
అని శ్రీనాథుడు ధ్యానము చేసినాడు.

ఇంతలో అది ఇంద్ర ధనుస్సు కొంతులతో వెలుగుతూ శ్యామల మేఘునివలె ఉండి బర్హస్ఫురిత రుచిగల గోపవేషము ధరించిన విష్ణువు రూపముగా తోచి శ్రావ్యగంభీర మేఘ ఘోష వినిపించినట్లయినది.

"శౌర్యంబు పుణ్యంబు సమకూర్చినట్టి
పలనాటి వీరుల భాగవతంబు
ప్రకటితంబుగ నీవు రచియించి మాకు
అంకితం బొనరింప ననువొందు జూవె!"

అన్నట్లు శ్రీనాథునకు స్పష్టముగా వినిపించినది. ఆ తర్వాత మళ్ళీ ఆయన హృదయ కుహరములో అంధకారమే నిండిపోయినది.

ఇంతలో మేలుకువ వచ్చినది. నాగులేటినుండి చల్లని మెల్లని గాలి దివ్య సుగంధముతో కలిసి ఒంటిమీద వీచి పరమ శాంతి చేకూర్చినది. శ్రీనాథు డాశ్చర్యముతో ఆలోచింప సాగినాడు.

ఏమిది? రాత్రి తాను విన్న వీరగాథ అసమమై ద్విపద పాద లక్షణానికి సన్నిహితముగా ఉన్నది. ప్రాసలేదు. స్వామిలీలలు చిత్ర విచిత్ర ములు. అవి మన బుద్ధి కందనివి. ఈ పుణ్యక్షేత్రములో, వీరోచితముగా పోరాడి వీర మరణము పొంది వీరస్వర్గ మలంకరించిన పలనాటి వీరులే ఆ రాత్రి కథాశ్రవణముతో తన హృదయ మావేశించినారు. "అలరాజు బాకున అవతార మొంది"నాడనే ప్రతీతి కల మాచర్ల చెన్నకేశవస్వామి ఇచ్ఛయా ఇది! ప్రాసలేని ద్విపద కావ్యముగా పల్నాటి వీరుల భాగవత కథ చెప్పుమని తన్ను స్వామి ఆదేశిస్తున్నాడా? బాగున్నది.

ఇది అపూర్వ సంఘటన. తానెన్నడూ ద్విపద కావ్య రచన చేసిన గుర్తులేదు. ద్విపద కావ్యము విసుగు పుట్టిస్తుందని తన అభిప్రాయము. పైగా స్వామి నోట విన్నది ప్రాసభంగమయిన ద్విపద. అంటే ద్విపద కాని ద్విపద! అది ఏకపదియై బహుపదియై మంజరిగా వెడలినది. తా నా

రాత్రి దూరాన నుండి ఆలకించిన కథా ధోరణియే తన కీ రూపముగా స్వామి నోట పలికినట్లు శ్రుతమైనది. ఏమైనా కృతార్థుడనే. స్వామి ఆజ్ఞ శిరసా వహించ వలసినదే! కాని లేఖకుడేడీ?

ఈ విధముగా ఆలోచించుకుంటూ ప్రాతఃకాలీన స్నాన సంధ్యాగ్ని హోత్ర జపాదికము పూర్తిచేసుకొని విడిదిచేసిన ఇంటి ముంగిటి పంచలో సుఖాసీనుడై పరమేశ్వరధ్యానము చేస్తూ శ్రీనాథుడు అర్ధనిమీలిత నేత్రాలతో పరధ్యానముగా ఉన్నాడు.

ఇట్లా ఉండగా కొంతసేపటికి ఎదుట ఎవరో క్రొత్తవాడైన బ్రాహ్మణ యువకు డొకడు వినీతుడై చేతులు జోడించి నిలుచున్నట్లు తోచినది; కళ్ళు తెరిచి చూడగానే అతడు తాను వీరభద్రయ్యశర్మనని పేరు చెప్పుకొని గోత్రాదికస్మరణ పూర్వకముగా పాదాభివాదనము చేసి లేచి చేతులు కట్టుకొని శ్రీనాథుని ఎదట నిలబడ్డాడు. అతనిని చాప మీద కూర్చుండుమన్నను కూర్చుండక ఏదో అర్థించుటకు వచ్చిన అర్థి వలె వినీతుడై నిలిచియే ఉన్నాడు,

"నాయనా, ఏమి కావలెనోయి?"—శ్రీనాథుని ప్రశ్న!

"కవి సార్వభౌమా, తమరిని ఒకటి అర్థించడానికి దర్శించ వచ్చాను. తాము మహాకవీశ్వరులు. సమ్మతింతురో లేదో అని జంకు తున్నాను."

"విన్న తర్వాతకదా సమ్మతి, అసమ్మతి తెలుపుట!" ఈ మాట అంటున్నప్పుడు శ్రీనాథుని ముఖము చిరునవ్వుతో వికసించినది.

"కవిశేఖరా, తమరు భీమేశ్వరపురాణము, కాశీఖండము వంటి మహాపురాణాలు రచన చేసిన మహాకవీశ్వరులు! అవి కూడా కాశీలో విశ్వేశ్వరుడూ, దక్షిణకాశిలో దాక్షారామ భీమేశ్వరుడూ వంటి అనాది దైవతాల మహత్త్వాలు వర్ణించే మహాకావ్యాలు—మరి ఈ మా దేశానికి

మా పల్నాటి వీరులే ప్రత్యక్ష దైవతాలు. వాళ్ళ చరిత్ర ఉత్సాహాతిశయమే కాని వ్యుత్పత్తి ఏ మాత్రమూ లేని కవిబ్రువులూ అపండితులూ రచన చేసి, ఏ మాత్రము విద్యాగంధమూ లేని వారికి చెప్పి పాడిస్తున్నారు.—పల్నాటి వీరుల చరిత్ర తమరు తమ నోటిమీదుగా సెలవిస్తే నాకు వ్రాసుకుందామని ఉన్నది ప్రభూ!—నిన్ననే తమరు మా ఊరు పావనము చేసినారని విన్నాను; ఎన్నాళ్ళుగానో నాకున్న కోరికతో ఆలోచిస్తూ ఉండగా రాత్రంతా నాకు నిద్ర పట్టలేదు. తెల్లవారు జామున చిన్న కునుకు పట్టినది. కలలో మీరు నాకు దర్శన మిచ్చినారు. అందువల్ల ధైర్యముచేసి తమను అర్థించ డానికి ఇట్లా వచ్చాను. తమ అనుగ్రహమూ, మా ప్రాప్తము!"

"గీర్వ్షమైన వీరభద్రయ్య ప్రార్థనను శ్రీనాథుడు అవలోకగా ఆల కించినాడు. వింటున్నకొద్దీ ఆయన ముఖాన చిరునవ్వు చిందులాడినది. ఇది నిశ్చయముగా చెన్నకేశవస్వామి ఆదేశమే అనిపించినది.

"ఇప్పుడు నేను అదే ఆలోచిస్తున్నాను. స్వామి ఈ తెల్లవారు జాముననే స్వప్నములో ప్రత్యక్షమై నన్ను ఇట్లే ఆదేశించినాడు. లేఖకు లెవరు చిక్కుదురా అని ఆలోచనలోపడ్డాను. ఆ స్వామియే సమయానికి నిన్ను సమకూర్చినట్లున్నది. కాక స్వామే నీ రూపంలో వచ్చినాడేమో కూడాను ఇప్పుడు. బాలచంద్రుడు చెన్నకేశవ ప్రసాదము వల్ల జన్మించినా డంటారుగదా! బాలచంద్రుని యుద్ధము చెబుతాను. ప్రయాణ మధ్యములో ఉన్నానుగదా! నాకు బుద్ధిపుట్టినప్పుడల్లా చెబుతూ పోతాను. వెంట ఉండి వ్రాసుకోగలవా?—"

"అనుగ్రహీతుడను. చిత్తము. హనుమానుడు మా యింటిదైవము. నిలవక సాగిపోయే సూర్యభగవానుని వెంట ఉండి విద్యలన్నీ స్వామి గ్రహించినట్లుగానే, నేనూ తమతో ప్రయాణముచేస్తూ స్వామి అనుగ్రహము వల్ల తమ చిత్తము వచ్చి చెప్పినప్పుడు వ్రాస్తూ ఉంటాను!"

ఆ మాటలలో వ్యక్తమైన వీరభద్రయ్యకుగల స్వామిభక్తి, ఆత్మ విశ్వాసమూ, వినయమూ, గౌరవమూ శ్రీనాథుణ్ణి ఆకర్షించినవి.

"ఆరి పిడుగా!—అయితే చెబుతా వ్రాయి!, అదుగో ఆ సంచిలో పత్రాలు ఉన్నవి తీసుకో!"

"చిత్తము. అవసరములేదు. పత్రాలు కోశముగా గ్రథనముగా చేసి సిద్ధము చేసుకొని వెంట తెచ్చుకున్నాను. ఇదుగో కత్తి ఘంటము, లగ్నము బాగున్నది. కోశపూజా, లేఖినీపూజా చేసి ఇప్పుడే శ్రీకారము చుట్టేదా?"

"నిజంగానే పిడుగువే! ఐతె కానీ!"

వెంటనే వీర భద్రయ్య కోశఘంటాలను గంధ కుంకుమ ధూపదీప నైవేద్యాలతో అర్చించి, శ్రీకారము చుట్టినాడు. అంతసేపూ శ్రీనాథుడు చెన్న కేశవస్వామిని ధ్యానిస్తూ ఉండి పూజ ముగిసినదే వ్యవధానముగా చెప్పత మారంభించినాడు.

"శ్రీరఘునాయకు జిత్తమం దెంచి
"శ్రీకంఠు బరమేశు శివు నాత్మ దలచి—"

విపరీతమైన వేగముతో శ్రీనాథుడు చెప్పసాగినాడు. ఎక్కడా తడుము కోకుండా అంతవేగముతోనూ వీరభద్రయ్య లిఖింప సాగినాడు. అతని కత్తి ఘంటము బాలచంద్రుని ఖడ్గమువలెనే అలవోకగా తాళపత్రాలను చిట చిట లాడిస్తూ సాగిపోతున్నది.

శ్రీనాథున కాశ్చర్యమైనది. అంత వడిగా తాను చెప్పుతుండగా ఆగ కుండా అడగకుండా తల ఎత్తకుండా వ్రాయగల లేఖరిని ఆయన మును పెప్పుడూ చూచివుండలేదు. తప్పక చాలా తప్పులూ, లోట్లూ ఉంటవని ఆయనకు నిశ్చయము కలిగినది. ఆ మాట అనకుండా అనాటి మధ్యాహ్నము చెప్పబోతూ, ఎంతవరకూ చెప్పినానో చూస్తానంటూ కోశము తీసుకొని చదివినాడు. శ్రీనాథునికి చదువుతున్నకొద్దీ కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు.

ఒక్క తప్పులేదు. ఒక్క తుడుపులేదు. పంక్తులు గీటు గీసినట్లు సమ రేఖలో సాగినవి. అక్షరాలు గుండ్రముగా ముత్యాలు కూర్చినట్లున్నవి. శ్రీనాథుడు సంతోషాద్భుతాలను ఆపుకోలేక, "నిజముగానే పిడుగువయ్యా, వీరభద్రయ్యా! అద్భుతమైన వ్రాయసకాడవు నీవు! ఏ రాజాస్థానములోనూ నీవంటి పిడుగును చూడలేదు!"

వీరభద్రయ్య నడుముకు ఉత్తరీయము కట్టి, "ధన్యోస్మి" అంటూ శ్రీనాథునకు సాష్టాంగ దండప్రణామము చేసినాడు. తదాది వారి ఇంటిపేరు పిడుగువారై పోయినది.

ఆ తర్వాత శ్రీనాథుడు వీరభద్రయ్యను కోశము చూపుమని మళ్ళీ ఎన్నడూ అడుగలేదు. మధ్య మధ్య తన కథన వేగమును, చమత్కారము కోసము విపరీతముగా హెచ్చిస్తూ తగ్గిస్తూ, కవనము సాగిస్తూ ఉన్నాడు. కాని వీరభద్రయ్య నిష్కంపముగా, నిలకడగా వ్రాస్తూ ఉన్నాడు.

ఈ విధముగా మూడు రోజులపాటు ప్రయాణములో పల్నాటి వీర చరిత్ర శ్రీనాథుడు నిరాఘాటముగా చెప్పుకొని పోతూ ఉండెను. నాల్గవనాటి ఉదయాన బండిలో కూర్చుండి ప్రారంభింపబోగా ద్విపద సాగలేదు. వృత్తాలు మనస్సులో తిరుగసాగినవి. ఆశ్చర్యపడుతూ వీరభద్రయ్య వంక ప్రశ్నిస్తున్నట్లు తల ఎత్తి చూచినాడు. వెంటనే వీరభద్రయ్య గ్రహించు కొని కొంచెము ఆలోచించి స్మరణకు తెచ్చుకొని ఇట్లా అన్నాడు:

"కవిసార్వభౌమా, మన మీ నాటి ప్రయాణములో మా పల్నాటి తూర్పు హద్దులో ఉన్న మా పల్నాటి గణపయ్యను దాటి వచ్చినాము. మనము బండి దిగి ఆయనకు మ్రొక్కలేదు."

శ్రీనాథుడు వెంటనే బండి దిగి వీరభద్రయ్యతో కలిసి వెనుకకు

నడిచి వెళ్ళి పల్నాటి గణపయ్య సన్నిధికి పోయి సాష్టాంగ దండప్రణామము చేసి ధ్యానించి పూజచేసి మళ్ళీ బండి ఆగి వున్న చోటికి నడిచివచ్చి బండి ఎక్కినాడు. ఇప్పుడు కథనము అరంభించగా నిరాఘాటముగా సాగి పోయినది.

అప్పుడాశ్చర్యముతో శ్రీనాథుడు, "వీరభద్రయ్యా, నిజంగానే మీ పల్నాటి దేవుళ్ళకు ఎంత ప్రభావ మున్నది? వెనక నేను "చిన్న చిన్న గుళ్ళ చిల్లరదేవుళ్ళు" అని ఇత్యాదిగా అహంకరించి చెప్పినందుకు, ఈ చిన్నగుళ్ళోని ఈ చిన్నదేవర నాకెంత తేలికగా వాగ్బంధము చేసినాడయ్యా! పైకి చిన్న చిన్న గుళ్ళలో చిల్లర దేవుళ్ళుగా కనిపించే పల్లెనాటి నాప రాళ్ళకు ఎంతెంత మహత్త్వమున్నది! నాచేత చెన్నకేశవస్వామి ఈ పల్నాటి వీరచరిత్ర చెప్పించి నా జిహ్వను పవిత్రము చేయ వలెనని కటాక్షించి కాబోలు నాచేత ఇది చెప్పిస్తున్నాడు!" అని ఈ విధంగా అనాడల్లా మాటి మాటికీ శ్రీనాథుడు పల్నాటి దేవుళ్ళ మహత్త్వమే వీరభద్రయ్యతో ఉగ్గడింప సాగినాడు.

ఈ విధంగా ప్రయాణ మధ్యంలోనే పల్నాటి వీరచరిత్రలో బాల చంద్ర యుద్ధము పూర్తి అయినది. ఫలశ్రుతి కూడా చెప్పినాడు.

ఫలశ్రుతి ప్రారంభించగానే వీరభద్రయ్య కళ్ళు పెద్దవిచేసి శ్రీనాథ కవి వంక తలయెత్తి చూచినాడు. అంతేకాని ఆ మహాకవితా స్రవంతికి అడ్డుకట్ట వేయడానికిగాని, తన మనస్సులో ఆడుతున్న మాట విన్నవించు కోడానికి గాని ధైర్యము చాలక కవి చెప్పినదంతా వ్రాసి పూర్తిచేసి వీర భద్రయ్య ఇట్లా విన్నపము చేసినాడు:

"కవిసార్వభౌమా, ఫలశ్రుతి చెప్పి కావ్యము పూర్తిచేసినావేమి! తక్కిన పల్నాటి యుద్ధకథ చెప్పదలచలేదా?"

"వీరభద్రయ్యా, నీవైనా మరి జ్ఞాపకము చేయలేదేమయ్యా?-నిజమే.

చెన్నకేశవస్వామి పలికించిన నా చివరి పలుకు ఇదే ఏమో! స్వామి ఇచ్చ ఇంతవరకే అన్నమాట!"

"చిత్తము. నన్నిక సెలవు తీసికోమందురా?"

"శుభం భూయాత్!"

"సెలవు. కాని— ఈ కృతి సమర్పణ స్వామి సన్నిధానంలో వైభవంగా జరిపిస్తాను. తమరు తప్పక దయచేయవలె సుమా!"

"ఏమో, అప్పటిమాట! నందో రాజా భవిష్యతి!"

"ఎంతమాట! తమ అనుగ్రహమువల్ల మా పల్నాడుకీర్తి వహించింది. ఈ నాటికి మా పల్నాటి ప్రజలకు మహాకవులను ఎట్లా సమ్మానించవలెనో కొంత తెలియక పోలేదు!"

"మామీద మాచర్ల చెన్నకేశస్వామి అనుగ్రహము ప్రసరించడమే శతాధిక సమ్మానము. పల్నాటి వీరుల ప్రాణాలు లెక్క చేయక వీరోచితంగా దేహాలు వదలి దేవతలైనారు. వారిని కీర్తించి నేనూ వారి కీర్తిలో ఏ లవలేశమో పంచుకుంటాను!"

గౌరవ ప్రపత్తులతో వీరభద్రయ్య సెలవు తీసుకొని వెళ్ళి పోయినాడు. అప్పటికి బొడ్డుపల్లి చేరుకోడానికి రెండు మజిలీలు మాత్రమే మిగిలి ఉన్నవి. అప్పటి కప్పుడే శ్రీనాథ కవి సార్వభౌముని ఎదుర్కోడానికి ఆయన సేవకులు ఎదురు వచ్చినారు.

# 7

శ్రీనాథుడు సకుటుంబ పరివారముగా బొడ్డుపల్లి చేరుకొనేసరికి అక్కడ అంతా గందరగోళముగా ఉన్నది. పరివార జనులంతా ఆయనను దర్శించి గౌరవము చూపినారు. కాని వాళ్ళుచేసే ప్రతిచర్యలోనూ ఏదో లోపము ఉన్నట్లుగా కనిపిస్తున్నది. అదేదో ఇది అని చెప్పే వీలులేకున్నది.

ప్రతివారికీ ఏదో మాట నోటి చివరి దాకా వచ్చి ఆగిపోతున్నది. ఏదో పెద్ద ప్రమాదము జరిగి ఉండవలె. అదేదో ప్రస్తావించడానికి ఎవరికీ ధైర్యము లేదు. శ్రీనాథుడు ఏదో విశేషమున్నదని గమనించినా, ఎరుగని వానివలెనే నిండుగా ప్రవర్తించినాడు.

ఆ రాత్రి భోజనము చేసి శ్రీనాథుడు విశ్రమించబోయే సమయములో ప్రధాన కార్యకర్త ఏకాంతముగా దర్శించినాడు. అతడు విచార సాగరములో మునిగిన వానివలె స్తబ్ధుడై నిలబడి పోయినాడు.

శ్రీనాథు డది కనిపెట్టి ఆదరముతో తన దగ్గర కూర్చుండ బెట్టినాడు. అప్పుడు నెమ్మది నెమ్మదిగా కార్యకర్త స్థితిగతులు ఒక్కొక్కటే నివేదింపసాగినాడు. మధ్యమధ్య అతనికి కన్నీరు కూడా వస్తున్నది.

"ప్రభూ, తమరు మల్లికార్జునస్వామి దర్శనానికి వెళ్ళినది మొదలు, మనమీద స్వామికి అనుగ్రహము తప్పినది....స్వామి మనలను పరీక్షచేయ దలచినట్లున్నది—లేకపోతే మన కిన్ని అవస్థలేమిటి!"

"నాయనా, స్వామి దృష్టి సమగ్రమైనది, అపరిమితమైనది, మనదో? పరిమితమైనది. మనది మానవమాత్ర దృష్టి: స్వామిది దివ్య దృష్టి. మన దృష్టి యోజన పరిమితమైనది: స్వామి దృష్టి అనంత పర్యాప్త మైన దూరాతిదూర దృష్టి! అది పరిపూర్ణమైనది. స్వామికి మనమీద అనుగ్రహము తప్పిన దనుకోడానికి మనము చేసిన అపరాధమేమీ లేదు. నిరపరాధులమీద స్వామికి అనుగ్రహము తప్పుతుం దనడానికి అవకాశ మెంత మాత్రమూ లేదు. చూడు నాయనా, ఒకటి బాగా తెలుకో! ఎప్పుడైనా స్వామి ఇచ్ఛ మన ఇచ్ఛలకు విరుద్ధంగా ప్రసరిస్తూ ఉంటే, స్వామి ఇచ్ఛా మార్గములోనే, అది ఎంత కష్టమైనా, మన శ్రేయఃపథము ఉన్నదని తెలుసుకో వలసినదిగా స్వామి మనలను ఆదేశిస్తున్నా డన్నమాట! స్వామి ఆదేశమే మన శ్రేయస్సు!"

ఈ విధంగా శ్రీనాథుడు కొంత స్వగతముగాను, కొంత ఎదుట ఉన్న కార్యకర్తను సంబోధిస్తున్నట్లూ పలికినాడు. ఆయన భావమంతా కార్యకర్తకు అవగతము కాలేదు. అతడు మౌనముగా ఆలకించి చింతతో ఇట్లా ప్రారంభించినాడు:

"ప్రభూ, నేను తమ కార్యకర్తను. తమరు గుత్తకు తీసుకున్న పొలాల వ్యవహారము చూసేందుకు నియుక్తుడనైనాను. నాకు మీ రప్పగించిన భూములు బాగ పండించవలె. పండిన పంట నిలవ ఉంచుకొన్నది పోను, తక్కిన దానికి మంచి ధర రాబట్టి పెట్టవలె. అప్పుడు నావని సార్థకమైనట్లు. స్వామి అనుగ్రహ మంటే నా దృష్టిలో మంచి పంట, మంచి ధర! అవి విపరీతంగా పరిణమిస్తే స్వామి అనుగ్రహము తప్పినట్లే. తమరు సర్వజ్ఞులు, బ్రహ్మ నిష్ఠులు. జరిగినది జరిగినట్లుగా నివేదించుకుంటాను—అది స్వామి ఆగ్రహము కాదని, అనుగ్రహమే అనీ, ఎట్లా సమన్వయము చేయవలెనో తమరే సెలవీయండి! —"

కార్యకర్త క్షణకాల మాగినాడు. శ్రీనాథుడు ఆలోచనా పరుడై ఉండి, జరిగినదేమో చెప్పు మనగా అతడు ఇట్లా నివేదించినాడు.

"ప్రభూ, కృష్ణవేణమ్మ ముమ్మారు పొంగినది! మొదటి వరద వస్తూ ఉండగానే, మన సేవకుల నందరినీ కూడవేసి, ఊరి వారిని ఉద్బోధించి, మన పల్లపు భూములకు వరద తాకిడి తాకకుండా పెద్ద కరకట్ట వేయించినాను. కృష్ణవేణమ్మ తల్లి అనుగ్రహించి, మన కరకట్టను ప్రదక్షిణించి, చిరు కెరటాలతో ముద్దుపెట్టుకొని, చిరునవ్వు నవ్వి వెళ్ళిపోయినది. ఐనా ఆ కట్టను మరింత బలపరిపించినాను. ఆరాత్రి ఊళ్ళో ఎవరమూ నిద్రపోలేదు. తెల్లవారు జామున కృష్ణవేణమ్మ పరవళ్ళు త్రొక్కుతూ వచ్చినది. ఆ దెబ్బకు గడియ సేపటిలో అంతటి కరకట్టా కూలి కరిగి కృష్ణలో కలిసి పోయినది. మన పల్లపు పొలాలు అన్నీ మునిగి

పోయినవి. నా గుండె లాగినట్లయినది. కాని వరద రెండు మూడు గడియలలోనే తీసినది. మన పొలాలు, మన పాలి రైతుల పొలాలు మొత్తముమీద పెద్ద దెబ్బ తినలేదు. ఐనా అశ్రద్ధ చేయక అందరినీ ప్రోత్సహించి పల్లపు పొలాల చుట్టూ పెద్ద కరకట్ట మరింత గట్టిగా వేయించినాను. మళ్ళీ మూడవసారి కృష్ణవేణి పొంగినది. ఈ మాటు కరకట్ట ఎత్తులో సగముదాకా కూడా నీళ్ళు రాలేదు. నేను తృప్తితో నిట్టూర్పు వదలినాను. సాయంకాలానికి వరద తీయుడము ఆరంభించినది. అయినా ఆరాత్రి నిద్రపోక కట్టచుట్టూ కాగడాలు వేసుకొని తిరుగుతూ కాపు కాచినాము. అర్ధరాత్రము దాటినది. మన పల్లపు పొలాలన్నీ నీటిలో మునిగి పోయినవి. మన కరకట్టకు మధ్య నీరు నిలిచినది. అడుగునుండి పెద్ద జల పైకి ఉబికి ఉండవలె. ఆ నీరు బయటికి పంపడానికి గూడలు వేసినాము. మేము ఎంత నీరు తోడినా నీరు గోరువాసి తరగలేదు. మూడు పగళ్ళూ, మూడు రాత్రులూ మేమంతా చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనవి. చుట్టూ నీరు తగ్గలేదు. కట్టలోపలి నీరు తగ్గలేదు. అప్పటికంతా అలసిపోయినారు. ఉపాయము తోచక కృష్ణవేణమ్మకు దణ్ణాలు పెడుతూ ఊరుకోకుండా ఏదో ఓపిక వున్నంతవరకూ నీళ్ళు తోడిస్తూ ఉన్నాను. అట్లా వారము రోజులపాటు మన పల్లపు పొలాలన్నీ నీటి క్రింద మునిగిపోయి వున్నవి.

అప్పుడు నీరు నెమ్మదిగా తీయసాగినది. చూచుకోగా ఏపుగా పైరు పెరిగి కోతకు సిద్ధమవుతున్న మన పల్లపు పైరంతా ఇసుక మేటవేసి ఒకటే దిబ్బగా మారిపోయి ఉన్నది."

"స్వామీ, ఇది కృష్ణవేణి అనుగ్రహ మంటారా, స్వామి అను గ్రహ మంటారా? ఎంత తక్కువైనా పదహారువేల టంకాలు రావలసిన మన పల్లపు పైరులు ఇసుక ఒండు కలిపిన దిబ్బగా మారిపోయినవి. స్వామి అనుగ్రహము ఇట్లా ఉన్నది ప్రభూ!—"

కార్యకర్త కంట తడిపెట్టి మౌనము వహించినాడు. మాటలలో మధ్యమధ్య కంఠము గద్గదమైనది. శ్రీనాథుడు కూడా మౌనమే వహించినాడు. ఇదికూడా స్వామి అనుగ్రహముగానే భావించడానికి ఆయనకు కూడా తగినంత శక్తి వచ్చినట్లులేదు. ఆయన తరుచుగా హృదయంలో భావించే భావన మధ్యమధ్య కార్యకర్తకు వినవచ్చినది.

"శివోహం — శివోహం — శివోహమ్" —ఇంకా శ్రీనాథుడు మౌనమే వహించి ఉన్నాడు. కార్యకర్త మరి కొంపసేపు మౌనముగా ఉండి డగ్గుత్తికతో మళ్ళీ సాగించినాడు.

"ప్రభూ, ఒకనాటి రాత్రి, కృష్ణానదిలో కొన్ని నౌకలు వచ్చి, బొడ్డుపల్లిని చుట్టుముట్టినవి. వాటిలోనుండి సాయుధులైన దస్యులు దిగినారు. మనభటులు వారితో తలపడినారు కాని లాభము లేకపోయినది. వారు లెక్కలేనంతమంది ఉన్నారు. ప్రతి ఘటన నిష్ప్రయోజనమని నేనే మన భటులను, మనుష్యులను వారించినాను. ఆ దస్యులు మన యిళ్ళలో జొరబడ్డి విలువగల వస్తువులన్నీ తీసుకొని పడవల కెక్కించుకొనివెళ్ళిపోయినారు— మనము భోజనానికి నిలవ చేసిన ధాన్యాదులు కూడా చాలా భాగము దక్కకుండాపోయినవి—స్వామి అనుగ్రహము మళ్ళీ ఇలా ప్రసరించినది!"

శ్రీనాథుడు ధ్యానించినాడు. ఆయన మనస్సులో ఏమి భావాలు పుట్టి శమించినవో తెలియదు. శ్రీకృష్ణ పరమాత్మ అంత్యదశ స్ఫురించినదేమో! ఆయన మాత్రము మాటాడలేదు. కార్యకర్త సాగించినాడు:

"ప్రభూ, ఇంత నష్టపోయినా మనము నిలద్రొక్కుకొనడానికి మన మెట్టపైరులు బాగున్నవని కొంత తృప్తితో ఉంటిని. వాటికి వరద దెబ్బ తాకలేదు. ఆ దస్యులు వచ్చిపోయిన మరునాటి సాయంకాలమే వేలకువేలు నల్లపిట్టలు బారులు కట్టివచ్చి మన పైరుల మీదనే బిలబిలమంటూ వాలినవి అవి వాలినచోట గింజ మిగలలేదు. తిలలు, పెసలు పొలాలలో గింజ

లేకుండా అవి నాకివేసినవి — ఇప్పుడు మన పశువులకు గ్రాసమైనా తగినంతలేదు. నాకు కర్తవ్యము తోచకున్నది. తమరు దయచేసినారు. నేను వ్యవహరించిన స్థలాలలో ఏ ప్రభువుకూ నష్టము రావడ మెరగను. నాకు తలకొట్టి వేసినట్లున్నది—"

"నిన్ను కరణము చెరపెట్టినాడట గదా !"

"ఎవరు చెప్పినారు ప్రభూ?—నేను అటువంటి వార్త పంపలేదే?"

"వార్తాహరుడు నాకు ముందు చెప్పినదదే — మొన్న మకాములో ఉండగా నిన్ను వదలినట్లుగా కూడా వార్త వచ్చినదే!"

"చిత్రముగా ఉన్నది. యిట్టి వార్తలు కేవలము అబద్ధాలు. ఎట్లా పొక్కినో!"

"కరణము తనకు పైరుమీద చౌకగా అమ్మలేదనే క్రోధము కడుపులో పెట్టుకొని నన్ను అవమానించడానికి ఈ పని చేసినాడని కూడా విన్నాను."

"శాంతం పాపమ్! మన కరణము నిషధయోగ్యుడు. అంత సత్పురుషుడు లోకంలో అరుదు ప్రభూ!"

శ్రీనాథుడు ఆశ్చర్యంతో చూస్తూ ఉండగా కార్యకర్త చెప్పసాగినాడు.

"ఈ దేశ భాగమును ఒడ్డె దొరలు కొత్తగా జయించినందున ఇక్కడివారి నెవరినీ నమ్మడములేదు. పంటలు పొలాలనుంచి ఇండ్లకుచేరితే శిస్తులు వసూలు కావని వారి భయము. రాచగాదెలు పాతవి పాడయినందున ఈ సంవత్సరము ప్రభుత్వానికి చెల్లించవలసిన నాల్గవపాలు, ధాన్యరూపంగా కాకుండా ధనరూపంగానే తీసుకోడానికి ఎక్కువ చోట్ల యేర్పాటు చేసుకొన్నారు. అదికాక ఏమూల ఎవరు తిరుగుబాటుచేసి, రెడ్డివారినో కర్ణాటకప్పు వారినో తెస్తారనే భయము కూడా ఉన్నట్లున్నది. మరి ఎక్కడనైనా, పెద్ద

పెద్ద యుద్ధాలు కూడా జరుగుతున్నవేమో, ఆ రహస్యము మనకు తెలియదు. అందువల్ల ఒడ్డె చోరలు వచ్చినంతవరకు కరములు రాబట్టుకొనుటే పనిగా పెట్టుకొన్నట్లున్నారు. అనాదిగా ఉన్న ఈ దేశాచార ప్రకారము ధనరూపంగా చెల్లించవలసినవి శివరాత్రికి ముందు చెల్లించే అలవాటులేదని కరణాలు ఎంత చెప్పినా పైవారు వినిపించుకోవడములేదు. మకర సంక్రాంతికి మక్తాలు ఇయ్యని వారిని చెరపెట్టమనీ, అట్లాచేయని వారిని శిక్షిస్తామనీ కరణాలకు తాఖీదులు వచ్చినవట. అందువల్ల బొడ్డుపల్లి కరణము నన్ను చెరపట్టినట్లే నటించి, తన యింటిలో అంతర్గృహములో ఉంచి, నాకు సుఖవసతి కల్పించినాడు. తమరు వస్తున్నారని విని వదలినట్లు పంపివేసినాడు. ఆయనకు మన పైరులు అమ్మలేదని ఏ మాత్రమూ మనఃక్లేశమున్నట్లు లేదు. దైవికముగా మనకు సంభవించిన నష్టాలకు చాలా విచారపడుతున్నాడు. అతడు మనకు ఆప్తుడు. కరణము సంగతి అది— సరే. మన పరివారానికి మనమియ్యవలసిన భృతులు యిచ్చేటందుకు ద్రవ్యము లేదు—"

ఇట్లా చెప్పి తాను వ్రాసి ఉంచిన లెక్కలు కవిసార్వభౌమునికి నివేదించినాడు.

శ్రీనాథుడు ఆ లెక్కలు ఇటు అటు తిరుగ వేసినట్లు త్రిప్పి చూచి అడిగినాడు.

"ఇంతవరకు మన పరివారానికి ఎంత ఇయ్యవలెనో తేల్చినావా ? వెంటనే ధాన్యాది కావసరాలకు ఎంత ద్రవ్యము కావలె?"

"చిత్తము. పదకొండు వందల టంకాలు పరివారానికీ, ధాన్యాదులకు మూడువందలూ కావలె!"

"నావద్ద ప్రస్తుతము 1,500 టంకాలు ఉన్నవి. రేపు సాయంకాలము లోపుగా పరిజనానికి కాసు బాకీ లేకుండా చెల్లించి అవసరము లేని వారిని

పంపించి వేయి. కావలసిన ధాన్యాదులు కూడా వెంటనే తెప్పించు. ఇవిగో 1,400 టంకాలు!"

ఇట్లా అని 1400 టంకాలు కార్యకర్త ముందు రెండు సంచులలో పెట్టినాడు.

కార్యకర్త: "ప్రభూ, ఒడ్డెదొరలకు గుత్తబాపతు 700 టంకాలు మనము ఇంకా చెల్లించవలసి ఉన్నది. అది వెంటనే చెల్లించకపోతే మనకు ప్రమాదము రావచ్చు!"

శ్రీనాధుడు: "ఫరవాలేదు. మన ఒప్పందము ప్రకారము రెండు వంతులు ముందుగా చెల్లించినాము. తక్కినది మహాశివరాత్రికే చెల్లించే ఏర్పాటు స్పష్టముగా కరణము లెక్కలలో వ్రాసి ఉన్నది. ఈమధ్య ఏ ఒడ్డె దొరలూ మనలను అడిగే హక్కులేదు. మహాశివరాత్రినాటికి మనకు అధమ పక్షము మూడువేల టంకాలైనా వస్తవి."

కార్యకర్త: ప్రభూ, ఈ ఒడ్డె దొరలు కక్కుర్తి మనుష్యులుగా ఉన్నారు. న్యాయాన్యాయాలు వారి తల కెక్కవు. పెద్దా చిన్నా విచక్షణలేదు. పైగా మనభాష వాళ్ళకు అర్థము కాదు. ఆ దుబాసీలు ఏమి చెప్పితే అదే వాళ్ళకు వేదవాక్యము!

"ఏర్పాటు లేనిది ఏ దొరలు మాత్రము ఎట్లా అడగ గలరు? తురక రాజ్యములో కూడా పై అధికారులకు చెప్పుకోవడమున్నదే. ఒడ్డె దొరలకు అది కూడా లేదా?"

"లేదు ప్రభూ, లేదు! ఈ ఒడ్డె దొరల పద్ధతులను గూర్చి విపరీత మైన కథలు వినవస్తున్నవి. ముందు మన మా 700 టంకాలు వాళ్ళకు చెల్లించి వేయడమే క్షేమమని నా ఉద్దేశము. కరణము కూడా తమ కదే విన్నవించమన్నాడు.

"అయితే పరిజనాన్ని - అవసరము లేనివారిని కూడా వెంటనే పంపి

వేయక మహాశివరాత్రి వరకూ ఉంచుకొని, భృతు లియ్యమంటావా?"

"కాదు ప్రభూ! అవసరములేని పరిజనాన్ని వెంటనే పని చాలించు కొమ్మని పంపివేసి, వాళ్ళకు ఇయ్యవలసిన భృతులు రెండు నెలల తర్వాత తీసుకొనేట్లు ఒప్పించే బాధ్యత నాది."

"అది నాకేమాత్రమూ ఇష్టములేదు. మన భృత్యులకు భృతులియ్యక పంపివేసి, వాళ్ళను రెండు నెలలు గడువు అర్థించడము నాకెంత మాత్రము సమ్మతము కాదు నాయనా! ఒడ్డె దొరలకు వాళ్ళు అరచి గీపెట్టినా మహాశివ రాత్రి వరకూ కాసు చెల్లించేదిలేదు. వెర్రి భయాలు పెట్టుకోక నేను చెప్పి నట్లు చేయి! మరొకమాట వద్దు! ఆ టంకాలు లెక్కపెట్టుకొని తీసుకుపో!— నిద్రాభారంగా ఉన్నది."

విధిలేక కార్యకర్త ఆ టంకాల సంచులు తీసుకొని సెలవు పుచ్చు కున్నాడు. మరునాడు మధ్యాహ్నము లోపలనే కార్యకర్త శ్రీనాథుని ఆజ్ఞను పాటించి పరిజనుల కందరికి జీతభత్యాలు కాసువీసము బాకీలేకుండా చెల్లించి అక్కరలేని వారిని పంపివేసినాడు. ధాన్యాదులు తెప్పించే ఏర్పాట్లు కూడా చేసినాడు.

పంటలన్నీ పాడైనా తమ జీతభత్యాలు లెక్క ప్రకారము చెల్లించి నందుకు పరిజనులు శ్రీనాథమహాకవి వితరణను మరి మరి శ్లాఘిస్తూ, కవికీ కార్యకర్తకూ పునఃపునః ప్రణామాలుచేసి సెలవు తీసుకొన్నారు.

శ్రీశైలమునుండి కవిసార్వభౌముడు పెద్ద బంగారపు ముద్దలతోనే తిరిగి వచ్చినాడని బొడ్డుపల్లిలోను, ఆ చుట్టు ప్రక్కలను అంతటా ప్రథ పాకిపోయినది.

# 8

ఇది జరిగి వారము రోజులు గడచినవి. అమరావతి ఒడ్డె రాయ సాధికారి సపరివారముగా వచ్చినాడు. ఆయనకు తోడుగా అక్కడ ఉప మండలాధిపతి వినీతుడై సంచారము చేస్తూ సహాయము చేస్తున్నాడు. వారా ఉపమండలములో ప్రధాన గ్రామాలకువెళ్ళి ప్రభువులకు రావలసిన ధాన్యాలు, పన్నులు, నిర్దాక్షిణ్యముగా వసూలు చేయసాగినారు. చుట్టుప్రక్కల గ్రామా లలో గగ్గోలు పుట్టినది. రాయసాధికారి పరివారములో యెందరో తురక లున్నారు. ఒడ్డెవారూ, తురకలూ ఆ కాలములో ఒడ్డెవారి పరిపాలనము లోను, తురక రాజ్యాలలోను అమలులో ఉన్న కఠిన పద్ధతులే కాక, అప్పు డప్పుడు వారికి స్ఫురిస్తున్న కొత్త రీతులు కూడా అవలంబించి క్రూరముగా శిస్తులు వసూలుచేయ సాగినారు. అధికారులు వస్తున్న వార్త విన్నంతనే ప్రజలు భీతావహము చెంది దాగుకొనేవారూ, ఊళ్ళు వదలి పారిపోయేవారూ కాగా, వసూలు కష్టతరమైనది. దానితో అధికారులు రెచ్చిపోయి బాకీ ఉన్నవారిని, లేని వారిని విచక్షణ లేకుండా నానా హింసలు పెట్ట సాగినారు.

రాయసాధికారి ప్రధాన కేంద్రము అమరావతిగా పెట్టుకొన్నాడు. అక్కడినుంచి అన్ని దిక్కులకు గొడవలు సాగిపోతున్నవి. ఇట్లా సాగి పోయిన తర్వాతగాని ఆ అధికారి దృష్టి అమరావతి ఎదురుగా కృష్ణలంకలో ఉన్న బొడ్డువల్లి వంక ప్రసరించలేదు. అది లంక కావడము ఒకటి, కృష్ణ పొంగి ఈ సంవత్సరం పంట అంతా నాశనమైనదని ఉపమండలాధిపతి సహా అంతా ఎరిగి ఉండడము ఒకటి అందుకు కారణాలు.

ఆ రాయసాధికారివద్ద ప్రధానమైన దుబాసీ నాగయ్య అనే బ్రాహ్మణ బ్రువుడు. అతడు వెనుక కొండవీటి రాజ్యములో పులిపాడులో కరణముగా ఉండి తక్కిన గ్రామాధికారులతో కలసి శ్రీనాథుని విద్యానగర యాత్రలో

అసౌకర్యాలు కలుగజేసినాడు. కవీశ్వరుడు కోపించి పులిపాటి వృత్తాంతము తన కరణముచేత వ్రాయించి పెదకోమటి వేమారెడ్డి ప్రభువుకు పంపుతూ ఈ పద్యము చేర్చినాడు.

> "ఊరు వ్యాఘ్ర నగర మురగంబు కరణంబు
> కాపు కపివరుండు, కసవు నేడు,
> గుంపు గాగ నిచట గురజాల సీమలో
> ఓగులెల్ల గూడి రొక్కచోట!"

అది తెలిసి నాగయ్య తనకిక కొండవీటి రాజ్యములోఉంటే బ్రదుకు మీద ఆశలేదని ఊరు వదలి శ్రీవిద్యానగర రాజ్యములో ఉన్న వినుకొండ వెళ్ళి అక్కడి దండనాథుడైన వల్లభరాయనికి శ్రీనాథుని యాత్రను గూర్చి లేనిపోనివి కల్పించి చెప్పగా, ఆ దండనాథుడు జాగరూకుడై విచారణచేసి అబద్ధమని తెలుసుకొని పరాభవించి రొమ్ముతో పాకించి శ్రీనాథ కవి పాదాలకు నమస్కారము చేయించినాడు. ఇక నాగయ్య కొండవీటి రాజ్యములోను శ్రీవిద్యానగర రాజ్యములోను నిలవ నీడలేక తన ఉంపుడు కత్తెను తీసుకొని తురక రాజ్యాలతోసహా నానారాజ్యాలూ తిరిగి తిరిగి భాషలు నేర్చి చివరకు ఒడ్డె రాజ్యముచేరి ఈ రాయసాధికారికి దుబాసీగా కుదురుకున్నాడు. తన స్వగ్రామమైన పులిపాడులోని ఇల్లూవాకిలీ పొలాలూ అన్నీ విడిచిపోవడానికి ప్రధానకారకుడు శ్రీనాథుడైనందున, ఆయనమీద పగ, పాతికేళ్ళు దాటినా, తగ్గక దినదిన ప్రవర్ధమానము కాసాగినది.

నాగయ్యకు ఈ మధ్యనే యాదృచ్ఛికముగా శ్రీనాథుడు బొడ్డుపల్లి గుత్తకు తీసుకొన్నాడనీ, ఇంకా ఏడువందల టంకాలు బాకీఉన్నాడనీ తెలియవచ్చింది. వెంటనే కడుపులో కూడి ఉన్న విషమంతా పొంగి దేహమంతా వ్యాపించినది. ఆయనవద్ద పైకమేమీ లేదనీ, పంటలు నాశనమైనవనీ, ఐనా శివరాత్రి దాకా వ్యవధాన మున్నదని ధీమాతో ఉన్నాడనీ కూడా తెలిసినది.

తన కసి తీర్చుకోడానికి ఇదే అదను అని నిశ్చయించి ఉపాయము ఆలో చింపసాగినాడు.

ముందు ఒకనాడతడు రాయసమును కృష్ణానదిమీద నౌకావిహారానికి ప్రోత్సహించినాడు. ఆ విహారయాత్రలో చుట్టుప్రక్కల గ్రామాలు, దేవా లయాలు, లంకలు రాయసము పరివారముతో కలసి నాగయ్య కూడా చూచి నాడు. అమరేశ్వరాలయమున్న గుట్ట, వైకుంఠపురము కొండమీద ఉన్న దేవాలయము కృష్ణమీదినుండి చూడగా ఎక్కువగా వారిని ఆకర్షించినవి. తిరుగుప్రయాణములో వజ్రాలతిన్నెను వారు చుట్టి వచ్చిరి. అప్పుడు దుబాసీ నాగయ్య రాయసము దృష్టిని బొడ్డుపల్లి వంకకు మళ్ళించి "ఆ లంక పేరేమి?" అని ఉపమండలాధిపతిని అడిగినాడు. రాయసము అప్పుడు బొడ్డుపల్లి వివరాలు అడుగగా, ఉపమండలాధిపతి ఈ సంవత్సరము మున్నూరు కృష్ణవరద వచ్చి ఆ గ్రామములోని పంట పూర్తిగా నాశనమయి నదని నివేదించినాడు.

నాగయ్య ఎరుగనట్లే, "అది పాపము, ఈ సంవత్సరము గుత్తకిచ్చి నారా, రైతులే చేస్తున్నారా?" అని ప్రశ్నించినాడు.

ఉపమండలాధిపతిగొప్పగా అది ఈ సంవత్సరము శ్రీనాథకవిసార్వ భౌముడు గుత్తకు తీసుకొన్నాడని చెప్పినాడు. కవిసార్వభౌమ బిరుదము వినగానే రాయసము ఉత్సుకత కలిగి ఆయనను గూర్చిన వివరాలు అడిగి నాడు. ఉపమండలాధిపతి తాను విన్నంతవరకు ఆయన వైదుష్య విశే షాలూ, కవితాప్రతిభా వర్ణించి శ్రీవిద్యానగరములో డిండిమభట్టారకులను జయించి కంచుఢక్క పగులగొట్టించి కవిసార్వభౌమ బిరుదము పొంది కన కాభిషేకము దేవరాయల సభలో చేయించుకొన్నాడని గౌరవముతో వర్ణించి నాడు.

దుబాసీ నాగయ్య తానుకూడా వారి అతిశయము కొంత ఎరిగి ఉన్నా

వనీ సూచిస్తున్నట్లు అందుకొని వర్ణిస్తూ నెమ్మదిగా ఆ సంభాషణను ఆయన రాజకీయ సామర్థ్య చాతుర్యముల వంకకు మళ్ళింప సాగినాడు.

ఆ సంభాషణవల్ల శ్రీనాథుడు మొదట కొండవీటి ప్రభువులైన పెదకోమటి వేమారెడ్డివద్ద విద్యాధికారిగా ఉన్నాడనీ, అప్పుడు విద్యానగరానికి విద్యా విజయయాత్ర పేరుతో వెళ్ళి కొండవీటి వారికీ, కర్ణాటక ప్రభువులకూ రాయబారాలు జరిపినాడనీ, తర్వాత రాచకొండ వారికీ, కొండవీటి వారికీ రాయబారము జరిపి రెడ్లవారి నంది కంత కటారి తెచ్చి యిచ్చినాడనీ, కొండవీటి రాజ్యము చిదికిపోయిన తర్వాత తనకు బాల్యమిత్రులైన అవచిదేవయ త్రిపురారిశ్రేష్ఠి ప్రభువుల సహాయముతో రాజమహేంద్రవరపు రెడ్డి రాజ్యములో చేరినాడనీ, వారి ప్రధానమంత్రి ఐన బెండపూడి అన్నామాత్యుడు ఈయనకు సమీపబంధు వనీ, ఒడ్డెరాజుల సేనలను ఎదిరించడములో రాజమహేంద్రవరపు రెడ్డిరాజులకు కర్ణాటక రాజ్యసేనల సహాయము వచ్చేట్లు చేసినాడనీ, కర్ణాట దండనాథులలో వినుకొండ వల్లభరాయడు, తెలుగురాయడు. పంటమైలారురెడ్డి మొదలయినవా రెందరో ఆయనయందు భక్తిప్రపత్తులు కలిగినవా రనీ వివరిస్తూ కర్ణాట ప్రభువుల వద్దను, రెడ్డిప్రభువుల వద్దను, రాజుకొండప్రభువుల వద్దను ఎంతో పలుకుబడికల వ్యక్తి శ్రీనాథుడని నుతించినాడు నాగయ్య. రాయస ప్రభువుకు శ్రీనాథుడు రాజకీయముగా ప్రమాదము తీసుకొని రాగల సమర్థత కలవాడని సందేహ మంకురించినది. అది కనిపెట్టి నాగయ్య ఉపమండలాధిపతిని "శ్రీనాథకవి సార్వభౌముడు ఇక్కడే కాపుర ముంటున్నాడా?" అని ప్రశ్నించినాడు.

"ఇక్కడనే కాపురము. ఈమధ్య శ్రీశైల యాత్రచేసి అక్కడ రెండు మూడు నెల లుండి ఒకటి రెండు వారాల క్రిందటనే ఇక్కడికి వచ్చినాడు."

నాగయ్య ఆశ్చర్యముతో "శ్రీశైలయాత్రే! అక్కడ అంత కాలము

ఎందుకున్నా డబ్బా. ఇంత పొలము వ్యవసాయము వదలి!" అన్నాడు. ఈ వ్యవసాయము ఒడ్డె ప్రభువుల కన్ను మూయడానికి వేసిన ఎత్తుగడగాని ప్రధానము కాదనీ, శ్రీశైలములోని కర్ణాట దండనాథులతో మంతనానికే అక్కడికి పోయి ఉంటాడనీ, రాయస ప్రభువుకు బాగా సందేహము గట్టి పడినది.

రాయసము శ్రీనాథుని గూర్చి ఎన్నెన్నో ప్రశ్నలు ఉపమండలాధి పది నడిగినాడు. ఆయన ఇస్తున్న జవాబులకు మధ్య నాగయ్య కల్పించు కుంటూ, వాటికి మలుపులు ఇచ్చి అపార్థాలు చేసి, శ్రీనాథుని చర్య లన్నీ జాగ్రత్తగా కనిపెట్టుతూ సమయము చిక్కినప్పుడు తల ఎత్తకుండా చితుక కొట్టవలసినవా డనే అభిప్రాయము దృఢముగా కలిగించినాడు. రాయసము శ్రీనాథుని విషయములో తన ఉపమండలాధిపతిని కూడా విశ్వసింపదలచ లేదు.

ఆరాత్రి ఇంటికి చేరినంతనే రాయసప్రభువు ఏకాంతముగా దుబాసీ నాగయ్యను పిలిపించి, శ్రీనాథుని గూర్చి వివరాలు ఎన్నో అడుగగా, ఉన్నవి లేనివి ఎన్నో చెప్పెను. దానితో త్వరలో తమ రాజ్యభాగముమీదికి శ్రీశైల రాజ్యము మీదుగా ఏదో పెద్ద దండయాత్ర రాబోతున్నదనే భయము రాయసమును ఆవేశించినది. ఇక క్షణము ఆలసింపరాదు. ఆ తెల్లవారు జామునే బొడ్డుపల్లి కరణమును ఉన్నవానిని ఉన్నట్లు రమ్మని రాయసము శ్రీనాథుని గూర్చి, ఆయన శ్రీశైల యాత్రనుగూర్చి, స్థితిగతులను గూర్చి గుచ్చి గుచ్చి ప్రశ్నలు వేసినాడు. కరణము ఉన్నదున్నట్లు చెప్పినాడు. "శ్రీనాథుడు సాటిలేని విద్వాంసుడు. మహాకవి. బ్రహ్మణ్యుడు. తపస్వి. గొప్పదశ అనుభవించి చివరిరోజులు వెనుకటి మర్యాదలతో జీవయాత్ర నెట్టడానికి బింకముతో ప్రయత్నిస్తున్నాడు. ఈ సంవత్సరము కృషిలో, పాపము దైవ మనుకూలించలేదు. ఈ పంటతో జన్మకు ధనావసరము తీరి

పోతుందనే ఆశతో ఉండగా, కృష్ణవేణమ్మ దస్యులు పిట్టలు వరుసగా సర్వనాశనము చేసినవి. దెబ్బమీద దెబ్బ ఇట్లా తగిలితే ఇంకొకరయితే అక్కడికక్కడనే దిగులుతో ప్రాణాలు వదిలి ఉండేవారు. ఆయన నిబ్బరముతో మన ప్రభుత్వానికి ఇయ్యవలసిన దిగుబాటు బాకీ శివరాత్రినాటికి కట్టివేయడానికి, ఈ వార్ధక్యములో కూడా తన గ్రంథరచనమీదనే ఆధారపడి ఉన్నారు. ఆయనకు, పూర్వమేమోకాని, ప్రస్తుతము రాజకీయాలతో ప్రమేయము లేదు. శ్రీశైల యాత్ర చేసినది పుత్ర వాంఛతో. అందులో మాత్రము స్వామి అనుకూలించినట్లు వినవస్తున్నది—"

ఇది కరణము చెప్పిన మాటల సారాంశము. రాయసమునకు నమ్మకము కలుగకపోగా కరణము కూడా శ్రీనాథుని కుట్రలో ఉన్నాడని గట్టి సందేహము కలిగినది. అప్పుడు దుబాసీ నాగయ్య అందుకొని ఈ ప్రశ్న వేసెను:

"మరి ఇంత పరివారానికి తానియ్యవలసిన జీత భత్యాలు ఇచ్చివేసినాడా, బాకీపడి ఉన్నాడా?"

వెంటనే కరణము జవాబిచ్చినాడు. "ప్రభూ! శ్రీనాథభట్టారకులు లోకులకు, అందులో పరివార జనానికి, ఋణపడి వాళ్ళను ఇబ్బందిపెట్టే బాపతు మనుష్యుడు కాడు. తానే ఎట్టి ఇబ్బందయినా పడి మాట నిలుపుకొంటాడు. శ్రీశైలంలో తన శివరాత్రి మాహాత్మ్యమనే కావ్యాన్ని శాంతయ్య దండనాథునికి కృతి ఇచ్చి ఆయన చేసిన సమ్మాన ద్రవ్యముతో, రాగానే పరివారజనుల జీతభత్యా లన్నీ ఇప్పించినాడు!"

శాంతయ్య దండనాథుడూ ద్రవ్య మియ్యడమూ అనగానే రాయసానికి శ్రీశైలము నుంచి ఏదో దండయాత్ర వస్తున్నదనీ, ఇక్కడి తిరుగుబాటు దార్లకు ఇయ్యడానికి శ్రీనాథుడు ద్రవ్యము తెచ్చినాడనే భావము మరింత దృఢపడ్డది. ఇంకొక ఆలోచన ఆయన బుద్ధి కెక్కలేదు.

"మనకు ఆయన గుత్తబాపతు ఎంత బాకీ?"

"గుత్త తీసుకొన్నది రెండుపేలనూరు లంకాలకు. అందులో ఒకవేయినాలుగువందలు ముందే చెల్లించి ' భూములు స్వాధీనపరచు కొన్నాడు. తక్కిన ఏడువందలు మహాశివరాత్రికి చెల్లించవలె."

"శివరాత్రికా? అందాకా ఆగే వీలులేదు! ఒడ్డె రాజుల ప్రభుత్వమని తెలుసునా?"

"ప్రభూ, ఒడ్డె ప్రభువుల వద్దనే అయన గుత్తకు పుచ్చుకున్నది. ఈ ఏర్పాటు అప్పుడే మాగ్రామ లెక్కలలో వ్రాయించి, గుత్తకిచ్చిన రాయసము దాని మీద సంతకము కూడా చేసినాడు. కంచే చేను మేసినట్లవు తుంది, మన ప్రభుత్వం చేసుకొన్న ఒప్పందాన్ని మన ప్రభుత్వమే ఉల్లంఘిస్తే!"

రాయసము, "అధిక ప్రసంగము చేయకు! నీకు బుద్ధిలేనట్లున్న దే?"

కరణము పై అధికారులవల్ల మందలింపులు పడ్డవాడు కాడు. వెనకటి ప్రభుత్వాలలో అధికారులు కరణాలను మందలించ వలసి వచ్చి మందలించినా, మెత్తని మాటలు మాట్లాడే వారు. అధికారి ప్రయోగించిన అమర్యాద మాటలు వినగానే, కరణము ముఖము రోషముతో జేవురించి కందగడ్డవలె ఐనది. వెంటనే నిర్భయముగా, మాట తడవుకో కుండా కరణము ఇట్లా అన్నాడు:

"ప్రభూ, మాటకు కట్టుపడని ప్రభుత్వానికి సేవచేయడము మాబోంట్లకు సాధ్యముకాదు. నాకీ కరణీకము వద్దు. ఇప్పుడే వదలు కొంటున్నాను. ప్రభుత్వము దస్తు అంతా గ్రామ కాపువద్దనే ఉన్నది. నావద్ద ఉన్న కవిలె కట్టలన్నీ ఇప్పుడే కాపుకు పంపిస్తాను. సెలవా?"

ఇట్లా అంటూ కరణము బయలుచేరబోతూ ఉన్నాడు. ఈ సంభాషణమంతా దుబాసీ నాగయ్య ద్వారానే జరిగినది. కరణము శ్రీనాథ భక్తుడని తెలిసికొన్న నాగయ్య, పై సంభాషణ బాషాంతరీ కరణము

చేయడములో కేవలము లేనివి కల్పించకపోయినా, ఆ రాయసము మాటలు మరింత అవమానకరమైన తిట్లుగా మారటానికి, కరణము వాక్యాలు మరింత ధిక్కార వచనాలుగా రాయస ప్రభువుకూ తోచేట్లుగా, కాకువులో చిన్న మార్పులు చేసి తగాదా పెంచినాడు. శాంతయ్యా దండనాథునితో కలసి శ్రీనాథుడు సాగిస్తున్న కుట్రలో ఈ కరణము కూడా కలసినవాడే అని రాయసము నిశ్చయానికి వచ్చినాడు. కాని ఏమి చేయవలెనో తోచక రాయసము తటపటాయిస్తూ ఉన్నాడు. అది కనిపెట్టి నాగయ్యా వెళ్ళ బోతున్న కరణమును ఆపి ఇట్లా సంభాషణ సాగించినాడు:

"శ్రీనాథుడు శ్రీశైలము నుంచి వచ్చిన తర్వాత పరివారము జీతాలకు గాని, తక్కిన ఖర్చులకు గాని ఎంత చెల్లించినాడో తెలిసినదా?"

"1400 టంకాలు ఖర్చుచేసినాడని విన్నాను."

"కరణముగారూ, ఇప్పుడు వారి వద్ద ఎంత పైకము మిగిలి ఉన్నదో ఎరుగుదురా?"

"అప్పటిలో వంద టంకాలు మాత్రము మిగిలి ఉన్నవని విన్నాను. ఈ మధ్య మరికొంత సెలవు ఐ ఉండవలె."

దుబాసి నాగయ్య: "కరణంగారూ, మీరు చెప్పేది నిజమే అని నమ్మమంటారా? దొరతనము వారికి 700 టంకాలు ఋణపడి ఉండి, అది చెల్లించక ఎవరైనా చేతిలో ఉన్న ధనమంతా పరివార జనానికి చెల్లిస్తారా? పోనీ, మహాశివరాత్రికి మాత్రము ఎట్లా చెల్లించదలచు కొన్నాడు. చెప్పండి కరణంగారూ? తమరు మాట తప్పని సత్యసంధులు కదా?"

కరణము కోపముతో జవాబు చెప్పబోతూ ఉండగానే, రాయసము కల్పించుకొని వాళ్ళ సంభాషణము ఆంధ్రభాషలో జరిగినందున, దాని సారాంశమేమని ప్రశ్నించినాడు. దుబాసి వినయవినీతుడై రాయస ప్రభువుకు నమస్కరిస్తూ ఇట్లా చెప్పినాడు:

"ప్రభూ, మన కరణంగారు శ్రీనాథ భట్టారకుల వద్ద ప్రస్తుతము ధనమేమీ లేదంటున్నారు. ఆయన కొండవీటిలో విద్యాధికారిగా ఉండి పెద కోమటి వేమారెడ్డిగారివల్ల పొందిన ధనము ఇంతంతకాదు. పండితులకు ఎన్నెన్ని అగ్రహారాలు ఇప్పించినాడు! ఆ పండితులంతా విద్యాధికారికి రహస్యంగా వేరే కట్నాలు సమర్పించుకొనేవారు. విద్యా నగరంలో కన కాభిషేక గౌరవము పొందినాడు. అప్పుడు దేవరాయుల వారూ, వారి సామంతులూ, మంత్రులూ, దండనాథులూ, వెర్రివ్యామోహంతో కనక వర్షము కురిపించి కవిని పూజించారు. అవచి తిప్పయ్యశ్రేష్ఠి, కిరీటరాజా-రాజాధిరాజులకే అప్పులు పెట్టే కుబేర సమానుడుగా, శ్రీనాథునివల్ల గ్రంథ మంకితము చేయించుకొని ఎంత కనకము బహూకరించాడో చెప్పలేము. రాజమహేంద్రవరములో మంత్రులూ ప్రభువులూ గ్రంథాలు అంకితాలు చేయించుకొన్నప్పుడు ఎంతెంత బహూకరించారో మరి!—మన ఒడ్డె సేనలు రాజమహేంద్ర వరము పట్టుకొన్నప్పుడు రాజకోశములో ధనమేమీ లేదని విన్నారో లేదో మీరు? అదంతా ప్రభువులు స్వయంగా కొంతా, బెండపూడి అన్నామాత్యులు కొంతా, ఆయన బంధువైన శ్రీనాథభట్టు కొంతా తీసుకుపోయి కోనసీమలో మారుమూల గ్రామాలలో దాచారు. ఇప్పుడు శ్రీశైల సీమనుంచి శ్రీనాథభట్టు శాంతయ్య దండనాథునివల్ల బంగారపు ముద్దలే బళ్ళలో తెచ్చినాడని ప్రతీతి. ఈ విధంగా కవి సంపాదించిన ధనమంతా నేలమాళిగలలో ఎక్కడో దాచి ఉంటాడు. అవసరమైతే డబ్బు వెదజల్ల గలడు. పాపమీ కరణముగారికి ఆయన కొత్త-విమీ తెలియదు. శ్రీనాథుడంటే పండితులూ ప్రభువులూ పడి చచ్చిపోతూ ఉంటారు. వెనకా ముందూ చూడక ధనము కొల్లయిస్తారు. ఆయన ఆకర్షణ మటువంటిది—ఈ మధ్య పైర్లన్నీ నాశనమైపోయినా ఒక్క రోజులో 1400 టంకాలు పరిచారకులకు పంచిపెట్టినాడు గదా! చిన్న రాజ్యాలే కొనివేయగల మహాసంపన్నుడీ కవి!—ఈ వెర్రిబాగుల

కరణముగారు ఆయన ప్రభావము ఏమీ ఎరగడు. అదే ఆయనకు చెబుతున్నాను, ప్రభూ!"

ఈ మాటలు వినగా ఒడ్డెరాయసమునకు మతిపోయినది. శ్రీనాథుడంతే భయ మావేశించినది. అతడు ప్రభుత్వానికి ఇవ్వవలసిన బాకీ ఉండగా, అది వసూలు చేయక, పైగా అతడు శత్రువులతో నిస్సయంగా, బహిరంగముగా చేతులు కలిసి కుట్రచేసి తిరుగుబాటు లేవనీయబోతూ ఉంచే, ప్రభుత్వానికి ఎంత ప్రమాదకరము! తనకు పై అధికారుల వల్ల ఎంత మాట వస్తుంది! తాను చేసిన తెలివి తక్కువ తెలిసి పాతసామంత ప్రభువు అసమర్థతగానే కాదు, ద్రోహముగానే భావించి, తనకేమి శిక్ష ఐనా విధింపవచ్చు. కాబట్టి వెంటనే శ్రీనాథునితో కఠినముగా వ్యవహరించవలెనని నిశ్చయించినాడు.

దానికి ముందు ఈ కరణమును శిక్షింపవలెనని అతని పోనీయక భటులను పిలిచి బంధింపమని ఆజ్ఞాపించినాడు. అని విని కరణము క్రోధోగ్రుడై మౌనము వహించినాడేకాని తనకు వినీతుడై బ్రతిమాలు కొనలేదు. దానితో రాయసమునకు అతడు తప్పక తిరుగుబాటు దారుడని మరింత దృఢభావము కలిగినది. కరణమును చెరసాలకు పంపించి శ్రీనాథుని వెంటనే పిలుచుకొని రమ్మని భటునితో చెప్పినాడు.

అది విని నాగయ్య రాయన ప్రభువుకు ఇట్లా విన్నవించినాడు. "ప్రభూ, అట్లాకాదు. భటులు వచ్చినాడని వినగానే వెంటనే కవి పైకము చెల్లించి తప్పుకొంటాడు. ఆయనను నెమ్మదిగా మర్యాదగా రప్పించి శిక్షించవలె. తొందరపడవద్దు, ప్రభూ!"

"అయితే నీ సలహా ఏమిటి?"

"ఇక్కడ కవిపండిత గోష్ఠికి పిలిపించినట్లు పిలిపించండి. ఆ విధంగా రప్పించి బిగించి వేయవచ్చు!"

"పండిత గోష్ఠుల వ్యవహారము మాకు తెలిసినది కాదే! రాయస
ములో తప్ప మనకెందులోనూ పాండిత్యము లేదే!"

"అదేమి ప్రభూ, తమరు వినయమువల్ల అట్లా అంటున్నారుగాని
తమకు ఎందులో పాండిత్యములేదు? ఓఢ్రభాషలో మీరు చెప్పిన గీతాలు
తగ్గు గొంతులో మీలో మీరు పాడుకొంటూ ఉంటే నేను వినలేదను
కున్నారా? ఎంత మధురమైన గీతాలు మీరు వ్రాసినవి! సరే మీ సంగీత
శాస్త్ర పాండిత్యము జగత్ప్రసిద్ధమైనది కదా! మీరట్లా పాడుకొంటూ ఉంటే
యెంతో ముచ్చటగా ఉండి రహస్యంగా చాటున వుండి యెన్నిసారులు
విన్నానో మీకేమి తెలుసు?—తమకు సంస్కృత భాష మాత్రము రాదం
టారా?"

తన కవిత్వాన్ని పొగిడినప్పుడు ఏ కవి ఉబ్బిపోడు! యిక గీతాలు
అల్లడమే అభ్యాసము చేస్తున్న రోజులలో పొగడినప్పుడు ఆనందము
వర్ణించసాధ్యమా? రాయసము నాగయ్య మాటలకు పొంగిపోయినాడు.
తాను ఎన్నాళ్ళనాడో కొంచెము నేర్చి మరచిపోయిన సంస్కృత భాషలో
తనకు పాండిత్యమున్న దనికూడా భావించినాడు. ఈ చిక్కు వ్యవహార
భారము సమస్తము దుబాసీ నాగయ్యకే రాయసము వదిలివేసినాడు.

"ఉరగంబు కరణంబు" అని పూర్వము శ్రీనాథభట్టు చెప్పిన
పద్యము సార్థకము చేస్తూ, దుబాసీ నాగయ్య కార్యక్రమానికి ఉపక్రమిం
చాడు.

## 9

తెల్లవారుజామున పీడకల వచ్చినదని భూదేవి గొడవచేసినది. శ్రీనా
థుని పరిజనులను, చుట్టుప్రక్కల గ్రామీణులను కేకలు వేసి గగ్గోలు పుట్టిం
చినది.

శ్రీనాథుని కేమి చేయను తోచలేదు. తనకూ ఆ తెల్లవారుజాముననే దుఃఖస్వప్నము వచ్చినది. కొమ్ములొడ్డి దున్నపోతుల మంద తన్ను వెంటాడుతున్నది. తాను శిరస్సున ఎఱ్ఱని పూలదండలు ధరించి దిగంబరుడై పరుగులు పెట్టుతున్నాడు. దుఃస్వప్న పరిహారార్థమై మహేశ్వర ధ్యానముచేసి శివోహం, శివోహం, శివోహమ్ అని అనుకొంటూ ఉండగానే అవతల భూదేవి గోల ప్రారంభమయినది.

"నన్ను, చెరువులో ఉండగా, పాము కరిచింది. అయ్యో! — నే నింకా బ్రతికే ఉన్నానా? — నా సంగతి పట్టించుకునేవాళ్ళే లేరు. ఒళ్ళంతా మొద్దుబారుతున్నది! — అయ్యో, నే నే లోకంలో ఉన్నాను....?—"

శ్రీనాథుడు తన దుఃస్వప్న భావనలో నుంచి మనస్సు మరల్చుకొని ఆమెవద్దకు వెళ్ళి ఆమె దేహము మృదువుగా ముఖమునుంచి రొమ్మువరకు, శిరస్సునుంచి వెన్ను పొడువునా తన కరపద్మాలతో నిమురుతూ, నీవు కన్నది సుస్వప్నము. నీకు కుమారుడు పుట్టగలడు!— నాకు మాత్రమీనాడు దుఃస్వప్నమే వచ్చినది" అని ఓదార్చబోయినాడు.

అపైన భూదేవి ఇంకో విధముగా గందరగోళము సాగించినది- "అయ్యో! మీకే దుఃస్వప్నమే వస్తే, ఈ స్థితిలో ఉన్న నాకిక దిక్కెవరు? పైగా ఇంట్లో ద్రవ్యమంతా ఖర్చుచేసి, అవసరాలకుకూడా మిగల్చకుండా చేశారే!—నా గతి యేమి కావలె? మిమ్మను ఏమనవలె?"

ఆ మాటలు శ్రీనాథుని హృదయములో శూలాలవలె గ్రుచ్చుకొన్నవి. అందులో తనకు వచ్చిన దుస్స్వప్నమువల్ల కలిగిన హృదయ భారముతో ఉన్నందున, ఆ మాటలు మరింత బాధ కలిగించినవి. "ఇది ఇంత స్వార్థపరురాలేమి!-నే నెంత బాధపడుతున్నా, పైకి కనబరచకుండా, సర్వవిధాలా దీన్ని సుఖపెట్టడానికి పాటుపడుతున్నానే! ఇటువంటి భార్యలు సంసారులకు విరక్తి కలిగించరా?"

అంతలో జనముకూడి భూదేవిని అడుగుతూ ఉంటే తన కల వారికి వివరిస్తున్నది. ఆ గొడవ వింటూ వుండగా శ్రీనాథభట్టు మనస్సులో విచిత్రమైన భావపరంపర ఉత్పన్నమైనది.

"శ్రీదేవి నాకు ఈ సంసారమందు రక్తి పెంచినది. ఈ భూదేవి నన్ను విరక్తుణ్ణి చేయడానికి పూనుకున్నట్లున్నది. మనలను మాయలో ముంచేవాళ్ళు అప్తులా? మాయనుండి తప్పించుకోమని ఏదో ఒక రూపంగా ఉపదేశించేవాళ్ళు ఎక్కువ అప్తులా?"-మహాదేవా, నీ లీలలు ఎంత చిత్రములయా!-మహాదేవా, కాలకంధరా, శివా, శంకరా!-" శ్రీనాథుని భావనలు ఈ లోకమును దాటిపోతున్నవి.

భూదేవిని కొంచెము తాను ఓదార్చి తక్కినది చేరిన జనానికి వదలిపెట్టి శ్రీనాథుడు శీఘ్రగతిలో స్నానసంధ్యాగ్ని హోత్రాలు తీర్చుకొని దుస్స్వప్న దోషాపహముగా అయుత సంఖ్యాకమైన ప్రాసాద పంచాక్షరీ జపము నిష్ఠగా చేసినాడు.

అది పూర్తి చేసుకుని తన దివాణపు మంటపములోనికి వచ్చి కూర్చోగానే, అమరావతిలో విడిసిఉన్న రాయసప్రభువు వద్దనుంచి విద్యాగోష్ఠికి రమ్మని ఆహ్వానము వచ్చినది. అది పైకి రూపములో ఆహ్వానమే కాని, విద్యాగోష్ఠి మర్యాదగా తన విద్యావైభవమూ ఎరిగినవాళ్ళు పంపిన ఆహ్వానముగా లేదు. అది సామాన్యపు పిలుపు. ఆహ్వానపు ఆకారములో ఉన్న ఆజ్ఞ.

శ్రీనాథునికి చిరాకు పుట్టినది. తనకు వచ్చే తీరుబడి లేదని వార్త పంపవలెనని మొదట అనిపించినది. కాని రాయసము క్రూరుడని విన్నందున ఎందుకైనా మంచిదని వెళ్ళడానికి నిశ్చయించాడు. గోష్ఠికి తాను వెళ్ళడానికి కృష్ణ దాటడానికి నావకూడా పంపలేదు.

ఆ వచ్చిన భటుడు తొందర చేస్తున్నందున శ్రీనాథభట్టుకు చిరాకుగా

ఉన్నది. ఆయన నెమ్మదిగా భోజనాదికము చేసి విశ్రమించి, ఆ భటునికి షడ్రసోపేతముగా భోజనము పెట్టించి కృష్ణపాయ దాటడానికి తన హంస ముఖ నౌక సిద్ధము చేయించి, అందలము అవతలి ఒడ్డుకు పంపించి, ఆ నౌకలో కృష్ణపాయ దాటి, ఒడ్డున సిద్ధముగా ఉన్న నెమలి ముఖపు అందల మెక్కి రాయసము విడిదికి దారి చూపగా వెళ్ళినాడు.

అక్కడ చూడగా గోష్ఠికి ప్రయత్నాలే కనబడలేదు. దివాణపు చావడిలో చాపలైనా పరచిలేవు. పండితు లెవరూ వచ్చిన జాడ లేదు. తన్ను ఎదుర్కొని లోపలికి తోడ్కొని పోయేవారెవరూ కనిపించలేదు. తనవెంట వచ్చిన భటుడు అదృశ్యమైనాడు.

నడివీధిలో దింపియున్న తన పల్లకిలోనే శ్రీనాథుడు గడియ సేపు న్నాడు. అప్పుడు దివాణములో నుంచి చిరునవ్వులు ఒలుకుతున్న ముఖ ముతో దుబాసివచ్చి "ఓహో, శ్రీనాథ కవి సార్వభౌములా, ఏదో పనిమీద ఇటు దయచేసినట్లున్నారు!" అని పలకరించినాడు.

దుబాసిని, మారిన ఇప్పటి ఒడ్డె వేషములో కూడా, శ్రీనాథుడు వెంటనే గుర్తించినాడు. ఇతడు నిశ్చయముగా తాను పూర్వము పరాభవించిన పులిపాటి కరణమే! "ఊరు వ్యాఘ్ర నగర మురగంబు కరణంబు" వల్లభరాయలు 'ఉరగమే' అంటూ రొమ్ము మీద ప్రాకించి తన పాదాలు పట్టించిన నాగయ్యయే! ఉద్యోగము పోగొట్టుకొని ఇతడిప్పుడు ఒడ్డె దొరల కొలువులో చేరి ఏదో పదవి సంపాదించినా డన్నమాట! అతని మాటలలో గర్భితంగా ఉన్న వ్యధికరణము శ్రీనాథుడు గమనించకపోలేదు. ఈ ఉర గము కోరలు పీకించి విష మంతా వెళ్ళగక్కించవలె! కాబట్టి నిబ్బరముగా మాట్లాడ దలచినాడు.

"పని ఏమీలేదు. ఇక్కడ రాయన ప్రభువు కవితా గోష్ఠికి ఆహ్వా నింపగా వచ్చినాము."

"కవితా గోష్టికా?—దుబాసీనయిన నాకు తెలియకుండా పిలి
పించారా? మీ రేదో పొరపాటు పడి వుంటారు, మీ కవిత్వపు ఉబ
లాటములో."

"ఇప్పు డిత డిక్కడ దుబాసీ అన్నమాట. ఆ రెండు నాలుకల
వానికి తగిన ఉద్యోగమే" అనుకొని చిరునవ్వుతో ఇట్లా అన్నాడు: "మా
కిప్పుడు కవితా వ్యవసాయములేదు. అది వదలి హాలికులమై భూమి
వ్యవసాయమే చేస్తున్నాము. అది ప్రభువు వారికి చెప్పుకునే నిమిత్తమే
వచ్చాము!"

"ఓహో, మంచిది. రాయన ప్రభువు వారికి ఆంధ్రభాష రాదు.
రాచ పొలాలలో శిస్తులు, తక్కిన గ్రామములలో రాజభాగాలూ వసూలు
పరుస్తూ రాత్రిం బవళ్ళు పనుల తొందరలో తీరిక లేకుండా మండల
పర్యటనలు సాగిస్తున్నారు. రాత్రి చాలా పొద్దుపోయిగాని తిరిగి రారను
కొంటాను."

నాగయ్య మాటలు శ్రీనాథుడు నమ్మలేదు. దుబాసీ వెంట లేకుండా
రాయనము శిస్తు వసూళ్ళకు వెళ్ళడము అసంగతము. వీరిద్దరి ఊహాలు ఏమై
ఉంటవా అని ఆలోచిస్తూ ఉండగా, ఒక శ్లోకము స్ఫురించి పత్రముమీద
దేవనాగరలిపిలో ఆయన వ్రాసినాడు.

* "అమరావ తీయం నతు వ్యాఘ్ర పల్లికా
ఇహ రా డుమేశః నతు వానరేశ్వరః
ఫణి భూషణాగ్రే కథ మద్య దృశ్యతే
మల నిష్ఠకీటో ఫణినామ మాత్రకః"

* ఇది అమరావతి కాని వ్యాఘ్రపల్లి కాదే! ఇక్కడ రాజు
ఉమేశ్వరుడు కాని వానరేశ్వరుడు కాదే! ఫణిభూషణుని సన్నిధిలో మరి
ఇప్పుడు ఫణినామము ధరించిన—మలములో ఉండే పురుగు ఎట్లా కాన
వస్తున్నా డబ్బా!

ఈ శ్లోక మున్న పత్రము ఎవరి చేతికిచ్చి వెళ్ళుటా అని శ్రీనాథుడు ఆలోచిస్తూ ఉండగానే అక్కడికి రాయన ప్రభుదర్శనార్థము ఉపమండలాధిపతి వచ్చినాడు. ఆయన శ్రీనాథుణ్ణిచూచి నమస్కరించి దివాణములోనికి కొంపోయినాడు. ఆయన విచారించగా నిజముగానే రాయన ప్రభువు ఇంటివద్ద లేడని తెలిసినది. అది దుబాసి జరిపిన తంతు అనిగాని, నాగయ్యకు శ్రీనాథుని మీద పాత విరోధ మున్నదనిగాని ఆయనకు తెలియదు.

రాయన ప్రభువులు ఏదో తొందరపని పడి వెళ్ళి ఉంటారనీ, తాను తెలుసుకొని తన భటుని ద్వారా కబురంపుతానని, బహుశః అవ్యవధానముగా వెళ్ళవలసి వచ్చుటచేత ఇలా జరిగి ఉంటుందనీ, రాయన ప్రభువులు కవితా గోష్ఠి వాంఛించి మళ్ళీ ఆహ్వానిస్తే తప్పక రావలసినదనీ ఆయన శ్రీనాథునికి సద్ది చెప్పినాడు.

అప్పటికే ఇది ద్విభాషి నాగయ్య జరిపిన తతంగమని స్ఫురించి వున్నందున, శ్రీనాథుడు తా నప్పుడే చెప్పిన సంస్కృత చాటువు రాయన ప్రభువులకు చేర్చమని ఉపమండలాధిపతి కందించి పల్లకిలో ఎక్కి బయలు దేరి కృష్ణపాయ నావలో దాటి బొడ్డుపల్లి చేరుకొన్నాడు.

# 10

ఆ మరునాటి ప్రొద్దుటిపూట ఉపమండలాధిపతి భటుడువచ్చి శ్రీనాథ కవికి రాయన ప్రభువుల ఉత్తర మందజేసినాడు. అందులో రాయనను తాను ఆ క్రిందటి రోజున తొందరపనిమీద వెళ్ళవలసి వచ్చి శ్రీనాథునకు పంపిన ఆహ్వానము మరచిపోవుటచేత పొరపాటు జరిగినదనీ, ఈనాడు మూడు జాములవేళ జరిగే గోష్ఠికి తప్పక రావలసినదనీ ఆహ్వానమున్నది.

అది చూచుకొని వెళ్ళుటా, వెళ్ళకుండుటా అని శ్రీనాథుడు కొంత తడవు తటపటాయించినాడు. క్రిందటి రోజున ఉపమండలాధిపతి స్వయ

ముగా చెప్పి ఉన్నాడు గదా, ఆయనకు తన యందు గౌరవాభిమానాలు ఉన్నవి, ఎంత పై యధికారి ఐనా ఉపమండలాధిపతి మాటలు గౌరవింపక తప్పదు గదా, ఇక దుబాసి ఎంత!—ఈ విధంగా ఆలోచించి శ్రీనాథుడు వెళ్ళుటకే నిశ్చయించినాడు.

శ్రీనాథుడు క్రిందటి రోజువలెనే అట్టహాసముగా హంస నౌకలో కృష్ణాపాయదాటి, అందల మెక్కి మూడుజాముల వేళకు రాయనము దివాణము చేరుకొన్నాడు.

మళ్ళీ నిన్నటివలెనే ఈనాడు కూడా గోష్ఠి ప్రయత్నము లేకపోవుట చూడగా, శ్రీనాథున కాశ్చర్యమైనది. మరల దుబాసి నాగయ్యాయే ఎదురై పరిహాస మిశ్రమైన హాసముతో పలుకరించినాడు.

"కవితా వ్యవసాయము చాలించి భూమి వ్యవసాయ మారంభించినా, పాత వ్యవసాయపు వాసనలు వదలలేదు కాబోలు, కవిసార్వభౌముల వారికి! మళ్ళీ దయచేసినా రిటు!"

ఈ తుట్టె పురుగుకు జవాబిచ్చుటా మానుటా అని యోచిస్తూ, సేవకుడెవడైనా ఉంటే తాను వచ్చి వెళ్ళినానని రాయన ప్రభువుకు నివేదించుమని చెప్పదలచి, అటు నిటు చూడగా మరెవరూ కనిపించలేదు. దుబాసితోనే చెప్పుటకు నిశ్చయించినాడు.

"ఇదుగో, రాయన ప్రభువులు గోష్ఠికి ఆహ్వానిస్తూ పంపిన లిఖితము, చూడండి దుబాసీగారూ!" అని చేతిలోనే వుంచుకొని చూపినాడు. నాగయ్య చదువుకొని ఆశ్చర్యము ప్రకటించి, "అయితే ఈ నడివీథిలో ఎందుకు! లోపలికివచ్చి కూర్చుంటారా, ప్రభువులు వచ్చేవరకు?" అంటూ దుమ్ముకొట్టుకొని ఉన్న వాకిటి అరుగు చూపినాడు. శ్రీనాథునికి మండిపోయినది. కాని కొత్త ఊహ ఒకటి స్ఫురించగా, కోపము నిగ్రహించుకొని,

ఆశ్రతులు ఒలికించే చిరునవ్వులు ప్రదర్శిస్తూ, "మేము తొందర పనిమీద వెళ్ళుతున్నాము. కూర్చుండే తీరికలేదు. పూర్వవాసన, మీరన్నట్లు, వదలని మాట నిజమే. రాయసప్రభువులకు మీరు సన్నిహితులు కదా. మీమీద శ్లోక మొకటి వస్తున్నది. పెద్ద ఉద్యోగులకు మీకు మేము కట్నము సమర్పించు కోవద్దా? మీకిది బహూకరించి వెళ్ళుతాము!" అంటూ పత్రముమీద లిఖింప సాగినాడు.

ఆ మాటలువిని, ఇప్పటికి పొగరడగి శ్రీనాథుడు తనను మంచి చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడని నాగయ్య మనస్సులో తృప్తిపడ్డాడు. కవి సార్వభౌములు తనమీద ఏవో స్తుతిపద్యము వ్రాసి బహూకరించబోతున్నా రని పొంగిపోతూ ముఖములో చిరునవ్వులు చిందులాడుతుండగా ఎదురుగా చూస్తూ నిలుచున్నాడు.

శ్రీనాథుడు ఆంధ్ర లిపిలో సంస్కృత శ్లోకము వ్రాసి పూర్తిచేసి పత్రము దుబాసీ నాగయ్యకు బహూకరించి పల్లకి ఎత్తించి బయలుదేరి పోయినాడు.

నాగయ్య చదువుకోగా ఆ శ్లోకమిట్లా ఉన్నది:

* "అహో భాగ్యం ద్విభాషిత్వం
అర్హం నామస్వభావయోః,
ద్విజిహ్వేన త్వయా ప్రాప్తం
సార్థకం సదృశం పదమ్."

నాగయ్యకు సంస్కృతము రాదు. అది తన ఉద్యోగసంబంధమైన అభినందన శ్లోకమని అన్వయించి చదువుకొని మురిసిపోయినాడు. అందులో

---

* నీ పేరుకూ స్వభావానికీ సరిగ్గా తగినట్లుగా, రెండు నాలుకలవాడ వైన నీకు సార్థకముగాను, సరిపోయేటట్లుగానూ ఈ దుబాసీ పదవి ప్రాప్తించినది; ఆహా, ఏమి భాగ్యమయ్యా!

మొదటిపాద మతనికి పూర్తిగా అర్థమైనది. చివరి పాదములో "సార్థకం పదమ్" అనే పదాలవల్ల తన జన్మ సార్థకమైనదని అర్థము చెప్పుకొన్నాడు.

ఇంత చక్కని శ్లోకము తనపైన చెప్పిన కవిసార్వభౌమునికి తాను ముందు కొంత అవమానము చేసినందుకు కొంత పశ్చాత్తాపపడి ఆ రాత్రియే రాయస ప్రభువుతో చెప్పి మరునాడు ఆయన ఇంటి వద్దనే ఉండే నిర్ణయముచేసి గోష్ఠికి రమ్మని శ్రీనాథున కాహ్వానము పంపించినాడు. కాని ఆ వెళ్ళిన భటునికి ఆనాడు శ్రీనాథుని దర్శనమే కాక తిరిగి వచ్చినాడు.

నాగయ్య ఇప్పుడు కవిసార్వభౌముడు తనపైన చెప్పిన సంస్కృత శ్లోకము సంస్కృత భాషరాని పలువురికి వినిపించి వారి మెప్పులు పొందసాగినాడు.

రాయస ప్రభువు తనపైన కవిసార్వభౌముడు చెప్పిన శ్లోకము చదువుకొంటూ, కొంత అర్థమై, కొంతకాక, మరచిపోయిన తన సంస్కృత భాషాజ్ఞానము బయట పెట్టుకొనుటకు ఇష్టములేక, తనలో తానే గుణించుకో సాగినాడు. తన పేరు సరిగా ఫణిభూషణ పాత్రుడై వందున మరింత సంతోషము కలిగినది. కాని దాని క్రిందనే ఉన్న "మలవిష్ఠ కీటః" అనే దానికి ఎక్కడ అన్వయించవలెనో తెలియక తికమకపడసాగినాడు. లోకాను భవము కలవాడైనందు, అర్థమింకొకరిని అడిగినట్లయితే తనకు సంస్కృత ములో కల మిడిమిడిజ్ఞానము బయటపడుననే భయముతో, ఆ శ్లోకము తనలో తానే ఏకాంతముగా, తీరిక చిక్కినప్పుడు, గుణించుకొంటూ అవగాహన చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు.

ద్విభాషి నాగయ్య ఇప్పుడు విద్వద్గోష్ఠి నిజముగానే పెట్టించి శ్రీనాథుని సగౌరవముగా ఆహ్వానించమని రాయసములకు సలహా ఇచ్చినాడు. మొదట శ్రీనాథుని గోష్ఠికని పిలిపించి ఆకస్మికముగా గుత్తబాకీ అడిగి కట్టలేకపోయినా వంకతో బంధించి శిక్షించమని సలహా చెప్పిన దుబాసి,

ఇప్పుడు శ్రీనాథుని సమ్మానించమని సలహా చెప్పడము కొంత ఆశ్చర్యమే కలిగించినది. ఐనా ఈ విషయములో దుబాసి చెప్పినట్లు చేయడానికి ఒప్పు కొన్నందున ఎదురుచెప్పక సమ్మతించినాడు. విద్వద్గోష్ఠికి ముహూర్తము నిశ్చయించి, ఆ చుట్టు ప్రక్కల ఉన్న కవిపండితుల కందరికి సగౌరవముగా ఆహ్వానములు పంపుతూ శ్రీనాథునికి కూడా ఆహ్వాన పత్రిక పంపినాడు.

ఆ గోష్ఠి ఏర్పాటైన రోజుకు క్రిందటి రాత్రి రాయసము భటులు శ్రీనాథుని ఇంటివద్ద పడికాపుండి ఆయనకు రాయసము పంపిన ఆహ్వానము జ్ఞప్తిచేసినారు. తెల్లవారినప్పటి నుంచి మనిషి మీద మనిషి వచ్చి గోష్ఠి సంగతి గుర్తుచేసినారు.

శ్రీనాథు డీ సందర్భములో గోష్ఠికి పోక తప్పలేదు.

# 11

పోతన సకుటుంబముగా శ్రీశైలము వెళ్ళి తిరిగివచ్చే దారిలో, స్వప్న వృత్తాంతమువలె, తాను పూర్వము పదమూడు పదునాలుగేళ్ళ వయస్సువాడై ఉండగా, శ్రీనాథునితో కలసి విద్యానగర విజయయాత్ర చేసిన రోజుల అనుభవాలే స్మరింపసాగినాడు. ఏ మా నాటి శ్రీనాథభట్టు వైభవము! శ్రీదేవి సాక్షాత్తుగా అవతరించిన శ్రీదేవియే. శ్రీదేవి అక్కకు తన సొంత తమ్ముడైన దుగ్గనమీద కంటె తన మీదనే ఎక్కువ వాత్సల్య ముండేది.

శ్రీనాథునకు మాత్రము! ఆయనకు తనమీద బాలకృష్ణునిమీద వలెనే వాత్సల్యమో, భక్తిభావమో తెలియరాకుండా ఉండేవి. అది ఆయనకు తనమీద కల అనుగ్రహము! ఆయన చివరకు రాజుకొండలో ఎంత మంచి ఉపదేశము చేసినాడు!

నాయనా, నీమీది ప్రేమాతిశయముచేత మా బోంట్లము నీ యెదుట

ఎంతో భూషించాము. గర్వించి తల తిరిగి చెడిపోకు. తంత్రీ! చెప్పిన నాలుగైదు మంచి పద్యాలూ తిరిగి తిరిగి చదువుకొని మురిసిపోతూ కూచుంటే, వాటితోనే కవిత పరిసమాప్తి పొందుతుందిరా! మహాభాగవతము వంటి ఉద్గ్రంథము చెప్పదలచిన వారికి చెప్పినదానినే చదువుకొంటూ ఆనందపడే తీరిక ఉండదు—శ్రీ గురువులు ప్రసాదించిన ఇష్టదేవతను హృదయ కుహరంలో పదిలము చేసుకొని వృద్ధిలోకి రా!"

ఆ యాత్రలో దగ్గుబల్లి దుగ్గనతో తనకు కలిగిన మైత్రి-అటువంటి అవ్యాజమైత్రి తాను జన్మలో ఎరగడు. ఎన్నెన్ని జన్మాంతరాల స్నేహాను బంధమో ఒక్కసారి అట్లా ఉద్బుద్ధమై ఆ కొద్ది రోజులలోనూ పొంగి వాకలు కట్టినది. మళ్ళీ ఈ జన్మలో మరపు రాకుండా నిలిచినది. తమ నివాసస్థలాలు దూరమైనా ఆ మైత్రి బంధము దూరము కాలేదు.

ఇక ఆ నారప్ప! శ్రీ విద్యానగరము విడిచిన తర్వాత మళ్ళీ తానతనిని కలియలేదు. కొద్దిరోజుల పరిచయమే ఐనా తమ కిద్దరికీ చిత్రమైన ఆత్మీయత కలిగినది. అత డప్పటికే వ్యాస భారతము కన్నడీకరింపవలెనని ప్రయత్నాలు చేస్తున్నాడు. తానూ అప్పటికి వ్యాస భాగవతము ఆంధ్రీకరింప వలెనని కలలు కంటున్నాడు. అతడు భామినీ షట్పదిలో వ్రాయవలెనని సంకల్పించినాడు. తాను చంపూ కావ్యముగా వ్రాయదలచినాడు. అతనూ తానూ ఒక్క చాపులో నుంచి ఉత్తరించిన రెండు చీనాంశుకాల వలెను, ఒక్క తేనె తొట్టెలోనుంచి తీసిన రెండు మధు భాండాలవలెను, ఒక్క గోవు పొదుగులోనుంచి పిండిన రెండు అమృతకలశాల వలెను, ఒక్క మేఘమే రెండు దూరదేశాలలో చిందించిన రెండు వర్షబిందువుల వలెను, తన ఊహలో భావిస్తూ ఉండేవాడు. వ్యాసుని భారతమూ భాగవతమూ సరిగ్గా అటువంటివే గదా! కర్ణాటకదేశమునుంచి వచ్చిన పండితులను, కవులను కలసినప్పుడు తాను నారప్పనుగూర్చి ఎన్నోసార్లు విచారించి

నాడు. వాళ్ళు, "ఎన్న నారణప్ప!—నారణప్ప!—అతను సాక్షాన్నారాయ ణుడు, అవతార పురుషుడు, కుమారవ్యాసుడు!" అని ఎంతో భక్తితాత్పర్యా లతో ఉగ్గడించేవారు. ఈ మధ్య తాను శ్రీశైలము వెళ్ళినప్పుడు కలసిన కర్ణాట భక్తు లంతా ఆయన మహత్త్వమే వేయినోళ్ళతో శ్లాఘించారు. గదు గలో వెలసిన వీరనారాయణస్వామికి అంకితముగా వ్యాస మహాభారతము కన్నడీకరించి కన్నడులకు అమృతమే పంచుతున్నాడని చెప్పినారు. రత్న త్రయములోని పంపమహాకవి వ్రాసిన జైనభారతము కంటె, ఇప్పుడు కర్ణాట కులు నారణప్ప వ్రాస్తున్న గదుగిన భారతమునే ఎక్కువ అభిమానిస్తున్నా రట. పండితు లేమి, పామరు లేమి - స్త్రీలు, బాలురు కూడా కుమార వ్యాసుని షట్పది పాటలే పాడుతున్నారట. కన్నడ భాషకే అది నాయక మణిగా వెలసిన దన్నారు. ఆ విధంగా నారణప్ప కృతార్థుడైనాడు. తాను భాగవత రచన చేయవలెనని కన్న కలలు కలలుగానే ఉండిపోయినవి. తానెప్పటికైనా భాగవతము ఆంధ్రీకరించగలడా? నారణప్ప తన భారతము వీరనారాయణునికి అంకితము చేసినాడు. తాను భాగవతము ఎవరి కంకిత మీయవలె? కులదైవమైన మహేశ్వరునికా, తన యిష్టదైవమైన గోపాల కృష్ణునకా?

అంతలో తనకు గోపాల సుందరీ మంత్రము ఉపదేశించిన శ్రీశృంగేరీ విరూపాక్ష భారతీస్వామివారు స్మరణకు వచ్చారు. వారికి తన పైన కలిగిన అకారణానుగ్రహము తాను ఎన్ని జన్మలలోచేసిన పుణ్యాతి శయముచేత సిద్ధించినదో! నిత్యమూ వారి పాదుకా స్మరణ చేస్తూ వా రుప దేశించిన మహామంత్రము తాను జపిస్తున్నాడు. మహేశ్వర ధ్యానము చేస్తున్నా, మరే దేవతాధ్యానము చేస్తున్నా, తన హృదయములో బాల గోపాల కృష్ణుని మురళీ వినాదమే వినిపిస్తుంది.

విద్యానగర యాత్రలో శ్రీనాథుని వెంట వచ్చి ఆయన కెంతో

సహకరించిన ఆప్త విద్వద్వరేణ్యులు నృసింహభట్టు, సుబ్రహ్మణ్యశ్రౌతి, గురులింగము, లక్కనసూరి, ఆ సుక్కోపి మీమాంసకుడు పేరిశాస్త్రి—ఎంద రెందరో తలపులోకి వత్తురు. ఆ యాత్రలో తాను చూచిన విద్యా వైభవము మళ్ళీ చూడలేదు.

శ్రీనాథులు శతావధాన సమయములో చమత్కారముగా తన వామనావతార పద్యము వినిపింపగా, ఆ పద్యము తనదని తెలిసిన మీదట దేవరాయ ప్రభువు తనకు బంగారు పొదిగిన స్ఫటికాక్షమాల బహూకరించినారు. తాను భక్తితో సభవారికి మ్రొక్కగా సభ్యులు "నీ కవితాతిశయము కూడా త్రివిక్రమావతారమువలెనే వర్ధిల్లునుగాక !" అని ఆశీర్వదించినారు, కాని యింతవరకు వారి ఆశీర్వచనము ఫలించలేదు. ఈ జన్మకు ఫలించునా?

తాను శ్రీనాథభట్టు ఉపదేశించిన ప్రకారము సంస్కృత భాషలో ప్రసిద్ధ కవుల కావ్యనాటకాలు పఠించినాడు. సంస్కృత వ్యాకరణము కాశికా వృత్తితో కొంత నేర్చినాడు. ఆంధ్ర భాషలో ఉద్గ్రంథాలతోపాటు ఆంధ్ర శబ్ద చింతామణి, అథర్వణకారికావళి, ఆంధ్ర భాషాభూషణము, కవిజనాశ్రయము, అథర్వణ చ్ఛందస్సువంటి ఛందోవ్యాకరణ గ్రంథాలు కూడా పఠించినాడు. వ్యాస భాగవతము శ్రీధరస్వామి వ్యాఖ్యతో కూడా అధ్యయనము చేసినాడు. ఈ విధంగా కొంత వ్యుత్పత్తి సంపాదించినాడు. కాని తనకు శ్రీనాథభట్టు వాత్సల్యముతో పిలిచే సహజ పాండిత్య బిరుదయే అభిమాన పాత్రంగా ఉన్నది.

శ్రీనాథుని మొదటి ధర్మపత్ని శ్రీదేవిని తలచుకొన్నప్పుడు తాను ప్రత్యక్షముగా చూచిన పరదేవతావతారమే అనిపిస్తుంది. ఆమె ఎప్పుడో అవతారము చాలించినది. ఆయన ద్వితీయ భార్య భూదేవి కూడా తన్ను తమ్మునివలెనే ఆదరించినది. అయితే యేమి? ఈమె మానవకాంత, శ్రీదేవి

వలె దివ్యకాంతకాదు! ఈమె శ్రీనాథకవి ఊహలను భూమికి బంధిస్తున్నది, పాపము!

భాగవత రచన విషయములో అడుగడుగునా, తనకెన్నో సందేహాలు కలుగుతున్నవి. కవి సార్వభౌములతో సంప్రదిస్తే అవి తీరి, తాను రచన సాగించగలడేమో! శ్రీశైలము తన కుటుంబముతో వెళ్ళినందున అక్కడ ఎక్కువ కాలముండి సంప్రదించే అవకాశము లేకపోయినది. ఇప్పుడు తప్పక బొడ్డుపల్లి వెళ్ళి కొంతకాలము ఆయన సన్నిధానములో గడపవలె!

ఈ ఆలోచనచేస్తూ, రేపు ఉదయము బమ్మెర చేరుకొంటామను కొంటూ ఉండగా వాళ్ళు చేసిన మజిలీలో పోతన నిద్రపట్టక ఆలోచిస్తూ ఉన్నాడు. అకస్మాత్తుగా తాను శ్రీశైలము విడిచి వచ్చిన రోజుననే కృష్ణ పొంగిన సంగతి జ్ఞాపకము వచ్చినది. ఆ తర్వాత తన ప్రయాణములో అకాలముగా వరదలు వచ్చి ఈ సంవత్సరము కృష్ణ లంకలలో పైరులన్నీ నాశనమైపోయినవన్న వార్తలు విన్నది జ్ఞప్తికి వచ్చినవి. శ్రీనాథభట్టు తన వ్యవసాయము సంగతి ఉత్సాహముతో ప్రస్తావిస్తూ వుండగా తన నోటికి "దైవికమైన చిక్కులు ఎన్నయినా, వరదా వంగుడూ ఉండవచ్చు గదా!" అని అమంగళ వాక్కు వచ్చినది. అయ్యో, వరద రానే వచ్చినది. శ్రీనాథ కవి పైరులన్నీ పాడయిపోతే, గుత్త బాకీ ఎట్లా తీర్చగలడు ? ఆయన వద్ద ప్రస్తుతము ధనము లేక అంతర్బాధ పడుతున్నట్లు స్పష్టముగా కనబడు తున్నది. అయ్యో ! ఆయనకు వెయ్యి టంకాలు అవసరమయితే యియ్య డానికి తీసుకొనివెళ్ళి వారిని దర్శించవలె !— ఈ విధమయిన నిశ్చయానికి వచ్చినాడు.

ఈ ఆలోచన మాత్రము వెంటనే సాగలేదు. బమ్మెర చేరుకోగానే విఘ్నము వచ్చినది. ఇల్లు చేరుకొనేప్పటికే తండ్రి కేసన్న జబ్బుగా

ఉన్నాడు. లేవలేకున్నాడు. తల, ఒళ్లూ యెప్పుడూ తిరుగుతున్నట్లు ఉంటుం దట. పక్కమీద ఇటునుంచి అటు ఒత్తిగిల్లినా, ఒళ్ళంతా సుడ్డు తిరిగిన ట్లవుతుంది. వైద్యాలేమీ పనిచేయలేదు. పోతన కోరిక కోరికగానే వుండి పోయినది.

వారము రోజులకు తండ్రి బాధ తగ్గడ మారంభించినది. పదవ రోజుకు తగ్గిపోయినది. అప్పుడు తాను బొడ్డుపల్లి వెళ్ళదలచిన విషయము, విశేషాలు ముందు పోతన తల్లి లక్కాంబకు చెప్పినాడు. ఆమెకు పోతన ముద్దు కుమారుడు. విద్యానగర యాత్రచేసి వచ్చినప్పటినుంచి అతడు ఎన్ని సారులో శ్రీనాథుని మహత్త్వము యెన్నెన్ని విధాలుగానో ప్రస్తావించి ఉన్నాడు. దానితో ఆమెకు కలిగిన గౌరవ భావము ఆయనను స్వయముగా శ్రీశైలములో దర్శించిన తర్వాత దృఢమైనది. శివుని అవతారావతారమైన శ్రీనాథభట్టుకు ఆపద వచ్చినదేమో అని ఊహ కలిగేటప్పటికే ఆమెకు ఆదుర్దా కలిగినది.

"నాయనా, మీ నాన్నకు నాలుగైదు రోజులు ఇట్లాగే తేలికగా ఉంటే చూచుకొని, మీ నాన్నకూ అన్నకూ చెప్పి, కావలసిన డబ్బు అడిగి తీసుకొని పో!"

మాతృవాక్యము మన్నించి ఐదు రోజులు చూచినాడు. తండ్రికి బాగా నయముగా ఉన్నది. ఇంట్లోనే కాక కొంచెము ఊళ్లోకూడా తిరుగుతూ శివాలయమువరకూ వెళ్ళగలుగుతున్నాడు. అప్పుడు తాను బొడ్డుపల్లి వెళ్ళ దలచిన విశేషాలు తండ్రితో—అన్న దగ్గర ఉండగానే, ప్రస్తావించినాడు. అందరికీ పోతన అంటే గారాబమే! వాళ్ళు వెనుకాడకుండా అనుజ్ఞ ఇచ్చి నారు. తిప్పన ఇచ్చిన వెయ్యి టంకాలు తీసుకొని పోతన్న మంచిరోజున ప్రయాణమైనాడు. తండ్రికి ఎట్లా ఉంటుందో అనే మనస్సు కొంచెము వెన కాడుతున్నది. అంతే కాని శ్రీనాథ కవి సార్వభౌముని దర్శన భాగ్యమూ

సాహచర్య భాగ్యముతోపాటు, ఆయనకు ఏమైనా ధనలోపముంటే అది తీర్చి తోడుపడగలననే సంతోషముతో ఉత్సాహము ఇనుమడిస్తూ వుండగా, పోతన ప్రయాణము సాగించినాడు. తనకుతోడుగా దృఢకాయుడైన రామన్న అనే పాలేరును మాత్రము వెంట తీసుకొని వెళ్ళినాడు.

# 12

రాయన ప్రభువు అమరావతిలో తన విడిదిలో ఏర్పాటు చేసిన గోష్ఠికి శ్రీనాథభట్టు సంపూర్ణముగా తన కవి సార్వభౌమ వేషముతోనే బయలుదేరినాడు. బంగారు కమ్ముల చీనాంబ కోత్తరీయాలు ధరించి, పైన కప్పుకొనేందుకు, సరిగంచులతో లతలు పూలు పంక్తులుగా అల్లిక పనితనము కల అకుపచ్చని కాశ్మీర శాలువ-తనకు పూర్వము విద్యానగరములో దేవరాయలు బహూకరించినది-కావడి పెట్టెలోనుంచి పైకి తీసినాడు. ఆ శాలువ బంగారపు రేకులలో పొదిగిన గరుడ పచ్చలతె ధగధగ లాడుతున్నది. అది ధరించి బహుకాలమైనది. ! అది ఇప్పుడు విప్పిచూడగా, చిమ్మటలు అక్కడక్కడ పోట్లు పొడిచినట్లు కనిపించినది. క్షణమాలోచించి మడత పెట్టించి మడతగానే ఎడమ భుజముమీద వేసుకొన్నాడు. ఫాలాదిగా పంచావయవములలో పంచ బ్రహ్మ మంత్రాలతో తీర్చిన విభూతి రేఖలు ఆయనకు ఒక వింత సోయగము సమకూర్చి సుందరేశ్వరుని దివ్యరూపము అవహింపజేసినది. నొసట గుండ్రముగా తీర్చిన కుంకుమ బొట్టు జ్ఞాననేత్రమువలెనే వెలుగుతున్నది. మెడలో ధరించిన రుద్రాక్షలున్న హారము భుజముమీద ధవళ యజ్ఞోపవీతాలతో ఒరుసుకుంటూ ఉంటే, పార్వతీ పరమేశ్వరులు ఆయన హృదయ పీఠముమీద లీలాపరిరంభ విహారము చేస్తున్నట్లు కనబడుతున్నది. తన భూషణాలేమైనా శేషించి ఉన్నవేమో అనే ఆశాలేశముతో దంతపు భరణి తెరిచి చూడగా, అది ఆకాశమువలెనే శూన్యంగా ఉన్నది

విట్టూర్చు పుచ్చి తన కుడిచేతిలో దర్భ ముడిపెట్టే వేలికి ఉన్న మాణిక్యాంగుళీయకము చూచుకొని, దానితోనే తృప్తిపడి బయలుదేరుతూ దేవతాగారములో పీఠస్తుడై ఉన్న మహేశ్వరునకు నమస్కారము చేసి సెలవు తీసికొనడానికి లోపలికి వెళ్ళినాడు.

శ్రీనాథుడు వంగి పంచాయతన నిష్ఠుడై ఉన్న స్వామికి నమస్కరించి "శివోహం శివోహం శివోహం" అనుకొంటూ దేవమందిరము వదలి వచ్చినదే తడవుగా, భూదేవి దిగులుతో ఎదురు వచ్చి రెండు బాహువులు మెడలోవేసి సభకు వెళ్ళవద్దని పరిపరివిధాల వేడుకొన్నది. శ్రీనాథుడు చిరునవ్వుతో ఆమె బాహువులు మృదువుగా తొలగించి ఆమె నొసటిమీద చుంబనము చేయగా, ఆమె ముఖము సిగ్గుతో ఎఱ్ఱవారినది. ఆమె ఊరకొనక ఆర్తితో ఈమాటు తన రెండు చేతులతో అయన రెండు చేతులూ గట్టిగా చుట్టిపట్టుకొని, ఇంటివద్దనే ఉండుడని బ్రతిమాలుకొన్నది. శ్రీనాథు డామె కరపద్మములు సుకుమారముగా గ్రహించి కండ్ల కద్దుకొని ముద్దులతో ముంచి భయపడవద్దని ధైర్యము చెప్పినాడు. భర్త తన మాట విననందున ఆమెకు ఆరాట మెక్కువై రెండు పాదాలూ బాహువులతో బంధించి వెక్కివెక్కి ఏడుస్తూ, "స్వామీ, రాత్రి కలలో పెద్ద నాగ మొకటి మిమ్ములను మెడకూ పాదాలకూ, కాళ్ళకూ చేతులకూ సంకెళ్ళు వేసినట్లు చుట్టవేసి బంధించినట్లు పొడుకల వచినది. ఈ సభకు మీరు వెళ్ళవద్దు, వద్దు, వద్దు!" అంటూ భోరున ఏడువసాగినది. తన పాద బంధము విడిపించుకోడానికి శ్రీనాథుడు వంగగా ఆమె ఒక బాహువుతో పాద బంధము వదలకే రెండవ బాహువుతో మెడకు కూడా బంధము వేసినది. ఏడుపు మానలేదు.

ఇది చూడగా శ్రీనాథునికి అద్భుత మనిపించినది. భూదేవికి స్వార్థ పర్వత మేగాని తన మీద గాఢ ప్రేమలేదని భావించేవాడు. ఇప్పుడు చూడగా

ఆమెకు స్వార్థపు తెరచాటున హృదయములో తన మీద ఎంతో ప్రేమ అణగి ఉన్నట్లు స్పష్టమైనది. ఆ భావనతో ఆయన దేహ మంతా పులకరించినది. ఆత డామెను ప్రేమావేశముతో తన దృఢపీ్ఠ బాహువులతో గాఢముగా ఆలింగనము చేసుకొని చెక్కిళ్ళ మీదను, అధరము మీదను చుంబన ముద్రలు ముద్రించినాడు. ఆమెను వివాహ మాడిన దాదిగా ఆమె స్పర్శవలన ఎన్నడూ కలిగియుండని ఆనంద మానాడు అనుభవించినాడు. ఆ సుఖానుభూతితో ఆమెను ఓదారుస్తూ ఇట్లా అన్నాడు:

"బేల వై వృథాగా భయపడకు! నీ దుఃస్వప్నానికి పరిహారము ఇప్పుడే నీ చేతులతోనే చేసినావు. నీ బాహువులతో నా మెడకు ముందు నాకు బంధము వేసినావు. తర్వాత చేతులతో చేతులకు సంకెళ్ళు వేసినావు. తర్వాత పాదాలకు నిగళ యుగళము నీ బాహుద్వయముతో వేసినావు. చివరకు నేను విన్ను లేవదీయడానికి వంగినప్పుడు నీ బాహువులతో నా కాళ్ళూ, కంఠమూ బంధించివేసి పొగడవండకూడా కల్పించినావు. భయపడ బోకు లే!"

ఈ కవితా చమత్కృతితో ఆమె తేరుకొనలేదు. మరొక విధముగా ఓదార్చ సాగినాడు.

"దిగులు పడబోకు! వెనక వచ్చిన దుఃఖ స్వప్నాలకు ఎంతో శాంతి చేసినాను. శివాజ్ఞ లేనిది చీమ ఐనా కుట్టదు. స్వామి తలచుకుంటే మనసు కదలినా, ఇంట్లోనే ఉన్నా, ఆయన ఇచ్ఛకు తిరుగులేదు. నా హృదయములో నాగభూషణులైన పార్వతీ పరమేశ్వరులున్నారు. నా పేరులో సర్వనాగ శాసకుడయిన గరుడుడు వాహనమయిన శ్రీయుక్తుడైన శ్రీనాథుడున్నాడు. నా వాక్కులో వాణీ సమేతుడయిన పితామహుడున్నాడు. నీవు కూడా సర్వాపన్నివారకుడు, సర్వవిషాపహారకుడు, జ్ఞానప్రదాత ఐన సదాశివుణ్ణి ధ్యానము చేస్తూ నిర్భయంగా, సుఖంగా ఉండు. వెళ్ళి వస్తాను!"

ఈ విధంగా ఆమెకు ధైర్యము చెప్పి తన అమృత హస్తాలతో ఆమె ఒడలంతా మృదువుగా నిమిరి శాంతింపజేసి బయలుదేరినాడు. ఆమె కూడా శివధ్యానముతో తన్మయత్వము పొంది నిలిచినది.

శ్రీనాథుడంతట ముంగిటిలోనికి రాగానే కార్యకర్త ఎదురై నమస్కరించి రహస్యంగా ఇట్లా విన్నపము చేసినాడు.

"ప్రభూ, మన ఊరి కరణము ఈ మధ్య రాయని ప్రభువు పిలిపించగా దర్శించబోయిన నాటిగా ఆయన గ్రామములో కనబడలేదు. శంకతో మనస్సు పరిపరివిధాలపోయినది. కారణ మేమా అని నేను తరచి అచూకీలు తీయగా, నమ్మకముగా తెలిసిన సంగతి ఇది. రాయని ప్రభువు కరణమును పిలిపించి మన పన్ను బాకీని గురించి ప్రస్తావించగా, కరణము అది చెల్లించడానికి మహాశివరాత్రి దాకా గడువున్నదనీ, ఈ మధ్య చెల్లించమని ఒత్తిడి చేయడము రాచపాడి కాదనీ గట్టిగా మనవి చేసినాడట. దాని మీద ఆయన క్రోధోగ్రుడై కరణమును కారాగారములో పెట్టించి నానా హింసలు పెట్టుతున్నాడట. ఇటువంటి రాయనప్రభువుకు తమరు శివరాత్రి వరకు కనపడక పోవుటే శ్రేయస్కరమేమో ఆలోచించండి!"

శ్రీనాథుడు క్షణ మాత్ర మాలోచించి అన్నాడు: "కరణము అవస్థ నాకు ముందే తెలిసినది. నా కోసమై బాధపడుతున్న కరణమును ఆపదనుంచి గట్టెక్కించవలెననే, ఓర్పుతో ఇంతవరకు శాంతముగా ప్రవర్తిస్తున్నాను. నీవు చెప్పిన ప్రమాదము లేకపోలేదు. మనకోసము ఆపదలో చిక్కుకొన్న మన ఆప్తులను విడనాడి ఆత్మరక్షణకై నా కుటుంబముతో నన్ను పారిపొమ్మందువా? శివేచ్ఛ ఉంటే స్వామికి అందరాని తా వున్నదా?—ఈ గోష్ఠితో రాయప్రభువును మనకుఅనుకూలుణ్ణిగా చేసుకోడానికి యత్నిస్తాను. అక్కడ ఉన్న పాము తల ముందు అణగ దొక్కవలె!"

"ప్రభూ, ఎటుపోయి యెటు వస్తుందో అని 700 టంకాలు నమ

కూర్చవలెననే ఆతురతతో మన ఎడ్లజతలను ఆరింటిని కొంత నష్టానికే అమ్మినాను. కాని వాళ్ళు శివరాత్రి దాకా కాసు చెల్లించలేమని మొండికివేసినారు. కాదు కూడదంటే, ఎడ్లను తిరిగి ఇస్తామంటున్నారు—నాకేమీ తోచకుండా ఉన్నది, ప్రభూ!"

"నాయనా, మనుష్య ప్రయత్నమంతా - నీవు చేయగలిగినది చేసినావు. ఇప్పు డిక దైవముమీదనే భారమువేసి వ్యవహరింతాము. చింతించబోకు!"

కార్యకర్త సెలవు తీసుకొని పోగా, కుమారుడు శ్రీనాథుని కెదురై, తా నెన్నడూ చూడని ఆ ఉజ్జ్వల వేషము చూచి ముగ్ధుడై నిలవబడినాడు. శ్రీనాథుడతని నెత్తుకొని ముద్దాడినాడు. కుమారుడు ఆ శాలువ మెత్తదనమూ, దానిమీద బంగారు పోగులతో అల్లిన లతాదుల సౌందర్య వైభవమూ చేతులతో తడవి చూస్తూ, కొంతసేపు శ్రీనాథుని మెడ ప్రేమాతిశయముతో కావిలించుకొని, చంకనుండి నెమ్మదిగా దిగి ఆప్యాయతతో తాత చేయి పట్టుకొని నావవరకూ తోడు నడచి, నావనెక్కించి మళ్ళీ ముద్దుయిడి పెట్టించుకొని వెనుదిరిగినాడు. శ్రీనాథునకు ఆనందబాష్ప బిందువులతో కన్నులు నిండినవి.

అపశకున పరంపర తర్వాత ఈ శుభశకునానికి శ్రీనాథకవి ఆనందిస్తూ ఉండగా నావ బయలుదేరినది. అప్పుడు ఆకాశవీథిలో దివ్యగరుడ విహంగము 'కృష్ణా' అని అరుస్తూ దర్శన మిచ్చినది. శ్రీనాథుడు శ్రీకృష్ణ నామోచ్చారణము చేసి నమస్కరించి దివ్యవిహంగ దర్శనమునే హృదయములో ధ్యానిస్తూ, ఏరుదాటి, అక్కడ సిద్ధముగా ఉన్న పల్లకి ఎక్కినాడు. పల్లకి ముందు వెనకల రజత దండధారులై చిత్రవస్త్రాలు ధరించిన భటులిద్దరు కొలిచి సాగుతుండగా రాజవైభవముతో వెళ్ళి శ్రీనాథుడు, రాయసము దివాణము వాకిట పల్లకి దింపించినాడు.

# 13

ఈనాడు, చిత్రముగా, దుబాసీ నాగయ్యయే ఇద్దరు భటులతో శ్రీనాథునికి ఎదురు వచ్చి వంగి నమస్కారముచేసి, దారి చూపుతూ ముందు నడచి రాయన ప్రభువు సన్నిధికి కొంపోయినాడు. అప్పటికే అక్కడ సమావిష్టులైన కవి పండితాగ్రేసరులలో పలువురు శ్రీనాథుని పేరు ప్రతిష్ఠలు ఎరిగి ఉన్నవారే — వారితోపాటు తెలియనివారు కూడా ఆయన వేషముచేత ఆకృష్టులై లేచి నమస్కరించినారు. రాయనప్రభువు కూడా అప్రయత్నముగా లేచి చేతులు జోడించి నమస్కరిస్తూ ఉండగా, దుబాసి "ప్రభూ ! వీరు శ్రీనాథకవి సార్వభౌములు ! సర్వజ్ఞ సార్వభౌములైన పెదకోమటి వేమారెడ్డిగారి విద్యాధికారులు. శ్రీవిద్యానగర దేవరాయల సభలో కనకాభిషేక పురస్సరముగా కవి సార్వభౌమ పట్ట మందినవారు. సర్వజ్ఞసింగ మహీపాలురవద్ద అర్ధసింహాసన గౌరవ మందినవారు. రాయవేశ్యా భుజంగవేమ భూపాల సోదర వీరభద్రారెడ్డిగారి విద్వాంసులు !—బహు శాస్త్రవేత్తలు, బహు కావ్యకర్తలు—రాయన ప్రభూ, తమ దర్శనార్థము వేచి ఉన్నారు" అంటూ పరిచయము చేసినాడు. రాయనప్రభువు 'ధన్యోస్మి' అంటూ సగౌరవముగా, ఉన్నతాసనము చూపెట్టి కూర్చుండబెట్టినాడు.

ఆనాటి గోష్ఠి ఆ సందర్భాన్నిబట్టి ఎంత వైభవముగా జరుగగలదో, అంత వైభవముగాను ప్రారంభమైనది. రాయన ప్రభువు, ఒడ్డె ప్రభువు అప్పటికి ఓఢ్రభాషలో ఉద్గ్రంథాలు పుట్టలేదు. ఎక్కువ భాగము ప్రాకృతులు అప్పుడప్పుడు కవితా వేశముతో చెప్పే గీతికల కంటె సారస్వతరాశి పుట్టలేదు. ఆంధ్ర భాషలో కావ్యాలనగానే రాయనమునకు వింతగా ఉన్నది. సారస్వతమంటే ఆయన దృష్టిలో సంస్కృత ప్రాకృత కావ్యాలే.

రాయసము బాల్య యౌవనములలో సంస్కృత కావ్య నాటకాలు కొన్ని గురుముఖతః చదివి ఉన్నాడే కాని, నిర్దుష్టమైన పాండిత్యము లేదు. సంస్కృతములో సంభాషింపలేడు. కాని సామాన్యభాష అర్థము చేసుకో గలడు. ఏ మాత్రము క్లిష్టముగా ఉన్నా సంస్కృత శ్లోకార్థము తెలియదు. ఆయన పురోహితుడు సంస్కృత విద్వాంసుడే కాని ఆయనకు ఓఢ్రమే కాని ఆంధ్రభాష రాదు. సంస్కృతము రానట్టి ఓఢ్రాంధ్రములు మాత్రమే మాట్లాడగలిగిన దుబాసి నాగయ్య ద్వారానే వ్యవహార మెక్కువపాలు జరగవలసి వచ్చినది. కొలది సేపటిలోనే పురోహితునికి సంస్కృతములో మంచి పాండిత్య మున్నదని గ్రహించి, శ్రీనాథుడు సంస్కృత భాషలోనే సంభాషణ ఆరంభించి అవసరమైన స్థలాలలో పురోహితుని చేత రాయసము నకు ఓఢ్రములో అనువదించేట్లు చేసినాడు.

రాయన పురోహితుడు గోష్ఠి జయదేవుని గీతగోవిందములోని శుభాకాంక్షతో ప్రారంభించినాడు:

"సాంద్రానంద పురందాది దివిషద్బృందై రమందాదరాత్
ఆనమ్రైర్మకుటేంద్ర నీలమణిభి స్సందర్శితేందిందిరమ్
స్వచ్ఛందం మకరందసుందరమిళన్మందాకినీ మేదురం
శ్రీ గోవింద పదారవింద మశుభస్కందాయ వందామహే"

శ్రీనాథుడు వెంటనే శ్రీమహాగణాధిపతిని, సరస్వతిని వర్ణించే వేదమంత్రాలు అందుకోగా పురోహితుడూ అక్కడి ఆంధ్రకవి పండితులూ కలిపి చెప్పినారు.

వేదమంత్రాలతో ధ్యానమైన తర్వాత శ్రీనాథభట్టు శ్రీకృష్ణ కర్ణామృతములో నుంచి ఈ గోపాల స్తోత్రము వినిపించినాడు:

"బృందావనద్రుమతలేషు గవాం గణేషు
వేదావసానసమయేషు చ దృశ్యతే యత్
తద్వేణునాదనపరం శిఖిపింఛచూడమ్
బ్రహ్మ స్మరామి కమలేక్షణ మభ్రనీలమ్."

రాయసపురోహితుడు ఆ శ్లోక మాధుర్యానికి, అర్థోదాత్తతకూ ఆనందించి, ఇది రచించిన కవి ఎవరని అడిగినాడు. "ఇది మా ఆంధ్ర కవి లీలాశుకుడు రచించిన" దని శ్రీనాథుడు చెప్పగా పురోహితుడు వేడుక పడి ఎన్నో శ్రీకృష్ణకర్ణామృత శ్లోకాలు వినిపించుకొన్నాడు.

పురోహితుడు మధ్యమధ్య గీతగోవింద శ్లోకాలు అందుకుంటూ ఉండగా, శ్రీనాథుడు గీతగోవిందములోని శ్లోకాలే కాక అష్టపదులు కూడా కొన్ని గానముచేసి వినిపించినాడు. గోష్ఠికి వచ్చిన తక్కిన కవులుకూడా తాము రచించినవీ, ప్రసిద్ధ కవులవీ గోవింద స్తోత్రాలు వినిపించినారు.

ఈ విధంగా గోష్ఠి సంస్కృత శ్లోకాలతో సాగిపోతూ ఉండగా, దుబాసి నాగయ్యకు వనిపట్టలేదు. తనతో అవసరము సదస్యులకు కలిగించ వలెననే ఉద్దేశముతో, ఆంధ్రపద్యాలు చదివి ఆంధ్రకవితా మాధుర్యము రాయసప్రభువులకు చదివి చూపించవలని నాగయ్య సభ్యులకు సూచన చేసి నాడు. వెంటనే శ్రీనాథకవి సార్వభౌము డీ పద్యము చదివినాడు.

"హాళిం గోహళి సంఘటించిన క్రియన్ మధ్యాహ్నవేళ న్మహా
కాళం బైన నభోవిభాగమున వీకం గాసె బీరెండ యా
ప్రాలేయాహత సంప్రవిష్ట కిరణ ప్రకీడ దర్కోపల
జ్వాలాజాలజటాల జాంగలతటీ వాచాలకోయష్టియై"

ఆ పద్యము అర్థము కాక దుబాసి కళ్ళప్పగించి చూస్తూ ఉండగా పురోహితు డతని అవస్థ గమనించి "ఇది చాలాభాగము మురారిభట్టు శ్లోకమే" అని, సంస్కృతభాగానికి ఓఢ్రములో అర్థము చెప్పినాడు. తక్కిన దానికి శ్రీనాథుడు సరళ సంస్కృతములో అర్థము వివరించినాడు.

అంతట దుబాసి తక్కిన ఆంధ్రకవులకు అవకాశమీయమని అర్థింపగా, శ్రీనాథుడు మౌనము వహించి తక్కినవారి పద్యాలు, దుబాసీ నాగయ్య చేస్తున్న ఓఢ్రానువాదాలూ శ్రద్ధగా వింటూ ఉన్నాడు. రెండు మూడు గడియలు గడవగానే—ఓఢ్రభాష సంస్కృతప్రాకృతాలకు చాలా

సన్నిహితమైనది కనుక—ఓఢ్రభాషను స్థూలముగా శ్రీనాథుడు అర్థము చేసుకోగలిగినాడు. అంతే కాదు. నాగయ్య భాషాంతరీకరణలో చేస్తున్న తప్పులు కూడా సంస్కృతములో చెప్పి పురోహితుని చేత సరిచేయించ సాగినాడు. కవిత్వ సూక్ష్మాలు తెలియని దుబాసి పొరపాట్లకు రాయసముతో పాటు సదస్యులు కూడా నవ్వసాగినారు. ఈ పరిస్థితి దుబాసి నాగయ్యకు క్షణ క్షణము దుర్భరము కాసాగినది. ఇట్లా నాలుగైదు పర్యాయాలు శ్రీనాథుడు కలసికొంటే, రాయస ప్రభువుకు ప్రజలు చెప్పుకొనే మొరలు, విపరీతార్థము రాకుండా భాషాంతరీకరణము చేసినందుకు తాను సంపాదిస్తున్న బహుమతు లన్నీ కట్టుపడి పోతవని గ్రహించినాడు నాగయ్య.

అందువల్ల తాను తలపెట్టిన కార్యానికి నాగయ్య ఆకస్మికంగా ఉపక్రమించినాడు. దానికి ప్రాతిపదికగా ముందు పురోహితునికి "తమకు దేవతార్చన సమయమైనది" అని జ్ఞప్తిచేసి పంపించినాడు. వెంటనే శ్రీనాథుడు, తక్కిన కవిపండితులు తాముకూడా మాధ్యాహ్నిక క్రియలకు బయలుదేరుతామని లేవబోయినారు. దుబాసి ప్రత్యేకముగా శ్రీనాథునివంక తిరిగి, "అయ్యో, తమకు చేయవలసిన మర్యాద పూర్తిగా జరగకుండానే వెళ్ళుతామని తొందరపడతారేమి? కొంచెము ఆగండి!" అని ఎంతో వంగి వంగి చెప్పుతూ రాయసము వంక చిత్రమైన చూపు ప్రసరింప జేసినాడు.

అప్పటికే పళ్ళెములతో తాంబూలాలు సిద్ధము అవుతున్నందున తక్కిన సదస్యులు ఆ మాటల అర్థము సామాన్యంగానే గ్రహించినారు. శ్రీనాథునికి మాత్రము ఆ మాటలలో స్పష్టముగా నాగయ్య దురుద్దేశము స్ఫురించినది. ఆయన హృదయములో మహేశ్వర ధ్యానము చేస్తూ, "శివోహమ్" భావనతో ఆత్మనిష్ఠుడై ఉండి దేనినైనా నిర్భయంగా ఎదుర్కోటానికి సిద్ధమౌతున్నాడు.

ఇంతలో భటు డొకడు ఆకస్మికంగా మందిరద్వారమువద్ద గుర్రము

దిగినాడు. అతడు ఎంతో శీఘ్రగతితో దూరప్రయాణము చేసివచ్చిన వాని వలె కనిపిస్తున్నాడు. చెమటలు కారుతున్న ఆ ఆకారంతోనే పత్ర మొకటి చేతిలో పట్టుకొని తొందరపడుతున్న వానివలె నిలబడ్డాడు. దుబాసి దాని నందుకొని చదివి "అయ్యో! అయ్యో!—ఎంత పని!" అంటూ రాయస ప్రభువుకు అందిచ్చినాడు. ప్రభువు చదువుకొని శ్రీనాథునితో ఈవిధంగా అన్నాడు:

"కవిసార్వభౌమా, మా మండలేశ్వరులవద్ద నుంచి ఇప్పుడే ఆజ్ఞ వచ్చినది. మీవద్దనుండి నిలుచున్న వారిని నిలుచున్నపాట నిర్బంధించి మాశిస్తు బాకీ ఏడువందల బంగారు టంకాలు వసూలు చేయవలసినదనీ, లేకపోతే—ఆ మాట లెందుకు లెండి!—మీరు దీనార టంకాల తీర్థమాడిన వారు కదా! దయచేసి ఉన్నపాట చెల్లించండి!"

శ్రీనాథుడు నిట్టూర్పు పుచ్చి నిబ్బరము వదలక, "మహాదేవా! మేమిప్పుడు శిస్తు ఏమీ బాకీ లేమే!" అన్నాడు.

రాయసము: "అదేమిటి! బొడ్డుపల్లి మీరు గుత్తకు పుచ్చుకొన్నది రెండువేలారుకు గదా! అందులో మీరిప్పటికి చెల్లించినది ఒకవేయీ నాలుగువందలేకదా!"

"అవును."

"అయితే తక్కిన ఏడువందల టంకాలూ కట్టవద్దా? పాపము, మీకు వరదలవల్లా, దొంగలవల్లా, పిట్టలవల్లా చాలా నష్టము వచ్చినదని విన్నాము. ప్రభుత్వపు శిస్తుకూడా దైవాంశము పంటిదేకదా! ఇప్పుడు పూర్తిగా కట్టి, తగ్గించమని మండలాధిపతికి వినతి పత్రము పంపుకోండి! మేముకూడా మీ వినతి ఆలోచించి కరుణించవగినదని సిఫారసు చేసి పత్రము పంపుతాము—ఇప్పుడు వెంటనే అంతా కట్టక తప్పదు."

"దైవము కలిగించిన నష్టము నేనే ఏ విధంగానో భరిస్తాను.

శిస్తుపైకము తగ్గించమని ప్రాధేయపడను—నేను ఏడువందల టంకములు చెల్లించవలసిన గడువింకా ఇరవై రోజులున్నది. మహా శివరాత్రి వరకు నేను చెల్లించ వలసిన పనిలేదు.

రాయనము: "పెద్దలు మీకు నేనేమి చెప్పగలను!—మా ప్రభుత్వపు శిస్తు ఎప్పుడడిగితే అప్పుడు ఇయ్యవలసినదే! అది సర్వసాధారణమైన ప్రభుత్వ శాసనము!— దానిని మీ కవుళ్ళ షరతులు బాధించనేరవని ఇప్పుడైనా తెలుసుకోండి. మీకు తెలియకపోతే"

శ్రీనాథుడు: ఇది సమస్త ధర్మాలకూ విరుద్ధము!"

ఆ మాటలకు రాయన ప్రభువు శరీరమంతా కోపముతో ఎర్రపడిపోయి కంపిస్తూ ఉండగా కఠోర స్వరముతో ఇట్లా అన్నాడు: "మా ప్రభుత్వ ధిక్కారము మేమెంత మాత్రము సహించేది లేదు సుమా!— కవిసార్వభౌములని మీరేదో ఎగిరిపాటుతో ఉన్నట్లున్నారు. మీ ఆటలు మా వద్ద సాగవు!—ఏమయ్యా, ఉన్నపాటున 700 టంకాలూ చెల్లిస్తున్నావా, లేదా? ఊఁ!"

శ్రీనాథుడు నిశ్చలంగా అన్నాడు: "మీ ఉత్తరువుమీద మండలాధిపతులకు అన్యాయమని మనవి చేసుకొంటాను. ఇప్పుడు నా ఒంటిమీద ఈ మాణిక్యాంగుళీయక మున్నది. అది అధమ పక్షము పదిహేను వందల టంకాల విలువ చేస్తుంది. నా విజ్ఞప్తి తేలేవరకూ ఈ ఉంగరము పూటగా ఉంచండి. కాకపోతే ఐదువందల టంకాల విలువకల ఈ కాశ్మీర శాలువ కూడా ఉంచుకోండి!" ఇట్లా అంటూ వేలినుండి ఉంగరముతీసి, భుజముపైనుంచి తీసి మడతపెట్టిన శాలువమీదపెట్టి, రెండు చేతులతో పట్టుకొని నిలవబడ్డాడు.

దుబాసి వాటిని అందుకొని శాలువ మాత్రము రాయనము పాదాల ముందు పెట్టి ఉంగరము తీసుకొని పరీక్షించి, "శ్రీనాథయ్యా, ఎంత తెలివి

గలవాడవయ్యా! ఈ గాజుపూస పొదిగిన బంగారుపూత ఉంగర మిచ్చి 700 టంకాలు ఎగవేయ దలచినావటయ్యా, ప్రభుత్వము బాకీ?" అంటూ తన వేలికి తొడుగుకుంటూ, ఓఢ్రభాషలో, రాయసముతో "ప్రభూ, ఇయ్యేడట! ఈ ఉంగరం నాకు దుబాసీ పని చేసినందుకూ ఏదో సద్ది మనవి చేయడానికీ బహుమానంగా ఇచ్చినాడు. కాలువ తమకు బహుమానంగా సమర్పిస్తున్నాడు" అన్నాడు.

శ్రీనాథుని కా ఓఢ్రపు మాటలు అర్థమైనందున క్రోధోగ్రుడై సంస్కృతములో "ద్విభాషిన్, ద్విజిహ్వతాం తే ముంచ ముంచ!" అన్నాడు.

రాయన ప్రభువు ఆపైన మరి మాటాడలేదు. భటులకేదో సంజ్ఞచేసినాడు. అంతే!

ఆ కవి పండిత సభామధ్యములోనికి భటులు తమ తమ సాధనాలతో వచ్చి కవి సార్వభౌముణ్ని చుట్టుముట్టినారు. శ్రీనాథుడు తొణకక బెణకక శిలా ప్రతిమవలె నిశ్చలంగా నిలుచున్నాడు. భటులు ఆర్భాటము చేస్తూ — కొందరు ఆయన కాళ్ళకు నిగళాలు తగిలించినారు! కొందరు ముంజేతులకు, కదల్ప లేకుండా, వెదురు గడియవేసి సీలలతో బిగించినారు. ఆ పైన గొలుసులదండ తెచ్చి రెండు చీలమండలకూ బిగించి బలవంతాన శ్రీనాథుణ్ని వంగదీసి దానిని మెడకు కదలకుండా దండగావేసి పొగడ దండ కల్పించినారు.

పొగడ దండతో శ్రీనాథుడు కూలబడ్డ తర్వాత రాయన ప్రభువు ఇంకొకసారి కఠినంగా, "ఏడు వందల టంకాలు ఇప్పుడైనా కడుతున్నావా, లేదా?" అని హెచ్చరించినాడు.

శ్రీనాథుడు మహాగ్రహముతో, "నీ దుబాసి నాలుక కోయించి, నిన్ను నేలమీద పడవేసినప్పుడే కాని కట్టేదిలేదు! శివరాత్రిదాకా కానుచెల్లిం

చను. శివుడే సాక్షి!" అని అంటూ వెదురు గొడియలో బిగించి ఉన్న తన కరయుగమును హృదయముపై చేర్చి మోడ్చి "శివోహమ్!" అని సింహ నాదము చేసినాడు.

ఇంతవరకూ విభ్రాంతులై హాహాకారాలు కూడా చేయనేరక మూగ వారివలె ఉన్న ఆ సభలోని కవి పండితులంతా ఏకకంఠముగా ఇప్పుడు "శివోహమ్" అని గర్జించినారు.

రాయన ప్రభువు ఒక వంక భయముతోను, ఇంకొక వంక క్రోధము తోను వెలవెల బారుతూ అభ్యంతర మందిరములోనికి వెళ్ళడానికి లేచి నాడు. "వీని భుజాన మన నగరి వాకిటిలోని నల్లగుండు" ఎక్కించి శిస్తు బాకీ కట్టేదాకా రాజవీధిలో ఎదురెండలో పడేసి దేకించండి!" అని భటుల కాజ్ఞాపించి లోపలికి వెళ్ళిపోయినాడు. భటులు శృంఖలలతో వెదురు గొడి యతో చేతులు కాళ్ళు ఆడక బొగడదండతో నేలకు వంగిపోయిన శ్రీనాథుణ్ణి నగరి వాకిటికి ఈడ్చుకొనిపోయి, అక్కడ నల్లగుండు బుజానపెట్టి, ఎదు రెండలో పడవేసి వీధిలో దేకించినారు.

అప్పుడు దుబాసీ నాగయ్య చిరునవ్వులు ఒలికిస్తూ, ద్వారము వద్దకు తాంబూలపు పళ్ళెములు తెస్తున్న సేవకులతో వెళ్ళి నిలుచుండి, కవి పండి తుల నందరిని "తాంబూలాలు పుచ్చుకొని దయచేయండి" అని పిలిచినాడు. అతడు పళ్ళెములలో వక్కలాకులు మాత్రమున్న శుష్కతాంబూలాలు దొడ్డి సంభావనవలె అందించ సాగినాడు. వాళ్ళెవ్వరికి ఆ తాంబులాలు పుచ్చుకొనడానికి మనస్కరించలేదు. కొందరు మాత్రము భయముతో పుచ్చు కొన్నారు. ఎక్కువమంది తమ చూపుడు వ్రేళ్ళతో తాంబూలాలు తాకి, తీసుకోకుండా వెళ్ళినారు. కొద్దిమంది తాంబూలాలు నేలమీద విసిరికొట్టి వెళ్ళినారు. కొందరు మాత్రము నాగయ్య ముఖాననే పారవేసి వెళ్ళినారు. ఎవరేమి చేసినా ముఖాన చెరగని చిరునవ్వుతో నాగయ్య అందరిని నమస్క రించి పంపుతున్నాడు.

అప్పుడు నాగయ్యకు కలిగిన ఆనందము జన్మలో ఎరుగడు. వీధిలో దేకుతున్న శ్రీనాథుణ్ని చూడవలెననే ఉబలాటము అతనికి, ఖగేంద్రుడు తెచ్చిన అమృత కుంభము దర్శించవలెనని నాగులకు ఉన్నట్లే ఉన్నది. అమృత ప్రాశనముచేసే ముందు స్నానాలు చేయడానికి వెళ్ళిన పురాణ నాగాలవలెనే నాగయ్యకూడా స్నానానికి వెళ్ళినాడు.

గోష్ఠికి వచ్చిన కవిపండితులు తమ ఇండ్లకు పోకుండా, అమరేశ్వర స్వామి ముఖ మండపమునందు సమావేశమైనారు. వెంటనే గ్రామములో ఏడువందల టంకాలు వసూలుచేసి శ్రీనాథు డియ్యవలసిన శిస్తు పూర్తిగా రాయసమునకు చెల్లించి, ఆయనను విడిపించి, ఆనాడే అంతాపోయి మండలాధిపతికి రాయసము దుండగము గూర్చి నివేదింప నిశ్చయించినారు.

రెండు గడియలలో వేయి బంగారు టంకాలు పోగైనవి. అమరావతి సభాపతి కవి పండితులందరితో కలసి ఆ ధనము తీసుకొని రాయస ప్రభువు మందిరానికి వెళ్ళినాడు. ఆ బ్రాహ్మణోత్తములలో అప్పటి కెవ్వరు మాధ్యాహ్నిక కృత్యాలు చేయలేదు. వారితోపాటు వారి మందిరాలలో నిత్యార్చనలు అందుకొంటున్న ముక్కోటి దేవతలూ వస్తున్నారు.

అమరేశ్వరస్వామి ఆలయములో స్వామికి కొట్టిన టెంకాయలన్నీ కుళ్ళి ఉన్నవనీ, అప్పుడు మహానివేదనకు వండి తెచ్చిన అన్నమూ, ఉపహారాలూ పురుగులతో నిండి దుర్గంధ భూయిష్ఠముగా ఉండి నివేదనార్హముగా లేవనీ ఆలయార్చకులు ఘోష పెట్టినారు.

# 14

ఇంతలో ప్రభుశాసనము ఆగలేదు. అమలు జరుగుతూనే వున్నది. అమరేశ్వరస్వామి ఉత్సవ సమయాలలో ఊరేగే ఘంటాపథములో శ్రీనాథ కవిసార్వభౌముణ్ణి ఒడ్డె భటులు ఎదురెండలో దేకిస్తున్నారు. దేకనిచో కొర

డాలతో కొట్టడానికి భటులు సిద్ధముగా ఉన్నందున ఆ "మర్యాద" తప్పు కొనేందుకు లేని ఓపిక తెచ్చుకుంటూ బుజము పైన ఉన్న గుండు బరువుతో వాళ్ళు చెప్పిన విధంగా దేకుతున్నాడు.

కవి సార్వభౌముడు మాట్లాడుటలేదు. చిత్తములో మహేశ్వర ధ్యానముచేస్తూ "శివోం శివోహం శివోహమ్" అనుకుంటున్నాడు. కొందరు కవీశ్వరులు ఆయనను విడువలేక నమస్కరిస్తూ కంట తడిపెట్టుకుంటూ ఆయన వెంట నడుస్తున్నారు. అపరాహ్ణమైనది. నాగమ్య స్నానముచేసి ఆ అమృత దృశ్యముచూచి ఆనందించడానికి అక్కడికివచ్చి కన్నులప్పగించి పారవశ్యముతో చూస్తున్నాడు.

అక్కడ వున్న కవులలో వృద్ధ కవి ఒకడు కన్నీరు కారుస్తూ గద్గద మయిన కంఠముతో ఇట్లా విలపించినాడు:

"కవిరాజు కంఠంబు గౌగిలించెను గదా
పురవీధి నెదురెండ బొగడదండ!"

మరియొక కవి ఇట్లా దుఃఖించినాడు:

"సార్వభౌముని భుజాస్తంభ మెక్కెను గదా
నగరి వాకిట నుండు నల్లగుండు!"

ఇంకొక కవి ఇట్లా వాపోయినాడు:

"వీర భద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెను గదా వెదురు గొడియ!"

వేరొక కవి ఈ విధముగా రోదనము చేసినాడు:

"ఆంధ్ర నైషధ కర్త యంఘ్రి యుగ్మంబున
దగిలి యుండెను గదా నిగళ యునము!"

మరి కొంద రితర కవులు ఇట్లా శోకించినారు:

"కృష్ణవేణమ్మ కొని పోయె నింత ఫలము
బిలబిలాక్షులు తినిపోయె దిలలు పెసలు

బొడ్డుపల్లెని గొడ్డేరి మోసపోయె
నెటు చెలించు టంకంబు లేడు నూర్లు?"

అందరు కవులు ఆ విధముగా చెప్పగా విని సంతోషము పట్టలేక నాగయ్య శ్రీనాథునికి ఎదురై అహో ఓహోలు కలుపుతూ విందు కుడుస్తున్న వానివలె ఆ పద్యమే పరిహాస పూర్వకంగా ఇట్లా చదువసాగినాడు.

"అహో !—కవిరాజు కంఠంబు కౌగిలించెను గదా
పురవీథి నెదురెండ పొగడ దండ,
"ఓహో!—సార్వభౌముని భుజాస్తంభ మెక్కెను గదా
నగరి వాకిట నుండు నల్లగుండు,
"అహో!—వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
వియ్యమందెను గదా వెదురు గొడియ.
"ఓహో!—ఆంధ్ర నైషధకర్త యంఘ్రి యుగ్మమ్మున
దగిలి యుండెను గదా నిగళ యుగము

"అహాహా!—కృష్ణవేణమ్మ కొనిపోయె గొంత ఫలము
"ఓహోహో!—బిలబిలాక్షులు తినిపోయె దిలలు పెసలు
"ఇహీహీ!—బొడ్డుపల్లెను గొడ్డేరి మోసపోతి
"ఇహీహీ ఇహీహీ!—వెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు?"

శ్రీనాథుడు దైన్యము కాని, కోపము కాని ప్రదర్శించి నాగయ్యకు ప్రత్యేక తృప్తి కలిగింపలేదు. ఆయన ఆత్మలో గరళ కంఠుడైన సదాశివుడే నిండి ఉన్నాడు. దేహ జ్ఞానము ఉండీ లేనట్లున్నది.

దృఢకాయుడే అయినా, ఆయన వయోవృద్ధుడు! అప్పటికి భోజనము చేయలేదు. ఎదురెండ, కాలుసేతులకు సంకెళ్ళు, కాళ్ళూ మెడా లంకె వేసిన పొగడదండ! బుజాలపైన బరువైన నల్లగుండు! ఇది అంతా ఆయన తనకు

జరుగుతున్న పరాభవముగా గ్రహింపక, శివార్పణము చేసినాడు. దేహము ఆ పరిశ్రమ భరించలేకున్నది. చెమటలు ఒళ్ళంతా ముంచివేసినవి. చర్మము ఎఱ్ఱవారి కమిలిపోయినది. కాళ్ళుచేతులు కంపింప సాగినవి. కళ్ళు తిరిగి పోతున్నవి. తూలి పడిపోవడానికి సిద్ధముగా ఉన్నాడు.

సరిగ్గా ఆ సమయానికి, దగ్గరలోనే ఉన్న రాయసము దివాణము ముందర, కవి పండితులంతాచేరి, కాపున్న భటులతో తాము శ్రీనాథుని శిస్తు బాకీ అంతా తెచ్చినామనీ, అది తీసుకొని ఆయనను విడిపింపమని రాయసమునకు నివేదింపమని వేడుకొంటున్నారు. కావలివారు తమ ప్రభువు నిద్ర పోతున్నాడనీ, అల్లరిచేసి నిద్రా భంగము చేయవద్దనీ కేకలు వేస్తున్నారు. ఇంతలో బొడ్డుపల్లెనుండి శ్రీనాథుని కార్యకర్త ఎల్లెల్లో పరివార జనానికి చెల్లించినవి తిరిగి వారినడిగి అప్పుగా పుచ్చుకొని తెచ్చి, బాకీ శిస్తు తీసుకొని తన ప్రభువును విడిపింపమని కోరినాడు. అతనికి కూడా కావలివారు అదే జవాబు చెప్పినారు.

అప్పుడే పల్నాడు నుండి పిడుగు వీరభద్రయ్య పల్నాటి వీరచరిత్ర చెప్పినందుకు శ్రీనాథునకు బహూకరించే నిమిత్తము పెద్దలతో కలిసి రెండు వేల టంకాలు తెచ్చి, సంగతి సందర్భాలు విని, బాకీ చెల్లించడానికి దివాణానికి వచ్చినాడు. అతనికీ అదే జవాబు!

మరి కొంచెము సేపటికి శ్రీశైలము నుంచి ఉప్పల సాంతయ్య పంపిన భటులు ఐదువేల వరహాలు సమర్పించడానికీ తెచ్చి, జరిగిన సంగతి తెలిసి, దివాణమునకు వచ్చి అక్కడి కావలి వారితో ఘర్షణ పడసాగినారు.

ఈ గందరగోళములో బమ్మెర నుండి బొడ్డుపల్లి ఆ మధ్యాహ్నమే చేరుకొన్న పోతన, జరిగిన ప్రమాదము విని తొందరగా రేవు దాటి, పాలి కాపు రామన్న చేత టంకాలు నిండిన సంచీ పట్టించుకొని, పరుగు పరుగున రొజుకుంటూ అక్కడికి వచ్చినాడు. అతడు కావలి వారి నందరినీ లెక్క

చేయక శ్రీనుకుని సరాసరి రాయసము నిద్రిస్తున్న మందిరము వాకిలి తట్టినాడు. ఎవరూ పలుకగ పోగా అతడు ఆవేశముతో తలుపు కాళ్ళతో బలముగా తన్నుతూ చేతులతో తట్టుతున్నాడు. బలశాలి అయిన రామయ్య కూడా తోడైనాడు. వారి తన్నులకు తలుపు పగిలిపోతున్నది.

ఇంతవరకూ మేలుకొనియే ఉన్న రాయసము ఏదో తిరుగుబాటు రానే వచ్చినదని భయపడి గజగజ లాడుతూ, అక్కడి నుండి తప్పుకొని దేవతార్చన గదిలోనికి పోయి నక్కి ఉన్నాడు.

ఇవతల ఈ గందరగోళము జరుగుతుండగా వీథిలో శ్రీనాథుడు విరిగిపోయిన ప్రభవలె పడిపోయేట్లుండి దేకలేకున్నాడు. దేకించడానికి భటులను కొరడాలెత్తి కొట్టుటకు సిద్ధముగా ఉండమని నాగయ్య సంజ్ఞ చేసినాడు. భటులు కొరడా లెత్తినారు.

సరిగా అప్పుడు అశ్వికతండము ఒకటి వాయువేగముతో వచ్చి అమరావతి రాజవీధి నిండిపోయినది. వారి ఆకారాలు ప్రమథగణమునే తలపిస్తున్నవి. అశ్వికులు కొరడా దెబ్బలతో శ్రీనాథుని కొట్టుటకు కొరడా లెత్తిఉన్న భటుల వీపులు పగిలిపోయి రక్తము ఓడ సాగినది. దుబాసి నాగయ్యకు కూడా ఒక్క కొరడా దెబ్బతో నోరూ నవ్వులూ కట్టుపడ్డవి.

శ్రీనాథుని భుజాలపై ఉన్న నల్లగుండు పట్టు తప్పి జారి పడిపోయినది. దానితో పాటు పక్కకు వాలిపోతున్న శ్రీనాథ కవి సార్వభౌముణ్ణి పడకుండా అశ్వికనాయకుడు క్రిందికి దూకి, గౌరవముతో, ప్రేమతో, భక్తితో పట్టుకొన్నాడు.

"బావా, స్వామీ. ప్రభూ!" అంటూ ఆ అశ్వికనాయకుడు పెద్దగా రోదనము చేస్తూ, తక్కిన భటుల సహాయముతో శ్రీనాథకవిని పక్కనున్న ఇంటి నీడకు చేర్చినాడు. వెంటనే ఒకరు పొగడదండ, ఒకరు కాలి సంకెళ్ళూ, ఒకరు వెదురు గొడియూ నరకి పారవేసినారు. ఆ గృహ

యజమాని తెచ్చిన హంసతూల తల్పముపై శ్రీనాథుణ్ణి ఆ అశ్వికుడు జాగరూకతతో, ఆదరముతో పరుండ బెట్టినాడు. శ్రీనాథుడు సొమ్మసిల్లి మూర్ఛలో మునిగి ఉన్నందున కన్నులు తెరవలేదు. శీతలోదకము తెప్పించి శైత్యోపచారములు చేయించి అతడు శ్రీనాథుణ్ణి తేర్చినాడు. కొంచెము స్పృహ వచ్చి శ్రీనాథుడు 'శివోహమ్' అని ఉచ్చరిస్తూ, కళ్ళు తెరిచినాడు. ఆయన దృష్టి ముందు దుఃఖానందాలు సమ్మిశ్రమైన బాష్పాలు కారుస్తూ ఉన్న ఆ అశ్వికుని మీద పడ్డది.

"నాయనా, దుగ్గన్నా, ఎంత బేలవోయీ! శ్రీకృష్ణభగవానులకు రాయబారములో జరిగినదానికంటె ఏమెక్కువైనదోయి ఇది!—ఈ లోకపు తీరులు మనకు లోకైక గురువైన సదాశివుడు ప్రదర్శిస్తాడు. 'అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా, చక్షు రున్మీలనం' చేస్తాడు కద టోయి!" అన్నారు శ్రీనాథుడు.

దుగ్గన్న దుఃఖము పట్టలేక బావురుమని ఏడ్చినాడు. తనకు సర్వవిధాలా శ్రీ గురువైన శ్రీనాథుని పాదపద్మములపై తన కరపద్మాలు, ముఖపద్మము ఆనించి భోరుమని అతడు ఏడుస్తున్నాడు. అది చూచి శ్రీనాథుడు లేని ఓపిక తెచ్చుకొని కూర్చుండి దుగ్గనను తన రొమ్ముకు హత్తుకొని, "ఎక్కడ నుండి ఇటు వచ్చినావు?—విశేషాలు ఏమిటి? ఎన్నాళ్ళయినదోయి నిన్ను చూచి! నిన్ను చూస్తుంటే మీ అప్పను మళ్ళీ చూస్తున్నట్లే ఉందిరా, నాయనా!—నీ పరిష్వంగము అంత చల్లగానూ ఉన్నదిరా తండ్రీ!" అన్నాడు. ఈ విధముగా ఓదార్చవలసిన తన్నే ఓదార్పు పొందవలసిన తన బావ ఓదార్చటము చూచి దుగ్గన ప్రయత్న పూర్వకముగా ధైర్యము తెచ్చుకొని క్లుప్తముగా తనరాక విశేషాలు తెలిపినాడు.

## 15

"గడి దుర్గాలను బసవరాజుగారు కాపాడుతున్నారు కదా!—శ్రీశైల సీమనుంచి ఏదో అలజడి రాబోతున్నదని ఇక్కడి రాయసము

పంపిన బేగిరావుల కబురంది నిజానిజాలు విచారించటానికి ఇటువైపు వస్తున్నారు. ముందు వారి మంత్రీశ్వరులైన గంగనమంత్రి గారిని ఇటు పంపగా వారితో నేను వచ్చినాను. మీ బొడ్డుపల్లి వ్యవసాయ క్షేత్రము చూడవలెననే కుతూహలము కూడా ఉండినది— మేము వైకుంఠపురములో మకాముచేసి ఉన్నాము. గంగన మంత్రులవారు శివపూజ చేస్తున్న సమయములో, దుబాసితో కలసి ఇక్కడ రాయన ప్రభువు ప్రజలను అన్యాయంగా హింసిస్తున్నాడనీ, ఈనాడు కవిసార్వభౌములకు సంకెళ్ళు వేసి చిత్రహింస చేస్తున్నాడనీ, అమరేశ్వరస్వామి కూడా నివేదనము స్వీకరించలేదనీ, అశ్వికుడు వార్త తెచ్చినాడు. గంగన మంత్రులు నావల్ల మీ సంగతి విని యున్నాడు కనుక, అశ్వికులతో ముందు నన్ను పంపి శిక్షను వెంటనే నిలిపి వేయించమని ఆజ్ఞాపించినాడు. వారు కూడా శివపూజ పూర్తికావించుకొని ఈపాటికి వస్తూ ఉండవలె!"

"అయితే నీవింకా భోజనము చేయలేదన్నమాట — అయితే వెంటనే బొడ్డుపల్లి లో మాఇంటికి పోదాము పద!"

"బావా, నీవు భోజనము చేయలేదు. గంగన మంత్రులు కూడా ఈనాడు మనవలెనే నక్తవ్రతము అవలంబిస్తారు! — ఇక్కడ రాయన ప్రభువున్న దివాణములోనే మనకూ, గోష్ఠికి వచ్చిన కవి పండితు లందరికీ వారు ఈ రాత్రి విందు చేస్తారు. నన్ను మన్నించి నీవు, ఆ విందుకు రావలె!" ఆ మాటకు శ్రీనాథునకు ఆనందము అయినది. ఇంతలో ఎదుట వీధిలో దూరాన కోలాహలము వినిపించగా, "గంగన మంత్రిగారు వస్తూ ఉండవలె" అన్నాడు దుగ్గన.

ఆ వస్తున్నది గంగనమంత్రి కాదు. గ్రామ ప్రజలందరు సభాపతి పురస్సరముగా రాయన ప్రభువు దుబాసి నాగయ్యను పట్టుకొని బలవంతముగా అక్కడికి తెస్తున్నారు. గ్రామీణులే కాదు, ఆ గుంపులో

ఉన్నది. అమరావతిలోను, ఆ చుట్టుప్రక్కలను ఉన్న ప్రజలందరూ అబాల గోపాలము అందులో ఉన్నారు. దుబాసి నాగయ్యను ఒక రెక్క పోతన, రెండవ రెక్క శ్రీనాథుని కార్యకర్త పట్టుకొని తీసుకొని వస్తున్నారు. ఆ జన సమూహము శ్రీనాథుడు విశ్రమించి ఉన్న ఇంటి ముందుకే వచ్చినిలిచినది.

అక్కడ ఆ విధముగా పాతికేళ్ళ పిమ్మట మరల పోతన దుగ్గనలకు ప్రాప్తించిన సమాగమము దుఃఖము, ఆనందము, కోపము, ప్రేమ, జుగుప్స, వీరమూ కలసి నానారసభావ సమ్మిశ్రమై ఉన్నది, వాళ్ళిద్దరూ మౌనముగా గాఢాలింగనము చేసుకొని కలసి ఒక్కసారిగా శ్రీనాథుని పాదాలకు మ్రొక్కినారు.

ఇప్పటికి శ్రీనాథునికి శ్రీదేవి అచ్చముగా ప్రత్యక్షమైనట్లనిపించినది. మెరపు మెరిసినట్లుగా తమ శ్రీ విద్యానగర విజయయాత్ర, రాజు కొండ యాత్ర కన్నుల కట్టినట్లుగా కనిపించినది. దానికీ, నేటి తన అనుభవానికీ వైపరీత్యము స్పష్టముగా గోచరించినది. ఆయన కిప్పుడు విభ్రమము నిలవ లేదు. కన్నుల నుంచి రాలుతున్న బొట్లు కొన వేళ్ళతో విదిలించుకొంటూ, మాటాడబోగా, నోట మాట పెగలలేదు. ఇంతలో పిడుగు వీరభద్రయ్య, శాంతయ్య దూతలు, అమరావతి సభాపతి మొదలుగా ఆనాడు చేరిన కవిపండితులూ అంతా కన్నీరు కారుస్తూ ఎదటికివచ్చి శ్రీనాథునికి నమస్కరించినారు. ఆనాడు అమరావతీ నగరములో కన్నీరు కార్చనివాళ్ళే కనబడ లేదు.

అంతలో దూరాననుండి బిరుదు గద్యలతో వీచోపులు వినవచ్చినవి. గంగనమంత్రి రాగానే శ్రీనాథకవిని పలకరించలేదు. ఆయనకు నమస్కరించలేదు. ఆయన శయనించి ఉన్న యింటికి ఎదురుగానే నడివీధిలో పెద్ద గద్దె ఏర్పాటు చేయించుకొని ధర్మాసనము తీరినాడు. ఆ సంగతి ముందుగానే

తెలిసి అమరావతీ పౌరులేకాక చుట్టుప్రక్కల నుండి గ్రామీణులంతా వచ్చి తమతమ గోడు విన్నవించుకొన్నారు. గంగనమంత్రి శ్రీనాథుని ఏమీ అడగ లేదు. ఆనాడు జరిగినదంతా కవి పండితులే ఏకగ్రీవముగా సభాపతి ద్వారా నివేదించుకొన్నారు. దుగ్గన పోతనలు పూర్వము పులిపాడులోను, వినుకొండలోను జరిగినది వివరించినారు. రాయన పురోహితుడు ఆ ఉదయమే ఆ గోష్ఠికి ముందు రాయన ప్రభువూ, దుబాసీ నాగయ్యా తమకు శ్రీనాథుడు వ్రాసి ఇచ్చిన రెండు శ్లోకాలను అర్థమడిగి తెలుసుకొన్నారని చెప్పి ఆ శ్లోకాలు వినిపించినాడు. పురోహితుని వాక్కులలో దాపరికము లేకున్నది.

అందరిని విచారించిన మీదట గంగనమంత్రి ఈ నిర్ణయానికి వచ్చినాడు. దీని కంతటికీ మూల కారకుడు దుబాసి నాగయ్య. రాయన ప్రభువు ప్రధానదోషము నాగయ్య మోసము తెలుసుకోలేక పోవుటే. దానికి తోడు పిరికిదనము, అతి తొందర. ఏమైనా ఆయన అపరాధాలు క్షమించదగినవి కావు. 1. గడువు రాకముందే శిస్తులు కట్టమని ప్రజలను తొందరపెట్టి హింసించుట-దీనివల్ల పాలితులకు రాచబానమీద గౌరవభావము నశిస్తుంది. 2. పైగా తెచ్చిన శిస్తు వెంటనే తీసుకోక వృధాగా శ్రీనాథునికి కఠినదండనము సాగనిచ్చుట. 3. వృద్ధబ్రాహ్మణ పండితునికి మరణాపాయము కల క్రూరదండనము విధించుట. 4. తన కళ్ళ ఎదుటనే శ్రీనాథుని మాణిక్యాంగుళీయకమును దుబాసి హరింపగా చూచి హర్షించుట. ఇంకా ఎందరు ప్రజల డబ్బు దోచుకున్నాడో ఈ విధంగా! 5. పూజ్యులైన కవిపండితులను విద్యాగోష్ఠికి ఆహ్వానించి వారిని తగు విధముగా సమ్మానింపకుండుట. దీనివల్ల ఒడ్డె ప్రభుత్వముమీద ప్రజలకు నీచభావ మేర్పడుతుంది.

"రాయన ప్రభువును శిక్షించే అధికారము నాకు లేదు. బసవరాజు గారు రేపటికి వస్తున్నారు. వారికి నా విచారణ సారాంశాలు నివేదిస్తాను.

వారే తుది నిర్ణయము చేయగలరు. రాయన ప్రభువుగారూ, మీరు చెప్పు కొనేది రేపు వారివద్దనే నివేదించుకోవచ్చును. ప్రస్తుతము మిమ్ము వదలి నాము-ఈ దుబాసి నాగయ్యను శిక్షించే అధికారము మాకున్నది. దుబాసి నాగయ్యా, నీమీద ఇన్ని నేరాలు ఇంతమంది ఇన్నివిధాలుగా చెప్పినారు. విన్నావు గదా!—నీవు చెప్పుకునేది ఏమైనా ఉన్నదా?"

దుబాసి నాగయ్య నోరెత్తితే జన సమూహము కోపావేశముతో చిత్రహింస చేసేట్లు ఉన్నారు. భటుల భయముకూడా అతని ప్రాణము రక్షించే స్థితి దాటిపోయినది. అది ముందే గమనించిన దుబాసీ నాగయ్య నేరాలన్నీ ఒప్పుకొన్నాడు.

వెంటనే గోష్ఠికి వచ్చిన కవిపండిత సమూహము ఇట్లా అన్నారు: "ముందీతని నాలుక పీకించవలె. అది శ్రీనాథకవి సార్వభౌముల ప్రతిజ్ఞ!—నీ దుబాసి నాలుక కోయించి—నిన్ను నేలమీద పడవేయించి కాని శిస్తు కట్టను —అన్నారు. అది శివాజ్ఞ!"

గంగనమంత్రి దృష్టి దుబాసీ నాగయ్య చేతివ్రేలికి తొడిగి ఉన్న శ్రీనాథుని మాణిక్యాంగుళీయకముపైన నిలిచినది. అది గమనించి అతడు వెంటనే తీసి గంగన మంత్రి పాదాల ముందు పెట్టినాడు.

"ఆ వ్రేలు తెగగొట్టి ఉంగరము తీయవలె. మళ్ళీ పెట్టుకో నాగయ్యా!" అని జనసమూహము కేకలు వేసినది.

యింతలో దుగ్గన, "శ్రీనాథకవి సార్వభౌములు ఈ పాపిష్ఠుడు ధరించిన అంగుళీయకము తిరిగి గ్రహింపరు!" అని గంగన మంత్రికి నివేదింపగా, అతని వంక ప్రీతి పూర్వకముగా శ్రీనాథు డవలో కించి నాడు. గంగయ్య సంజ్ఞ చేయగా నాగయ్య మళ్ళీ దానిని తన వ్రేలికి పెట్టు కొన్నాడు.

నాగయ్య దండనముకూడ బసవరాజుగారు వచ్చేవరకూ ఆపడము

ఉచితమేమో అని గంగనమంత్రి సూచించినాడు. ఆయన ఉద్దేశము తాను విధించే దండనముకంటే బసవరాజుగారు కఠిన దండన విధింపగలరని, కాని జనసమూహము ఆయన మాటలు వినిపించుకోలేదు. అతనిని దండింపనిది తాము భోజనములు చేయమని కవిపండితులు పట్టుపట్టినారు. అప్పుడు గంగనమంత్రి రాయస ప్రభువునే తన దుబాసీకి వేయదగిన దండనము సూచింపుమని అడిగినాడు. దానితో నాగయ్య ముఖము వికసించినది. రాయసము ఇట్లా సూచించినాడు:

"కవిసార్వభౌములు ప్రతిజ్ఞ చేసినట్లుగా ఈ దుబాసీ నాగయ్య నాలిక పీకించవలె—ఇక ఆ ఉంగరము కవిసార్వభౌములు పరిగ్రహింపరు కనుక ఆతని వ్రేలనే దాని నుండనిచ్చి, అవి ఆ వ్రేలు చివర రెండుగా చీల్పించి బద్దలతో కట్టి బయటికి ఉంగరము తీసినా రాకుండా చేయవలె!"

అపూర్వమైన ఆయన సూచనకు జనసమూహము సంతోషముతో కేకలు పెట్టి సమ్మతి ప్రకటించినది.

వెంటనే నాగయ్య దండనము అమలుపరచినారు.

శ్రీనాథుడు ఈ విచారణ సాగుతుండగా, ఎక్కువభాగము కన్నులు మూసుకొని విశ్రాంతి తీసుకొన్నాడు. కొంత నిద్రకూడా పట్టినది.

శ్రీనాథుని కార్యకర్త అప్పుడు గంగనమంత్రితో బొడ్డుపల్లి కరణము శ్రీనాథుని గుత్తబాకీ శివరాత్రివరకూ చెల్లించవలసిన అవసరము లేదని గట్టిగా మనవి చేసినందుకు, చెరసాలలో మగ్గుతున్నాడని మనవి చేసినాడు. వెంటనే గంగనమంత్రి చెరసాల అధికారికి పత్రము వ్రాసి పంపి, అక్కడికి కరణమును పిలిపించినాడు. కరణమును పిలిపించి ఆయన చెప్పేది వ్రాసుకొని ఈ విషయముకూడా రేపు బసవరాజుగారు విచారించదగినదని చెప్పి కరణమును వెంటనే చెర విడపించి పంపుతూ, ఆ మరునాడు పూర్తి విచారణకు రావలసినదని చెప్పినాడు.

ఆరాత్రి గంగనమంత్రి రాయసప్రభువు విడిదిలో తాను విందు చేస్తున్నానంటూ, దానికి రావలసినదని శ్రీనాథుని, కవిపండితులను, పోతనాదులనే కాక అక్కడికి వచ్చిన చాతుర్వర్ణ్యజనమును ఎంతో ఆదరముతో ఆహ్వానించినాడు. దానితో జనసమూహానికి ఇన్నాళ్ళనుంచీ ఒడ్డె ప్రభుత్వముమీద పెరుగుతూ వచ్చిన ద్వేషభావము చల్లారి భక్తిగా మారినది.

శ్రీనాథభట్టు మాత్రము తా నా నాడు విందులో పాల్గొనడానికి మొదట కొంత సందేహించినాడు. న్యాయముగా గాని, అన్యాయముగా గాని, తా నా నాడు రాజదండనము పొందిఉన్నాడు. అందుచేత తనకు అపవిత్రత ఆవహించినది. పరిషదనుజ్ఞపొంది తగిన ప్రాయశ్చిత్తము చేసుకొంటేనేగాని తాను సంధ్యావందనాది నిత్యకర్మలకు తగనని ఆయన సందేహము. వెంటనే అమరావతి సభాపతి అధ్యక్షుడుగా వచ్చిన పండితులతో పెద్ద పరిషత్తు సమావేశమైనది. ధర్మశాస్త్ర చర్చలతో తర్జన భర్జనలు కొంతసేపు సాగినవి. చివరకు పరిషత్తు నిర్ణయము "శ్రీనాథునకు ఏ మాత్రము అపవిత్రత అంటకపోవుటే కాక ఆయన ఈ జన్మలో తెలిసిగాని తెలియకగాని, రహస్యముగా గాని, బహిరంగముగాగాని ఏ పాపాలైనా చేసి ఉంటే, వాటి అన్నిటినుంచీ విముక్తుడైనాడు. అంతేకాదు. ఏనాడో, ఏ జన్మలోనో ఏదో మహాపాపము చేసి ఉంటేనేకాని ఈనాడు నిష్కారణముగా ఈ నరక యాతన అనుభవించి ఉండడు. దీనివల్ల ఆ మహాపాపము నుండి కూడా విముక్తుడైనాడు." అని సర్వజన సమక్షములో సభాపతి ప్రకటించినాడు. ఆ నిర్ణయము వినగానే శ్రీనాథభట్టు మూర్తిలో ఏదో నూతన తేజస్సు ఆవహించినట్లు విస్పష్టముగా అందరికీ కానవచ్చినది.

ఓపిక లేకపోయినా, లేని ఓపిక తెచ్చుకొని శ్రీనాథు డారాత్రి గంగనమంత్రి చేసిన విందులో భుజించినాడు. అంత అవ్యవధానముగా ఏర్పాటు చేసినా గంగనమంత్రి చేసిన ఆ విందు భరద్వాజుని విందువలె

సర్వసంపన్నముగా ఉన్నదని అశేషజన సమూహమూ బహుకాలమువరకూ మరచిపోక మెచ్చుకొనేవారు.

విందైన తర్వాత గంగనమంత్రి రాయసముతో, "మీ రిప్పుడైనా కవిపండితులకు ఈ ప్రొద్దున చేయవలసిన సన్మానము చేస్తే బాగుంటుం దేమో ఆలోచించండి!" అన్నాడు.

రాయసము గంగనమంత్రి మెప్పు పొందే కోరికతో తన సొంత ద్రవ్యముతో కవిపండితుల నందరినీ ఘనముగా దక్షిణలుపెట్టి తాంబూలాలు సమర్పించి మనిషి మనిషికి పాదాభివందనముచేసి సన్మానించినాడు. శ్రీనాథ భట్టుకు నూటపదహార్లు సమర్పించబోయినాడు. కాని అయన స్వీకరించక ఆ తాంబూలమును తాను పూటగా ఉంచిన శాలువమీద పెట్టి రాజకోశములో వుంచమనగా, అట్లే జరిగినది.

# 16

ఆరాత్రి పోతన దుగ్గనలు బహుకాలానికి కలిసి కొన్నందున, అంత రంగములలో ఇద్దరికీ పొంగివస్తున్న ఆ ప్తసంభాషణకు తహతహ లాడుతూ ఉండిరి. కాని శ్రీనాథుడానాడు పడ్డ యమయాతన తలపుకు మాటి మాటికీ వస్తున్నందువల్ల వారి మాటలు గొంతులోనే కట్టుబడిపోతున్నవి. శ్రీనాథుని వా రిద్దరూ శంఖచక్రాలవలె వదలక సేవిస్తూ, పాదసంవాహనము చేస్తూనూ వీవనలతో విసరుతూనూ, మధ్య మధ్య చెరిగిన పక్క సరిచేస్తూనూ దాహ మైనప్పుడు జలమందిస్తూనూ, ఆయన పలంకరించినప్పుడు పలుకుతూనూ, ఉపచరిస్తూ ఆ రాత్రి జాగరణము చేసినారు. శ్రీనాథునికి తెల్లవారేజాము వరకూ మధ్యమధ్య కునుకు తప్ప రాలేదు. కాని ఆ చివరిజాములో గాఢ నిద్ర పట్టినది. శ్రీనాథునికి నిద్రాభంగ మవు నన్నే భయముతో వారిద్దరూ

గుసగుసలైనా ఆడలేదు. ఒకరి నొకరు చూపులతోనే ప్రేమతో ముంచివేసు కొంటున్నారు.

తెల్లవారినది. చివరిజామున పట్టిన నిద్రతో కొంత విశ్రాంతుడయినా శ్రీనాథునకు అవ్యక్తమైన జాడ్యమేదో శరీరములో ఆవహించినట్లయినది. వైద్యులను పిలవవద్దని ఆయన నిషేధించినందున ఊరకుండవలసి వచ్చినది: ఉష్ణోదక స్నానము చేయించగా కొంత తేలిక పడ్డట్లయినది. సంధ్యా వందనాదికము నిర్వర్తించి బొడ్డుపల్లికి బయలుదేరగా గంగయమంత్రి ప్రార్థనా పూర్వకముగా వారించి నిలిపి దివాణములో విశ్రాంతికి వసతులు కల్పించినాడు.

ఆ మధ్యాహ్నానికి బసవరాజు వచ్చినాడు. ఆయన రాజధాని చంద్ర గిరి. కపిలేశ్వర గజపతికి ఆయన దక్షిణ బాహువువలె అండగా ఉండి, సామంతుడై, గజపతుల హస్తగతమైన ఆంధ్రభూమి నంతటికిని మహా మండలేశ్వరుడై పరిపాలిస్తున్నాడు.

ఆయన రాగానే ముందు గంగయమంత్రి నివేదిక శ్రద్ధగా విని, ఆయన నాగయ్యకు విధించిన దండనము, రాయన ప్రభువుకు సూచించిన దండనమూ చాలవని నిష్కర్ష చేసి మళ్ళీ పూర్తిగా విచారణకు పూను కొన్నాడు.

ముందాతడు అమరావతి ఉప మండలాధిపతిని విచారించినాడు. ఆయన చెప్పుతున్నా వినక రాయనప్రభువు దుబాసీతో కలసి జరిపిన దుశ్చర్య లన్నీ వివరించినాడు. అది విని రాయనము శిస్తు వసూళ్ళకు వెళ్ళిన గ్రామా లన్నిటిలో చాటింపు వేయించి, రాయనము నాగయ్యలవల్ల బాధపడ్డ ప్రజల నందరినీ రప్పించినాడు.

ప్రజలు ఒక్కరొక్కరే వాళ్ళిద్దరూ పెట్టిన హింసలు నివేదించు కొనసాగినారు. వారివల్ల అన్యాయముగా వసూలుచేసి రాజకోశానికి జమ

కట్టిన ద్రవ్యము రాజకోశమునుంచీ, నాగయ్య తీసుకొన్నది అతనివల్ల నుంచీ, తక్కినది రాయసము సొంత కోశము నుంచీ అప్పటికప్పుడే తన కారణాలచేత వాళ్ళ కిప్పించినాడు. ఈ కార్యక్రమము వరుసగా వారము రోజులు సాగినది.

ఈ విధముగా జనసమూహమును ముందు పూర్తిగా తృప్తి పరచిన తర్వాత దండనములు విధించడానికి పూనుకొన్నాడు, బసవరాజు. ముందు వా ళ్ళిద్దరూ చెప్పుకొనేది ఏమైనా ఉన్నదా అని అడిగి, లేదన్న తర్వాత తీర్పు చెప్పినాడు.

నాగయ్యకు జరిగినంత వరకు శిక్ష సరిగానే ఉన్నది కాని అది చాలదు. అతనిని ఆతని ఉంపుడుకత్తెతో తక్కిన మండలాలలో అన్యాయముగా సంపాదించిన ధనముతో సుఖజీవనము చేయనిచ్చుట పాడి కాదు. ఇట్లా అని నాగయ్య ఇంటికి భటులను పంపి కూడబెట్టిన ధనమంతా మూలమూలల ఉన్నది—వెతికించి, తెప్పించి ఒడ్డె ప్రభుత్వపు కోశానికి జమ కట్టించినాడు. నాగయ్య ఉంపుడుకత్తెను రావించి తన దాసీజనములో చేర్చివేసినాడు.

రాయస ప్రభువు దండనము విషయములో బసవరాజు గంగన మంత్రి సూచనలతో ఏ మాత్రమూ ఏకీభవించలేదు. మెరమెప్పులు చూపి విశేషముగా రాజానుగ్రహము సంపాదించవలెననే ఆశతో ప్రజలను పీడించి అక్రమంగా శిస్తులు వసూలు చేసినాడు; ప్రజలు తిరుగుబాటు చేసేట్లున్నారనీ, శ్రీశైలము నుంచి దండయాత్ర రాబోతున్నదనీ అబద్ధపు నివేదనలు పంపినాడు. నాగయ్య వంటి ప్రత్యక్ష నాగము ద్విజిహ్వాత్వము తెలియక ప్రవర్తించినాడని నమ్మే వీలులేదు. కవిసార్వభౌముడు తనకు సమర్పించిన శ్లోకము చదువుకొన్న తర్వాతనైనా ఆలోచించవలసినది. అప్పటికి తెలుసుకోలేదంటే బుద్ధిహీనతను ప్రకటిస్తుంది. అందరి ఎదుట

శ్రీనాథుని మాణిక్యాంగు శీయకము తన చేతికి పెట్టుకుంటున్న నాగయ్యే చర్యను హర్షించినవాడు మోసపోయినా డనుకొనే వీలు లేదు.

అతడు నిస్సందేహముగా ద్రోహబుద్ధితోనే ప్రవర్తించినాడు. బొడ్డుపల్లి కరణము రాచపాడి నిర్దేశించినందుకు, విశ్వాసపాత్రుడైన ఆ గ్రామాధికారిని చెరపెట్టడము క్షంతవ్యము కాదు. ఉపమండలాధిపతి ఎప్పటికప్పుడు న్యాయవిధి సూచిస్తున్నా ఇతడు జనకంటకముగా ప్రవర్తించి నాడు. శ్రీనాథుని కవిపండితులను విద్వద్గోష్ఠి కని పిలిచి అవమానించినందు వల్ల ఒడ్డె ప్రభుత్వానికి తీరని అపకీర్తి దాపురించినది. శ్రీనాథులవారిని దండనము పాలు చేసి వారియ్యవలెనని తాను నిర్బంధించిన శిస్తుచెల్లిస్తామని అంతమంది వస్తే, తీసుకోక దండనము సాగనియ్యడము తెలియక చేసిన పని అంటామా? ఎవరైనా కానీ తన తలుపు బద్దలు కొడుతూ ఉంటే బీరముతో ఎదుర్కొనక పారిపోయి దేవతార్చన గదిలో దాక్కోడము ఎంత నీచపు పని! ఇతని దుశ్చేష్టలు ఇంకా సాగనిస్తే నిజంగానే సామాన్య ప్రజలూ, అధికారులూ కూడా తిరుగుబాటు చేసేవాళ్ళే. ఇతనికి వేసే శిక్ష ఇతరోద్యోగులను విరోధించేదిగా ఉండవలె.

"ఈ రాయసమును వెంటనే ఉద్యోగములో నుంచి తొలగిస్తు న్నాము. ఇతని ఆస్తి నంతా రాజకోశానికి జమ కట్టిస్తున్నాము. ఇతడు చూపిన పిరికిదనము మరి ప్రభువు లెవ్వరూ చేయకుండా ఉండగలందులకు ఈ విధంగా ఆజ్ఞాపిస్తున్నాము. వెంటనే ఇతని తల గొరిగించి మీసము తీసివేయించి ఆడువేషము వేయించి రాజవీథులలో నడిపించి అమరేశ్వర స్వామి ఆలయానికి మూడు ప్రదక్షిణాలు చేయించి స్వామి ముందు సాష్టాంగపడేట్లు చేయించవలె!"

ఆ తీర్పు వినగానే జనమంతా దిగ్భ్రాంతులై బసవరాజు ధర్మ దృష్టిని వేనోళ్ళ శ్లాఘించినారు. మండలమం దంతట ఒడ్డె ప్రభుత్వము

పట్ల ప్రజలకు భక్తిభావము పెల్లుబికినది. దానిని మరింత బలపరచడానికి బసవరాజు గంగన మంత్రి చాతుర్వర్ణ్య ప్రజలకేగాక కులమత విచక్షణ చూపక, ఏ కులానికి ఆ కులము, ఏ శ్రేణికి ఆశ్రేణి ఎవ్వరికీ వారి వారి ఆచారాలకు భంగము లేకుండా భూరిసంతర్పణలు చేయించినారు. అందుకు రాచగాదెలు తెరిపించి ధాన్యాదులు విరివిగా ఖర్చుపెట్టినారు.

# 17

ఇదంతా వారము పదిరోజులపాటు సాగినది. ఈలోగా శ్రీనాథుడు నెమ్మదిగా కోలుకోసాగినాడు.

పోతన, దుగ్గనలు, ఆప్యాయతతో పూర్వస్మృతులు జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఈ పాతికేళ్ళ మధ్య తమ కుటుంబాలలో జరిగిన విశేషాలు, తాము వ్రాసిన, వ్రాస్తున్న, వ్రాయడానికి తలపెట్టిన కృతుల విషయమూ ప్రస్తావించు కొంటున్నారు. అయినా వారిద్దరు ఒక కంట శ్రీనాథుని పరిస్థితులు గమనిస్తూనే ఉన్నారు. సూక్ష్మముగా గమనించిన కొద్దీ, శ్రీనాథునిలో ఏదో పెద్దమార్పు కానవస్తున్నది. అది రోజు రోజూ పెరుగుతున్నది. వారికి ఇది అని తెలియకుండా ఆదుర్దా కలుగసాగినది. ఇప్పటి శ్రీనాథుడు తాము మునుపెన్నడూ ఎరిగిన శ్రీనాథుడుగా లేడు. ఏమిది?

ఆయన ఇప్పుడు ప్రతి విషయములోను ఎంతో నిర్లిప్తత చూపు తున్నాడు. తనవద్దకు వచ్చి పైనబడి కౌగిలించుకొంటున్న కుమారుణ్ణి కూడా ఎక్కువ ముద్దాడుట లేదు. అతడు కూడా తాతలోని మార్పు గమనించి పోతనకు, దుగ్గనకు మాలిమి కాసాగినాడు.

ఒకసారిగా శ్రీనాథునికి ధనమెంతో పోగైనది. పల్నాటివారు 2000 టంకాలు సమర్పించినారు. శాంతయ్య ఐదువేల వరహాలు సమర్పించినాడు.

బసవరావు శ్రీనాధుని పంట సర్వనాశన మయినదని తెలిసి ఆయన వతసిన ఏడువందల టంకాలు బాకీ రద్దు చేయడమే కాక, మొదట చెల్లించిన 1400 టంకాలు రాజకోశమునుంచి ఆయనకు తిరిగి ఇప్పించినాడు. ఎడ్లు అమ్మిన పైకము వెయ్యి టంకాలు వసూలు అయినవి. కార్యకర్త పరిజనము వద్ద నుండి అప్పు తెప్పించిన టంకాలు వెంటనే వాళ్ళకు ఇచ్చివేసినాడు. అమరావతిలోని కవి పండితులు ఆలయములో సభనేసి పోగుచేసిన వెయ్యి టంకాలు మళ్ళీ స్వామి సన్నిధానములో సభచేసి శ్రీనాధభట్టుకు సమర్పించినారు. ఇంతధనము పోగైనా శ్రీనాథుడు ధనము మీద ఏ మాత్రము మమకారము చూపుటలేదు.

అతడు ఈ వారము పది రోజులు అమరావతిలోనే ఉండవలసి వచ్చినది. పూర్వము అంతంతటి మహాదశలు అనుభవించిన వాడు అమరావతిలో—కొన్ని గడియల కాలమే అయినా - మహా నరకబాధ అనుభవించినాడు కదా! దానిని మరపించడానికి గంగనమంత్రి అత్యంత భక్తి ప్రపత్తులు ప్రదర్శిస్తున్నాడు. శ్రీనాథుడు పైకి మామూలు మర్యాదలు నెరపుతూనే ఉన్నా, ఆయనలో ఇప్పుడు ఒకానొక దూరపు చూపు స్పష్టముగా కనిపిస్తూ ఉన్నది.

ఈ వారము పదిరోజులు భూదేవి రేయిం బవళ్ళు ఒకటే తీరుగా విలపిస్తున్నదని వార్త వచ్చినది. దానికి కూడా శ్రీనాథుడు ఉలుకలేదు.

ఆ తర్వాత పోతన దుగ్గనాదులతో కలసి ఆయన బొడ్డుపల్లి వచ్చినాడు. ఆయనను చూడగానే భూదేవి రెండు కాళ్ళూ చుట్టుకొని భోరుమని ఏడ్చినది. ఆమెను నెమ్మదిగా మర్యాదగా లేవదీసినాడు. కాని వెనుకటి మమకారము చూపలేదు. ఆమె దానికి కూడా ఆశ్చర్యపడుతూ లోపలికి పోయినది.

ఇప్పుడు ఆయన ఇంటి సంగతులు, అతిథులకు అందరికి కావలసిన ఏర్పాట్లు అన్నీ కార్యకరణుడే చేస్తున్నాడు. దుగ్గన పైపైన కనిపెట్టి ఉండి

లోపము జరుగకుండా జాగ్రత్త పడుతున్నాడు. శ్రీనాధుడు నిత్యకర్మలకు లోపము లేకుండా చేస్తూనే ఎక్కువ భాగము మహేశ్వర ధ్యానముతోనే ప్రొద్దుపుచ్చుతున్నాడు.

ఇంటికి చేరి నాలుగు రోజులు గడవకముందే శ్రీనాధుడు శుభ దినము నిశ్చయించి శ్రౌత స్మార్త విదులైన బ్రాహ్మణోత్తములను పది మందిని అమరావతి నుంచి సగౌరవముగా పిలిపించి పరిషత్తు ఏర్పాటుచేసి, వారి ఎదుట తాను మహాప్రస్థానము చేయదలచినానని ప్రకటించి అనుజ్ఞ ఇమ్మని వారిని వేడినాడు. ఆ పండితులు శ్రీనాధుని ఎన్నో ప్రశ్నలు వేసినారు. అన్నిటికీ శ్రీనాధుడు వినీతుడై ప్రత్యుత్తరములు ఇచ్చినాడు. వాటిలో కొన్ని ఇవి:

ప్రశ్న: శ్రీనాథభట్టా, మీరు లోకులకు తీర్చవలసిన ఋణములన్నీ తీర్చినారా?

ఉత్తరము: తీర్చినాను. ధనరూప మైన ఋణము నేను ఇప్పుడు ఎవరికీ బాకీలేను. తక్కిన ఋణములనుంచి విముక్తి పొందడానికే ఇప్పుడీ ప్రయత్నము తలపెట్టినాను.

ప్రశ్న: మహా ప్రస్థానము సర్వకర్మ సన్యాసము కంటె కూడా శారీరకముగా కష్టతరమైనది కదా! మరి దీని నెందుకు మీరు కాంక్షిస్తున్నారు?

ఉత్తరము: సర్వకర్మసన్యాసము చేయడానికి నా బుద్ధి ఇంకా పరిపక్వము కాలేదని ఈ పదిరోజుల ఆత్మపరీక్షవల్లను తెలుసుకొన్నాను.

ప్రశ్న: పునరావృత్తి రహిత బ్రహ్మపదము కంటె పునరావృత్తి కల స్వర్గలోకము చేర్చే మహాప్రస్థానము మీదనే అభిమాన మెందుకు కలిగినది?

ఉత్తరము: ప్రస్తుతము నా బుద్ధి అమరలోక యాత్ర కంటె

దూరము ప్రసరించడము లేదు. మహాప్రస్థానము చేసేవారికి బ్రహ్మపదము ప్రాప్తించదని కాని, సన్యసించినవారికి తప్పక బ్రహ్మపద ప్రాప్తి ఉంటుం దని కాని శాస్త్ర నిశ్చయము లేదుగదా!

ప్రశ్న: మీ భార్య గర్భవతి కదా, ఆమె నీ స్థితిలో నిస్సహాయు రాలినిగా వదలిపోవడము ధర్మమా ?

ఉత్తరము: మృత్యువు తానే నన్ను వరిస్తే, ఆమె సంగతి ఆలో చించి చేయగలదేముండేది? ఇప్పుడు నేనే మృత్యువును వరిస్తున్నాను. ఆత్మహత్యాదోషము రాకుండా, ఈ శరీరము మీద నాకు అభిమానము పోయినది.

ప్రశ్న: మీకు కావ్యరచనా వ్యాసంగము మీదను, విద్వత్సంగతి మీదను మమకారము ఉడిగినదా?

ఉత్తరము: ఉడుగలేదు. ఈ లోకములో కంటె అమరలోకములో విబుధ సంగతి అధికతరముగా ప్రాప్తించ గలదనే నా ఆశ. మహాప్రస్థా నము చేయదలచిన వారికి మమకారాలు ఉడుగవలసిన నియమ మున్నదా?

ఆ ప్రశ్న తాను అసంగతముగా వేసినందుకు పరిషత్సభ్యుడు నాలుక కొరుకుకున్నాడు. పరిషత్తు శ్రీనాథునికి మహాప్రస్థానానికి పూర్వాంగా లైన వేదోక్తకర్మ కలాపాలు నిర్వహించడానికి సమర్థులైన ఋత్విక్కులను పిలిపించినాడు.

ముందు శ్రీనాథుడు అప్పుడు తనవద్ద ఉన్న ధనమంతా మూడు సమాన భాగాలుగా విభజించి ఒక భాగము భూదేవి కిచ్చినాడు. ఒక భాగము కుమారుని పోషణాదులకై దుగ్గన కప్పగించినాడు. భూదేవిని తన సొంత అప్పవలెనే చూచుకోవలసినదని దుగ్గన్నకు చెప్పి అతనిమాట తీసుకొన్నాడు. తక్కిన మూడవ భాగము తాను చేయదలచుకొన్న మహా ప్రస్థానము ఖర్చులకు, ఋత్విగ్దక్షిణలకు వేరు చేసి ఉంచి దుగ్గనకు అప్ప గించినాడు.

మహాప్రస్థానము చేయదలచినవారు చేసే పూర్వాంగ క్రతువుకు వైశ్వానరేష్టి అని శాస్త్రసంజ్ఞ. సర్వకర్మ సన్యాసము చేయదలచినవారు చేసే వైదిక కర్మలూ ఇవీ చాలా భాగము ఒక మోస్తరువే.

శ్రీనాథుడు అమరేశ్వరస్వామి దేవాలయములో వైశ్వానరేష్టికి సంకల్పముచేసి ఋత్విగ్వరముచేసి విఘ్నేశ్వర పూజ పుణ్యాహ వాచకములతో ప్రారంభించి ప్రాయశ్చిత్తాదులు కావించినాడు. ఈ కర్మ తతంగమంతా వారము రోజులు పట్టినది. ఈ మహాక్రతువును అద్భుతావిష్టులై చూస్తున్న బసవరాజు, గంగనమంత్రి, అమరావతి బ్రాహ్మణ్యము, పోతన, దుగ్గన— ఎందరో కట్నాలు సమర్పించినారు. ఆ ద్రవ్యమంతా కూడా దుగ్గనకే అప్పగించి ఆ క్రతువు చేయుస్తున్న ఋత్విక్కుల దక్షిణాదికాలకే సెలవు చేయుమని ఆదేశించినాడు. శ్రీనాథుడు వెనక విద్యానగర యాత్ర చేసిన సమయములో ద్రవ్యము ఖర్చు చేసినట్లే యిప్పుడీ అమరలోక మహాప్రస్థానములో కూడా దుగ్గన చేతిమీదుగా మహా వైభవంగా ఖర్చు చేసినాడు.

ఇదంతా దుగ్గనకూ, పోతనకూ అద్భుతంగా ఉన్నది. ఒక వంక కడుపులో వ్రేలుపెట్టి కెలకుతున్నట్లు దుఃఖము వస్తున్నది; మరొక వంక ఆ మహాపురుషుని ఉదాత్తవైఖరికి అద్భుతానందాలు అంతరంగంలో నిండి పొంగులు వారుతున్నవి. వారిద్దరూ తాము రచించ దలచిన కావ్యప్రశంసలు శ్రీనాథునితో చేసి ఆయన సూచనలు గ్రహిద్దామని ప్రయాణమై వచ్చేప్పుడు తలచి ఉన్నారు. కాని అందుకవకాశమే లేకపోయినది. అందుకు వారికి చింత కలుగలేదు. పురాణాలలో విన్నదే కాని మహాప్రస్థానము ఎక్కడా వారు కళ్ళతో చూచినదికాదు, తన మహాప్రస్థానములో శ్రీనాథుడు ప్రదర్శించిన వైదిక కర్మ నిష్ఠయే వారాయనవల్ల పొందగలిగిన మహోపదేశమని వాళ్ళకు నిశ్చయ భావము కలిగినది.

శ్రీనాథుడు అష్టశ్రాద్ధాలు నిర్వర్తించినాడు. ఒక్కొక్క శ్రాద్ధమే చేసిన కొద్దీ శ్రీనాథుడు తమకూ ఈ లోకానికీ దూరమై పోతున్నా డనిపిస్తున్నది.

సాయంకాలమైనది. చివరి సాయంసంధ్యావందనముచేసి గాయత్రిని ఆత్మారోపణము చేసుకొన్నాడు.

చివరి ఔపాసన క్రియ పూర్తిచేసి అగ్నిని ఆత్మారోపణము చేసుకొన్నాడు.

అంతట శ్రీనాథుడు కృష్ణానది నీటిలోకి దిగినాడు.

పోతన, దుగ్గన బావురుమని ఏడ్చినారు. అక్కడ కూడిన జనసమూహములో ఏడ్వనివారే లేరు.

దుగ్గన: కాశికావిశ్వేశు గలసె వీరారెడ్డి
రత్నాంబరంబులే రాయ డిచ్చు?
పోతన: కైలాసగిరి బండె మైలారు విభు డేగి
దినవెచ్చ మేరాజు తీర్ప గలడు?
దుగ్గన: రంభగూడె దెనుంగు రాయరాహుత్తుండు
కస్తూరి కే రాజు ప్రస్తుతించు?
పోతన: స్వర్గస్థుడయ్యె విస్సనమంత్రి మరి హేమ
పాత్రాన్న మెవ్వరి పంక్తి గలదు?
దుగ్గన: భాస్కరుడు మున్నె దేవుని సాలి కరిగె
పోతన: కలియుగంబున నిక నుండ గష్ట మనుచు
దుగ్గన: దివిజ కవివరు గుండియల్ దిగ్గు రనగ
పోతన: అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి!

అంటూ దుగ్గన పోతనలు వాపోయినారు.

చీకటులు క్రమ్ముతున్నవి. ఆకాశములో నక్షత్రాలు ఒక్కటొక్కటే

తొంగి చూస్తున్నవి. సూటిగా ఉత్తర దిక్కున ధ్రువ నక్షత్రము కవిసార్వ భౌమునికి అమరలోక మార్గము చూపుతూ స్పష్టంగా ప్రత్యక్షమైనది.

కృష్ణానదీ జలములో ప్రవేశించిన శ్రీనాథకవి సార్వభౌముడు శిఖా యజ్ఞోపవీతాలూ, కట్టిన పట్టాలూ కృష్ణా జలాలలో విసర్జించి, సాక్షాత్తుగా సదాశివునివలెనే దిగంబరుడై, రెండు బాహువులూ ఆకాశానికి ఎత్తి నీటి నుండి బయటికి వచ్చినాడు. ఆయన దృష్టి ధ్రువునిమీదనే ఉన్నది. ఆయన చెవులు ఋత్విక్కులు పఠిస్తున్న మంత్రాలమీద నిలిచినవి. ఆయన మనస్సు అమర లోకములో లగ్నమయినది.

ఋత్విక్కులంతా ఏకకంఠంగా దిక్కులు మారుమ్రోగేటుగా, "స ఏష యజ్ఞాయుధీ అంజసా స్వర్గలోకం అభియాతి!" అనే మంత్రం పూర్తి చేశారు.

శ్రీనాథుడు తన దృష్టి ధ్రువుని మీదినుంచి మరల్పక ఉత్తరాభి ముఖంగా ఋత్విక్కులతో కలిసి మంత్రపఠనముచేస్తూ నిశ్చలమై గంభీరో దాత్తమైన గజగమనముతో సాగినాడు. ఋత్విక్కులు కూడా మంత్ర పఠనముచేస్తూ ఆయనకు రెండువైపులా అడుగులు వేస్తున్నారు.

"భూః ప్రపద్యే, భువః ప్రపద్యే, సువః ప్రపద్యే .... నమస్తే శిశు కుమారాయనమః"

మంత్రము పూర్తికాగానే ఋత్విక్కులాగిపోయినారు. జనమంతా ఆగిపోయినారు. పోతన దుగ్గనలుకూడా ఆగిపోక తప్పలేదు. వాళ్ళకు పుక్కి లింతలుగా ఏడుపు వస్తున్నది.

"స్వర్గానికి మహానందంతో నడిచిపోతున్న బావను చూసి యిట్లా దుఃఖిస్తున్నాము. మనం ఎంత మందబుద్ధులము !" అని వాళ్ళిద్దరూ తమ్ముతాము మందలించుకుంటూ మళ్ళీ మళ్ళీ ఏడ్వసాగినారు.

శ్రీనాథభట్టు మళ్ళీ మళ్ళీ ఆ మంత్రమే పఠిస్తూ ధ్రువనక్షత్రముమీద నిల్పిన చూపు కిందికి దింపకుండా ఉత్తరంగా నడిచిపోతున్నాడు.

కొందరికి సాక్షాత్తుగా సాంబసదాశివుడే ఆ రూపంగా ఆ సంధ్యా కాలంలో నడిచిపోతున్నా డనిపించినది.

ఆ దిగంబరరోన్నత కాయము చూచినవారు కొందరు మహోన్నతమైన అమరేశ్వరస్వామి జ్యోతిర్లింగమూర్తి దివ్యకళాంశమే ఆలయములో నుంచి నిర్గమించి ఆ విధంగా పోతున్నట్లు భావించినారు.

శ్రీనాథుని దారిలో కృష్ణవేణీ నదీ మహాప్రవాహమే అడ్డముగా ఉన్నది. ఆయన ఆకారము దూరదూరమై చీకటిలో కలిసి అదృశ్యమై పోయినది. త్రేతాయుగంలో శ్రీరామచంద్రమూర్తి ఈ విధంగానే సరయూ నదీ ప్రవేశము చేసినాడు కాబోలు ననుకొన్నారు పోతన దుగ్గనలు.

శ్రీనాథుని శరీరము ఎక్కడ, ఏ విధంగా, పాతమైనదో ఎవరికీ తెలియదు. దన్నదకోటవద్ద పూర్వము పెదకోమటి వేమారెడ్డి భూపాలుడు వీరస్వర్గము పొందిన తావుననే ఉన్నత స్తంభము వంటి పురుషాకార మొకటి అక్కడ ఉన్న అగాధమైన మడుగులో ప్రవేశించడము కనిపించిన దని మాత్రము రేవు పడవ దాటించే పల్లెకారులు కొందరు చెప్పినారు.

# 18

దుగ్గన పోతనలు మౌనంగా బొడ్డుపల్లి చేరుకొన్నారు, వారితోపాటు కార్యకర్త, పిడుగు వీరభద్రయ్య, శాంతయ్య దూతలు మొదలైనవారు వచ్చినారు. వారందరూ భూదేవికి నమస్కరించినారు. కుమారుడు పోతనను గట్టిగా కౌగిలించుకొని వదలి పెట్టలేదు.

ఇప్పుడు భూదేవి వెనుకటి భూదేవి కాదు. ఆమె నామము సార్థకముగా స్థయిర్యము అవలంబించినది. తాను ఈ లోకములో ప్రత్యక్ష రూపంగా అవతరించి చరించిన ఆ అమరమూర్తికి ధర్మపత్నినైన భాగ్యము పొందిన పుణ్యాత్మురాలననే ఉదారభావముతో ప్రవర్తింపసాగినది. ఆ దివ్య

మూర్తి తేజస్సు తన గర్భములో వృద్ధిపొందుతున్నదని సంభావించినది. ఆమె కిప్పుడు కుమారునియందు ప్రీతి అతిశయించినది. వాడు కూడా ఆమె నిప్పుడు క్షణము వదలి ఉండుటలేదు. ఇక్కడ అంత్యేష్టి వ్యవహారాదులు కాగానే దుగ్గన తన ఇంటికి రమ్మనుచు, శ్రీదేవి అక్క పునర్జన్మమెత్తి ఈ రూపంగా ఉన్నట్లు భావించి భక్తితో ఉపచరిస్తానని ప్రార్థించగా ఆమె సమ్మతించినది.

ఒక వంక శ్రీనాథుని అంత్యేష్టి జరుగుచుండగానే, బొద్దువల్లిలో శ్రీనాథుని ఆస్తుల వ్యవహారాలు కట్టిపెట్టి, అక్కడి కాపురము యెత్తివేసే ప్రయత్నాలన్నీ దుగ్గన కార్యకర్త సహాయముతోను, పోతన సలహాతోను పూర్తిచేస్తున్నాడు.

శ్రీనాథుడు తనకిచ్చిపోయిన ధనమంతా దుగ్గన చేతిలోపెట్టి భూదేవి తన భర్త అంత్యేష్టి వైభవముగా జరిపించమన్నది. దుగ్గన ఆ ద్రవ్యము తీసుకొని ముడుపు కట్టినట్లు కుమారుని ద్రవ్యముతోబాటు వేరుగానే ఉంచి, తన సొంత ద్రవ్యముతోనే కవిసార్వభౌమునికి జరుపవలసినంత వైభవంగా కర్మకాండ జరిపించినాడు.

ఇవన్నీ ఒక వంక సక్రమంగా సాగిపోతూ ఉండగానే మధ్య మధ్య దుగ్గన, పోతనలు ఆప్యాయతతో తమతమ కావ్య విద్యావ్యాసంగాలు ప్రస్తావించుకొంటున్నారు.

దుగ్గన తాను రచించిన రెండు కావ్యాల సంగతి పోతనతో చెప్పినాడు. "మొదటిది కాంచీపుర మాహాత్మ్యము. అది చెందలూరి దేవయ మంత్రికి అంకితము చేసినాను. ఆయన గంగయ మంత్రి పినతండ్రి కుమారుడు. రెండవది నాసికేతోపాఖ్యానము. అది గంగయ మంత్రికి అంకితము చేసినాను."

"ఆ రెండవది కఠోపనిషత్తు కథేనా ? ఉపాఖ్యానమన్నావేమిటి?"

"కాదు."

"మహాభారతంలోని కథా!"

"అదీకాదు. నా కొక సంస్కృత మూలము చంద్రగిరి ప్రభువుల గ్రంథకోశాలలో లభించినది. ఇందులో కఠోపనిషత్కథా, భారత కథా కొంత కొంత కలుస్తుంది. నేను కొన్ని చిన్న చిన్న కల్పనలు కూడా చేసి కావ్యము వ్రాసినాను. భారత కథకు విస్తృతిగా భావనచేసి ఉపాఖ్యాన మన్నాను. కథ విను!" అంటూ కావ్యకథ చెప్పినాడు. పోతన చిరునవ్వు నవ్వి "కావ్యము చదవనిది దాని స్వరూపము తెలియ"దన్నాడు. 'నీవేమి వ్రాసినావు?" అని అడుగగా పోతన ఇట్లా అన్నాడు :

"నేనా, ఏవేవో వ్రాసినాను. ఏవీ తృప్తిగాలేవు: భాగవతము వ్రాయ వలెనని ఉన్నది. ధైర్యము చాలడములేదు. వీరభద్ర విజయం వ్రాసినాను. నాకేమాత్రమూ బాగాలేదు. యౌవనంలో చెప్పిన భోగినీ దండకం తలచు కొంటేనే సిగ్గుగా ఉంటుంది. భాగవతము చెప్పగలశక్తి ప్రసాదించగలడనే ఆశతో నారాయణ స్తవము చేస్తున్నాను. ఆ పద్యాలూ తృప్తిగా లేవు. నా కావ్యజీవితమంతా వ్యర్థమయిపోయింది."

వాళ్ళిద్దరు పరస్పరము తాము వ్రాసిన గ్రంథ ప్రతులు ఇచ్చు కొన్నారు. దుగ్గన కావ్యాలు రెండూ పోతన రెండు రోజులలో శ్రద్ధగా పఠించి మిత్రుణ్ణి ఎంతో మెచ్చుకొన్నాడు.

"దుగ్గన్నా, ఎంతవాడవైనావు! నీకు ధర్మనిష్ఠ ఎంత నెలకొన్నది! నీ జిహ్వ పరమ పవిత్రమైన ప్రౌఢితో ప్రసరిస్తున్నది. నీవు ధన్యుడవు. నాకు ఆ అదృష్టంలేదు—మరి నా గ్రంథాలు చదివినావా?"

"చూచినాను పోతన్నా, అధైర్యపడబోకు! అల్పసత్త్వులైన మా బోంట్లు మేమందుకోగల పరిణతి శీఘ్రంగా అందుకుంటాము. నీ బోంట్లు మహాసత్త్వాలు కలవాళ్ళు. మహావృక్షాలవలెనే విస్తరించి విస్తరించి కాని

ఫలపుష్పాలు ప్రసాదించరు. ఆ భోగినీ దండకము ఎవరికీ చూపబోకు! నీ బోటి పుణ్యశాలి నోట రావలసినది కాదది! వీరభద్ర విజయంలో కొన్ని కొన్ని పద్యాలు బాగున్నట్లున్నవి. కవిత్వంలో స్థాయి చిక్కలేదు: నారాయణ స్తవంలో మధ్య మధ్య కొన్ని పద్యాలు బాగున్నవి. ఆ మంచి పద్యాలు వున్న ఘట్టాల స్థాయి తగ్గకుండా రచననిలుపు కొంటే భాగవతము అద్భుతంగా వ్రాయగలుగుతావు. అందుకు ఆ నారాయణమూర్తినే ప్రార్థించు!—ఇక నా కవసమన్నావు .... ఒక సూటి ఐన మార్గంలో నడుస్తుంది. ఋష్యాశ్రమజీవితాల సౌమ్య పవిత్రత, వేద వేదాంత విద్యలు—ఇటువంటి వాటిమీద నా బుద్ధి ప్రసరిస్తుంది. వైవిధ్యం ప్రపచించడము నావల్లకాదు. ఆ వైవిధ్యం ప్రపచించడానికి నీవు తహ తహలాడుతున్నావు. కాలక్రమాన తపస్సువల్ల సాధిస్తావు! సందేహంలేదు, పోతన్నా!"

"దుగ్గన్న అన్నా, నన్ను ఇప్పుడు ఆదేశించేందుకూ, సలహాలిచ్చి సరియైన దారిలో నడిపించేందుకూ, ఆశీర్వదించేందుకూ బావలేడు గదా!—" ఈ మాటలతో పోతనకు గద్గదస్వరము పట్టది. కళ్ళలో నిండిన నీరు తుడుచుకుంటూ ఇట్లా ప్రార్థించినాడు.

"అన్నా, బావ స్థానంతో నిన్ను వేడుకొంటున్నాను. నా కంటే పెద్దవాడవు. తపస్సంపన్నుడవు—నేను భాగవత రచన సమర్థతతో నిర్వ హించేట్లుగా నన్ను ఆశీర్వదించు!"

దుగ్గన్న ముగ్ధుడై పోతన్నను గాఢాలింగనము చేసుకొని అంత ర్హితుడైనట్లుగా మనసారా ఆశీర్వదించినాడు.

ఆ సమయంలో గంగనమంత్రి అక్కడికి "కవీశ్వరులేదో దీర్ఘా లోచనలో ఉన్నట్లున్నారే?" అంటూ వచ్చినాడు. వాళ్ళిద్దరూ లేచి నిలిచి నమస్కరించి విషయము నివేదించినారు గంగనమంత్రి.

"శ్రుతులు విహారదేశములు, సుస్థిరవాక్య పద ప్రమాణ శా
స్త్రతతుల యిక్క, లాగమ పురాణచయమ్ములు కేళిపద్మముల్,
స్మృతులు నివాసముల్, కవినమీహిత సత్కవితాగుణ ప్రసా
దితములు దగ్గుపల్లి కవి తిప్పయ దుగ్గని గద్యపద్యముల్"

అని దుగ్గన కవితను అగ్గించినాడు.

దుగ్గన వినయముతో శిరస్సు వంచి మిత్రునితో ఇట్లా చెప్పినాడు. "పోతనా! గంగయమంత్రీశ్వరుల పుణ్యవిస్తార మెటువంటిదో, ఎరుగు దువో ఎరుగవో, విను.

"శివచింతామయ మంతరంగము, శివ శ్రీపాద పద్మార్చనా
ప్రవణంబుల్ కరపంకజంబులు, శివాపాది ప్రసిద్ధాగమ
శ్రవణోదీర్ణము కర్ణ యుగము, శివప్రాసాద పంచాక్షరీ
వ్యవహారజ్ఞ, రసజ్ఞ యుష్మహిన, సంతామాత్య గంగయ్యకున్."

వీరి ఆశీర్వచనము అమోఘమైనది."

వెంటనే పోతన గోత్రనామాదికస్మరణ పూర్వకముగా గంగయ మంత్రికి అభివాదము చేసి దుగ్గన్న నర్థించినట్లే ఆశీర్వచన మపేక్షించి నాడు. ఆ మంత్రీశ్వరుడు పోతనను ఆత్మీయతతో లేవనీసి, కోరినట్లుగా ఆశీర్వాదము చేసి గాఢాలింగనము చేసుకొని పిమ్మట చిబుకము ఒకచేత పుణుకుతూ రెండవ చేతితో ముంచు దువ్వుతూ ఇట్లా అన్నాడు,

"నాయనా, పోతన్నా, నీ సంగతి దుగ్గన్న నా కెన్నోసారులు చెప్పి నాడు. మీ విద్యానగరయాత్రా విశేషాలు విసుగు లేకుండా వర్ణించేవాడు. వినేందుకు చీకూ విసుగూ ఉండేదికాదు. అందులో శ్రీనాథభట్టు సర్వతో ముఖ ప్రజ్ఞా విశేషాలే కాక, తరచుగా ఆయనే నిన్ను బాలకృష్ణుని అవతార మైన పుణ్యమూర్తివని ఎట్లా సంభావించేవారో ఎంతెంత వర్ణించినాడు! నీవు ఆ చిన్న వయస్సులోనే చెప్పిన వామన విజృంభణము వర్ణించే

పద్యాలూ, నృసింహస్వామి 'చించెన్ హృత్కమలంబు' ఇత్యాది పద్యాలూ ఎన్నెన్ని సారులో విని ఆనందించినాను. ఆ స్థాయిలో భాగవత మంతా నీవు వ్రాస్తే అప్రతిమానంగా ఉంటుంది. ఇప్పుడు శ్రీనాథ కవి సార్వభౌముడు ఈ లోకంలో లేడు. ఇక నీవే కవి నామైకభాజనుడవు!— ఏమన్నాడు వి న్నాయన?—సహజపాండిత్యుడివి! నిత్యమూ మహేశ్వరుణ్ ధ్యానిస్తూ అర్చిస్తూ ఉండు. స్వామి తప్పకుండా నీకాశక్తి అనుగ్ర హిస్తాడు!"

పోతన రెండు చేతులూ భక్తితో జోడించి మహేశ్వర ధ్యానము చేస్తూ ఆలకించినాడు.

## 19

అక్కడ బమ్మెరలో ఎన్నో విశేషాలు జరిగిపోయినవి. పోతన వెళ్ళిన రెండు రోజులకే కేసనకు మళ్ళీ వ్యాధి తిరగబెట్టినది. తిప్పన ఎన్నో వైద్యాలు చేయించినాడు. లాభము లేకపోయినది.

అప్పుడు బమ్మెరకు ఒకానొక జంగమదేవర వచ్చినాడు. ఆయన మంచి స్ఫురద్రూపి. ఆయన మహత్త్వాలను గూర్చి ఊరంతా మోగిపోయి నది. అతనిని దర్శించినంతనే ఆవేశించిన భూతాలు కెవ్వన కేకపెట్టి పారి పోతున్నవి. అతని కరుణార్ద్ర విలోకనము ప్రసరించినంతనే జ్వర పీడి తులు స్వస్థులవుతున్నారు. అతడు చేతితో తాకినంతనే గ్రుడ్డివారికి చూపు వస్తున్నది. కుంటివారు నడుస్తున్నారు. కీళ్ళు పడిపోయిన వాతరోగులు హాయిగా తిరుగుతున్నారు. బమ్మెర గ్రామాన్ని ఉద్ధరించడానికి శివుడే సాక్షాత్తుగా ఆయన ఆకారములో వచ్చినాడని ప్రథ వ్యాపించినది. ఎక్క డెక్కడి వారూ తిరునాళ్ళ ప్రజవలె అక్కడికి మూగుతున్నారు.

ప్రశ్నలడిగేవారు, మగడొల్లని మగువలు, మగువలొల్లని మగలు వివాహము కాని పడుచులు పడుచువాండ్రు, ధననష్టమైన వర్తకులు

కృషి వాణిజ్యాలలో భగ్నమైనవారు, పిల్లలు పుట్టనివారు, పుట్టి నష్టమౌతున్నవారు—ఒకరేమి, అనంతమైన ఈ ప్రపంచంలో ఉన్న రకరకాల ఆర్తులు, కోరికలు కలవాళ్ళంతా జంగమదేవర దర్శనార్థము మూగుతున్నారు.

ఈ సంగతి తిప్పన్న విన్నాడు. తల్లి లక్ష్మమ్మకు చెప్పినాడు. ఆమెకు కొడుకు నేమనను తోచలేదు. తాను పుట్టిన కుటుంబము మెట్టిన కుటుంబము శివభక్తి కలవారగుటచేత ఆమె శివభక్తిలో పుట్టి పెరిగి వర్ధిల్లినది. తామెవరూ ఇష్టలింగధారణము చేసిన వారు కాదు; పైగా అట్టి ధారణము చేసినవారిని దహన కర్మలేని కులహీనులనుగా భావించేవారు. స్మార్తకర్మలేవీలేని జంగములకు శివుడెక్కువ ప్రసాదము చూపునా? అయినా శివలీలలు బహు విచిత్రమయినవి. ఇది తన భర్త ఆరోగ్యానికీ, ఆయుర్దాయానికీ సంబంధించిన విషయము. తన పెద్ద కుమారుడు తిప్పన్న అమాయకుడు. చిన్నవాడు పోతన బొడ్డుపల్లివెళ్ళి ఉన్నాడు. ఏమన గలదు?

"నీ ఇష్టము నాయనా" అన్నది.

ఆది తల్లి అనుమతిగా గ్రహించి వెంటనే తిప్పన్న జంగమదేవర దర్శనార్థము వెళ్ళినాడు. జనము ఆయన విడిది చుట్టూ మూగి ఉంది ఆయన మహత్త్వము పరిపరివిధాల చెప్పుకొంటున్నారు. జాము సేపు ఉన్నా దర్శించే తెరిపి చిక్కలేదు. అప్పుడు జంగమ దేవర శివపూజకు లేస్తున్నాడని జనము లేస్తున్నందున తిప్పన నిరాశతో తిరిగి వచ్చినాడు.

దిగులుతో జరిగినది తల్లితో నివేదించగా, ఆమె కది అపశకునముగా తోచి దిగులుతో కుంగిపోయినది. కాని ఆమె ఏమీ మాటాడక ఊరకున్నది!

ఆ మరునాడు తిప్పన జంగమదేవర దర్శనార్థము పెందలకడనే వెళ్ళినాడు. ఆనాడుకూడా అంతే అయినది.

అంతటితో తిప్పన పట్టు విడువలేదు. ఆ సాయంకాలమే ఆయన విడిదికి వెళ్ళి శిష్యులను ఆశ్రయించి జంగమదేవరను దర్శించి తన ఆర్తి నివేదించుకున్నాడు. శ్రద్ధగా జంగమ దేవర ఆలకించి శివపూజకు లేస్తూ మరునాడు సాయంకాలము ఆ వేళకే రమ్మన్నాడు.

ఆ వ్యవధానములో జంగమదేవర తిప్పన గృహ విషయాలన్నీ ఆ మూలాగ్రంగా తన శిష్యులద్వారా తెలుసు కొన్నాడు.

మరునాడు తిప్పన రాగానే జంగమదేవర చాలా సేపు ఉదాసీనముగా ఉన్నాడు. తిప్పన ఆర్తితో మళ్ళీమళ్ళీ దీనముగా తన తండ్రి జాడ్యము గురించి నివేదించినాడు.

చాలా సేపటికిగాని జంగమ దేవర అతని మాటలే ఆలకించినట్లు లేదు. శివ ధ్యానములో అంత సేపూ నిమగ్నుడై ఉన్నాడు. చివరకు జంగమ దేవర నెమ్మదిగా తల ఊపుతూ చప్పరించినాడు.

తిప్పనకు కొండె లాగిపోయినట్లయినది. ఎంతో ఆతురతతో తన తండ్రి జబ్బు నయము కాదా ఏమి అని ప్రశ్నించినాడు.

"శివ కటాక్షము!"

"దేవరా, మా ఇంటిలో శివభక్తులు కాని వారే లేరు. మాయందు శివ కటాక్షము ప్రసరించదా ?"

"హం! కనబడుతూనే ఉన్నది కదా!"—పరిహాస మిశ్రమమైన చిరు నవ్వు జంగమదేవర నవ్వినాడు.

"మేమేమి అపరాధము చేసినాము జంగమ దేవరా?—మా లోపము ఏదైనా ఉంటే, శివ స్వరూపులయిన తమరు సరిదిద్దలేరా?"

"మా చేతులు దాటిపోయినది!"

"అయ్యో, అయ్యో, అయ్యో! మమ్ములను కటాక్షించండి!- మాకు తరించే దారి లేదా?"

"మా చేతులలో లేదు." జంగమదేవర తల ఊపినాడు.

"మరి దిక్కేమిటో సెలవియ్యండి !"

"అంతా మీ చేతులలోనే ఉన్నది."

"నిజంగానా ? మా తండ్రి ప్రాణం రక్షించడానికి ఏమయినా చేస్తాము".

"మీరు చేయలేరు నాయనా! చేయలేరు!"

"తమ రట్లా సెలవీయ వద్దు. తమరు చెప్పినట్లల్లా చేయగలను."

"అయితే విను. అశాస్త్రీయముగా చేసిన క్రియలు ఏమవుతవి!"

"అవిధినా కృత మకృతమ్" అంటారు కదా పెద్దలు!"

"నేను చెప్పేదీ అదే!"

"అయ్యో, మేము చేసిన శివ పూజలన్నీ విధి విహితముగానే చేసి నామే!—వేదోక్తముగానే చేసినాము."

"కాదు. కానే కాదు. మీరు చేసిన శివపూజ వేద విహితమూ కాదు, ఆగమోక్తమూ కాదు!"

తిప్పన తెల్లబోయి చూస్తుండగా మళ్ళీ జంగమ దేవర ఇట్లా అన్నాడు: "అవును. ధారణలేని వారి శివపూజ భస్మహుత హవ్యము!—"

తిప్పనకు కోపము వస్తున్నది కాని కార్యార్థి కావున తండ్రి వ్యాధి తలపోసి తమాయించుకున్నాడు. జంగమ దేవర ఇట్లా అన్నాడు.

"అవును, "ధారణమ్మే భూయాసమ్" అని ఉపనిషత్తు ఘోషిస్తు ఉంటే లింగ ధారణము చేయని బ్రాహ్మణులు బ్రాహ్మణులేకారు. అట్టి వాళ్ళు అసలు మనుష్యులా, పశువులా?"

ఆ మాటలు విని తిప్పన తెల్లబోయినాడు. అతనికి వేదార్థము తెలిసికోగల సంస్కృత జ్ఞానము లేదు. అయితే జంగమ దేవర ఉదాహ రించిన వాక్యము నిత్యమూ తాను బ్రహ్మయజ్ఞములో చెప్పే మంత్రము

లోనిదే. ఆ మంత్రానికి సరిపైన అర్థము ఇదే కాబోలు. మా పెద్దలంతా ఇంత మాత్రము అర్థము తెలియనివారు కాదే. అందులోని ఆ సూక్ష్మము తెలియనందు వల్లనే కాబోలు, ఈ జంగమ దేవరవలె మహాత్మ్యాలు చూప లేకుండా ఉన్నారనుకున్నాడు.

ఈ విధంగా శ్రుతుల నుంచీ ఆగమముల నుంచీ ఎన్నెన్నో వాక్యాలు జంగమ దేవర ఉదాహరించినాడు.

"బ్రహ్మ విష్ణ్వాదయో దేవా మునయో గౌతమాదయః
ధారయంతి సదాలింగ ముత్తమాంగే విశేషతః
లక్ష్మ్యాది శక్తియ స్సర్వాః శివభక్తివిభావితాః
ధారయం త్యలికాగ్రేషు శివలింగ మహర్నిశమ్."
అని సిద్ధాంత శిఖామణి ఉద్ఘోషిస్తున్నది."
"వినలేదు. అట్లాగా?"

"ఇప్పుడు పరమ రహస్యము. మీమీద అనుగ్రహము వల్ల చెపుతున్నాను, విను. "యథా మృగపతిమ్ దృష్ట్వా వధా ద్భీతోవనేగజః, అదీక్షితార్చితాల్లింగా త్తథా భీతో మహేశ్వరః" అని శాస్త్రము ఉద్ఘోషిస్తున్నది. ఇప్పుడు తెలిసిందా మీరంతా చేసిన శివపూజా ఫలము! మహేశ్వరుడు మీ శివపూజలకు భయపడి పోయినాడు."

తిప్పన జంగమ దేవర వద్ద సెలవు తీసుకొని ఆయన మాటలే మననము చేస్తూ కలవరిస్తున్నట్లు ఇంటికిపోయి తల్లికి జరిగిన దంతా నివేదించినాడు.

"అమ్మా, జంగమ దేవరకు వేదమంత్ర రహస్యాలూ ఆగమ రహస్యాలూ తెలిసినట్లుగా మనవాళ్ళు ఎవరికీ తెలియవమ్మా!" అంటూ తనకు అద్భుతమని తోచిన జంగమ దేవర వాక్యాలు వర్ణించినాడు.

లక్కమ్మ శివభక్తుల ఇంట్లో పుట్టినది. శివభక్తుల ఇంట్లో మెట్టినది.

స్వయముగా శివభక్తురాలు. ఆమె బాల్యము నుంచీ శివభక్తుల సాహసా ద్భుత కథలు ఎన్నెన్నో విని ఉన్నది. తాము వైదికాచార నిష్ఠ కలవారే అయినా, అట్టి నిష్ఠలేని శివభక్తు లెందరెందరో పరమ పవిత్రులైనవారు కలరని ఆమెకు దృఢమైన విశ్వాస మున్నది. తమ కావైదికవిరుద్ధాచారాలు ఆచరణ యోగ్యాలు కాని, సాధ్యమైనవి కాని కాక పోవచ్చును. ఈ జంగమ దేవర కూడా అట్టి అవైదిక భక్తికోటికి చెందిన శివభక్తాగ్రేసరుడు కావచ్చు ననుకొన్నది.

ఆ రాత్రియే కేసన మంత్రికి ఆకస్మికముగా పూర్తిగా స్పృహతప్పి పోయినది. తెల్లవారగానే తిప్పన వెళ్ళి అందరినీ త్రోసుకొనిపోయి జంగమ దేవరను దర్శించినాడు. అప్పటివరకు శివధ్యానములో ఉన్న జంగమ దేవర తిప్పన రాగానే కళ్ళు తెరచి, "నాయనా, తిప్పన్నా, మీ తండ్రి హృదయములోని శివుడు ఇష్టలింగధారణము చేయించమని వలవరిస్తూ, ఇన్నాళ్ళూ అవిధిగా చేసిన శివపూజా విషాన్ని భరించలేక మూర్ఛలో మునిగినట్లున్నాడు. వెంటనే లింగదీక్ష గ్రహించకపోతే స్పృహ రాదు!" అన్నాడు.

సర్వజ్ఞుడు కాకపోతే, ఈయనకు తన తండ్రికి స్పృహ తప్పి ఉన్నది ఎట్లా తెలిసి ఉంటుంది అని ఆశ్చర్యపోతూ అత్యాతురుడై ఇంటికి పరుగెత్తి జరిగిన ఆ అద్భుతము తల్లికి తెలిపి, వెంటనే తండ్రిని జంగమ దేవర సన్నిధికి తెచ్చి లింగదీక్ష ఇమ్మని ప్రార్థించినాడు.

జంగమదేవర సమ్మతించలేదు. "ఈ అపస్మారక స్థితిలో ఉన్న మీ తండ్రికి లింగదీక్ష ఇస్తే ఇష్టలింగమూర్తిని ఎట్లా అర్చించగలడు? వీలు లేదు. ఐనా ఒక ఉపాయము చేయవచ్చు. నీవు జ్యేష్ఠపుత్రుడవు కాబట్టి నీవు కూడా లింగదీక్ష పుచ్చుకుంటే నీ ఇష్టలింగ పూజతోపాటు ఆ పూజకూడా చేయవచ్చు!"

తండ్రిని ఏ విధాన ఐనా బ్రదికొంచుకొనవలెననే ఆతురతతో తిప్పన అందుకు అంగీకరించినాడు. అతడు స్నానముచేసి, తండ్రిచేత విభూతి స్నానము చేయించి, జంగమదేవర పాదము తాను పట్టి తండ్రిచేత పట్టించినాడు. జంగమదేవర కటాక్షవీక్ష విధానముగా ఇద్దరికి ఇష్ట లింగ ధారణముతో శివదీక్ష ప్రసాదించినాడు. తిప్పన నూట పదహారు వరహాలు గురుకట్నముగా అర్పించుకొని తండ్రిని ఇల్లు చేర్చినాడు. అనాటి నుండియే జంగమదేవర ఉపదేశించిన విధానముతో ఇష్టలింగమును కరతలమందుంచుకొని పూజ చేయడము ఆరంభించినాడు. తాను పూజ చేసుకొనే సమయములోనే, ఒడలు తెలియకున్న తండ్రి ఇష్టలింగమును గూడ ఆయన పాణిలో వుంచి ఆ లింగమూర్తికి కూడా ఏక కాలములో పూజచేయసాగినాడు..

దానితో వారి ఇంటిలో అనూచానముగా వస్తున్న శివపూజా విధానమంతా తలక్రిందులైనది. వారి ఇంటిలో దేవపీఠముమీద శివ పంచాయతన పూజచేసే సంప్రదాయ మున్నది. మధ్యలో శివబాణమూ, విష్ణు స్థానములో సాలగ్రామమూ, ఆదిత్య స్థానములో స్ఫటికమూ, గణపతి ప్రతీకగా శోణా నదిలో లభ్యమయ్యే ఎర్రనిశిల, అంబికా స్థానములో యథా సంభవముగా నర్మద బాణమూ నిలిపి పూజ జరుగుచున్నది. వీరశైవ దీక్ష పొందిన తిప్పన ఇప్పుడు పీఠార్చన చేయడానికి నిరాకరించినాడు. లక్కాంబ ఎంత చెప్పినా అతడు వినలేదు. ఏమిచేయగలదు? పోతన ఇంటిలోలేడు. స్మార్తుల ఇళ్ళలో స్త్రీలు శివలింగములను, సాలగ్రామములను తాకరాదనీ, వాటికి మహానివేదన చేయకుండా ఉండరాదనీ విశ్వాసము దృఢముగా వున్నది. ఆమె తహతహ లాడిపోయి తానే దేవపీఠము వద్ద దీపారాధన చేసి ప్రతీకలను తాకకుండా గంగ పుష్ప ధూపదీపాలు సమర్పించి మహానివేదన చేసినది.

అప్పుడు మరి ఒక చిక్కు వచ్చినది. పితార్చనలో శివునికి నివేదించిన అన్నము తాను తాక నని తిప్పన్న నిష్కర్ష చేసినాడు. విధిలేక లక్కాంబ తన పెద్ద కోడలు దమ్మక్క చేత వేరుగా వంట చేయించి తిప్పన ఇష్టలింగానికి మహా నివేదనకు సిద్ధము చేయించినది.

ఈ విధంగా బమ్మెరవారి ఇంటిలోని దేవతలకు రెండు వంట లారంభమయినవి. స్మార్త-కుటుంబములో ఒకరిద్దరు వ్యక్తులు ఇష్టలింగ ధారణము చేస్తే కుటుంబములో కలిగే అవశ్రుతుల పరంపరకు ఈ రెండు వంటలు మొదటి భూమిక. దీనితో ప్రారంభమైన భిన్న దృష్టి ఇంకా ఎన్నింటికో ప్రాకసాగినది.

ఇన్నాళ్ళు లక్కాంబ ఆ ఇంటిలో ప్రత్యక్షముగా అవతరించిన గౌరీ దేవత వలె అందరి మన్ననలు పొందుతున్నది. ఆమె ఈ యింటిలో అడుగు పెట్టిన నాటిగా అత్తమామలు గాని, భర్తగాని పల్లెత్తు మాట అన డానికి ఎన్నడూ అవకాశ మీయలేదు. ఆమె సంతానవతియై అత్తమామలు గతించిన తర్వాత ఆమె గృహలక్ష్మిగా ఉండి తన మాట మీద సంసారము సాగిస్తున్నది. ఇన్నాళ్ళకు నేటికి తన జ్యేష్ఠ పుత్రుడే—తనను భక్తిప్రపత్తులతో పూజిస్తూ వచ్చిన తన కొడుకు తిప్పన్నే ఇప్పుడు తన్ను "భవి" అంటున్నట్లూ, అధఃకార భావముతో చూస్తున్నట్లూ ఆమెకు స్పష్టపడ్డది. ఇక ఇప్పుడీ ఇల్లు తన మాట మీద నడపడానికి అనుక్షణమూ ఏదో చిక్కు ఎదురవుతున్నది.

ఏమైనా తన భర్త ఈ గండము నాటి గట్టెక్కితే చాలు. ఆ పైన ఈ సంసార భారమంతా కొడుకులకూ, కోడళ్ళకూ అప్పగించి, తాను ఎవరైనా పిలిచినప్పుడు భోజనము చేస్తూ, నిరంతర శివధ్యానముతో కాలక్షేపము చేయవలె నని నిశ్చయించుకొన్నది.

తిప్పన్న భార్య దమ్మక్క ఎంతో యోగ్యురాలు. ఆమె అత్తగారి

బాధ గ్రహించి తిప్పన్నకు ఎన్ని విధాలనో చెప్పి చూచినది. లాభము లేక పోయినది.

కేసన రుగ్మతతోనే వారి యింటిలో వైశ్వదేవము కట్టుపడినది. ఆయన ధార్యములోని అగ్ని ఎన్నడో చల్లారి పోయినది.

తిప్పన మాత్రము మాతృభక్తి లేనివాడా? కాడు. ఎట్లయినా జంగమదేవర ఉపదేశము తు. చ. తప్పకుండా ఆచరించి తండ్రిని బ్రతికించుకోవలెనని అతని తహతహ. "భవులకు సర్వసాధారణమైన అజ్ఞానముచేత తల్లికి ఏవేవో శంకలు సహజంగా కలుగు తున్నవి. శివదీక్షితుడైన తాను వాటికి లొంగిపోయి తండ్రికి ప్రాణాపాయము కలిగించరాదు! తల్లిదండ్రులు నిస్సందేహంగా పూజార్హులే. గురు వంతకంటే పూజా పాత్రుడు. గురు వాక్యము వేదము కంటె ప్రమాణభూతమైనది. జంగమ దేవర అనుగ్రహించి తనకూ, తండ్రికీ నిజమైన శివత్వము ప్రసాదించి నాడు. అది మరువరాదు." ఈ విధంగా ఉన్నది తిప్పన ఆలోచనా స్రవంతి!

తన పెద్ద కుమారుడు అమాయకుడని లక్కమ్మ ఎరుగును. అనూచానాచారాలు భ్రష్ట మవుతున్న వని ఒకవంక భయము. ఈ విధంగా నైనా భర్త బ్రదుకుతాడేమో అనే ఆశ ఇంకొక వంకా, ఈ రెండిటి మధ్య ఆమె మనస్సు ఉయ్యాల ఊపులో వలె తిరుగుడు పడుతూ ఉండగా, చిన్న కుమారుడు పోతన రాకకై తహతహ లాడుతున్నది.

ఆమె పెద్ద కుమారుడు చేసిన ప్రయత్నమే వృథా ఐ తన భర్తకు ప్రమాద మేమైనా సంభవిస్తే లక్కమ్మ సహగమనానికి నిశ్చయించుకొని ఉన్నది.

# 20

అక్కమ్మ కేసన మంత్రికి జబ్బు చేసినదని బంధువులకు కబురంప మని తిప్పనను తొందర చేసినది. అతడు వినిపించుకోలేదు. "అమ్మా! నాన్నకు త్వరలో నయమవుతుందమ్మా. గురు జంగమ దేవర సెలవిచ్చి నారు. భయపడకు!" అని అమాయకంగా అంటున్నాడు. చూసి చూసి ఆమె తానే పోతన్నకూ, అడుసెత్తగారింటికీ, సోదరునకూ కబురు చేయించి నది. అందరిలో ముందు చూడవచ్చినది ఆడుబిడ్డ సోమిదేవమ్మ.

ఆమె ఎనభై ఏళ్ళ పండు ముత్తయిదువ. ఆమె భర్త సోమయాజి తన అగ్నిహోత్రాలకు భంగము వస్తుందని పంపడానికి మొదట ఇష్టపడ లేదు. తమ్మునికి ప్రమాదముగా ఉన్నది. చూచి వస్తానని పోరుపెట్టినందున పంపక తప్పలేదు. ఆమె ఓరుగల్లు నుండి సవారీలో వచ్చినది. ఆమె ఇంటిలో అడుగు పెట్టగా ఆ రూపములో వేదమాత అవతరించిన దని లక్కాంబకు తోచి ధైర్యము కలిగినది. ఆడుబిడ్డకు ఆదర గౌరవాలతో పాదప్రక్షాళనాదిక మర్యాదలు జరిపినది. ఇద్దరూ ముంచుకొని వస్తున్న కన్నీళ్ళాపుకుంటూ పైట చెరగులతో కళ్ళద్దుకొంటున్నారు

పాదప్రక్షాళనము చేసుకొన్నదే తడవుగా సోమిదేవమ్మ తమ్ముడున్న ప్రదేశానికి వెళ్ళి పలకరించినది. కేసన కళ్ళు మూసుకొని ఉన్నాడు. పలకలేదు. ఆమె కన్నీళ్ళు కారుస్తూ తమ్ముని ముఖమూ రొమ్మూ ప్రేమామృతం వర్షిస్తున్న తన చేతులతో మృదువుగా ముమ్మారు నిమిరినది. దుప్పటి కప్పి ఉన్న తమ్ముని రొమ్ముమీద ముమ్మారు ఇష్ట లింగపు సజ్జ కఠినంగా తాకినది. ఏమిటా ఇది అని దుప్పటి ఎత్తి చూడగా అది ఇష్టలింగపు సజ్జ! ఆమె బుసలుకొట్టుతున్న తాచుపామును అక్కడ చూచినట్లుగా రివ్వున లేచి నిలుచున్నది. పక్కకు తిరిగి చూడగా అక్కడ నిలుచున్న తిప్పన మెడలో కూడా సూత్రానికి వ్రేలాడుతున్న ఇష్టలింగము కనపడ్డది.

సోమిదేవమ్మ పరమ నైష్ఠికురాలు. ఆమె మాటలు ఆ యింట్లో కేసన్న, లక్కమ్మ తలమీద ధరించి గౌరవించేవాళ్ళు. తక్కిన వాళ్ళ చెప్పనే అక్కరలేదు. ఆమె యిప్పుడు కోపము పట్టలేక పోయినది.

“ఒరే తిప్పా, నీవు కులభ్రష్టువై జంగాలలో కలిసిపోయిందే కాక స్పృహ పోయిన నా తమ్ముణ్ణి కూడా భ్రష్టుణ్ణి చేశావుటరా, చండాలపు పనికిమాలినవాడా!” అని ఆరంభించి నానా తిట్లూ తిట్టినది. తిప్పనకు ఒళ్ళు మండిపోతున్నా మేనత్తకు ఆ యింట్లో ఉన్న పెద్దరికాన్ని బట్టి ఎదురాడ డానికి సాహసించక తల వంచుకొన్నాడు.

సోమిదేవమ్మ తిప్పనను తిట్టి తిట్టి చివరకు తమ్ముని మెడలో ఉన్న లింగసూత్రము తెంపి అవతల పారవేస్తా నంటూ మంచము దగ్గరకు వచ్చినది. అంతవరకూ ఓర్పు పట్టి ఉన్న తిప్పన కిప్పుడు ఆవేశము వచ్చినది. కనురెప్పపాటు వ్యవధానంలో చూరులో ఉన్న కత్తితీసి, తన తండ్రి లింగసూత్రము ముట్టుకొంటే నరికివేస్తానని అత్తమీదికి లేచినాడు

“ఓరి భ్రష్టపు వెధవా, లింగధారణ చేసి వీరవ్రతము పూనడంకంటె కాటికి కాలు చాచి ఉన్న పెద్దదాన్ని నన్ను చంపడము ఎక్కువ పాప మటరా, కుంకా! చంపరా నన్ను!” అంటూ ఆమె శివశక్తివలెనే నిలువున నిలుచున్నది. ప్రక్కనే లక్కమ్మ, దుమ్మక్క, ఎల్లమ్మ-అంతా గోల పెడుతూ తిప్పన్నను వారిస్తూ అడ్డం వచ్చారు. అసలు తిప్పనకు ఆ తను చంపడానికి ధైర్యం చాలలేదు. అతడు బావురుమని ఏడుస్తూ, అత్తమీది కెత్తిన కత్తిని తన మెడకే తగిలించుకొని, “మా నాన్న మెడలో లింగ సూత్రం తెంపితివా, నా తల నరుక్కొంటాను. ఇదుగో!” అంటూ ఆవే శంతో కేక పెట్టినాడు.

దానితో సోమిదేవిలో ఆకస్మాత్తుగా మార్పు వచ్చినది. ఆమెకు తిప్పన్న మీదనే మొదటినుంచీ, ఇంటికి పెద్ద పిల్లవాడని, ఎక్కువ అపేక్ష.

అతడు తల నరుకుకొంటానని బెదిరించగానే ఆమెజంకిపోయినది. "బ్రాహ్మ ణ్యము వదలి జంగములలో కలిసినవానికి స్త్రీ హత్యా-ఆత్మహత్యా పాపాలు ఒకలెక్కలోనివా! నిన్ను చంపుకోనిచ్చిన పాతిత్యము మధ్య నాకెందుకురా, చండాలుడా! నీ యిష్టము వచ్చినట్లే ఏడ్చుకో!" అని ఇవతలికి వచ్చేసినది. అప్పుడు తిప్పన శాంతించినాడు.

సోమిదేవమ్మ ఇప్పుడు ఒకటే ఏడుపు. పండువంటి వైదికాచారాన్ని తిప్పన్న పాడుచేసి మంటకలిపినాడని! అప్పటినుంచీ క్షణ క్షణమూ ఇంటిలో ఒకటే గొడవ సాగుతున్నది. కేసన వ్యాధికంటె ఈ గొడవ ఎక్కువ బాధ కలిగిస్తున్నది ఇంట్లో అందరికి! అంతర్యములో లక్కమ్మ ఆడుబిడ్డ పక్షమే కాని పైకి పెద్ద కొడుకును ఏమీ అనలేక నోరు నొక్కు కుంటున్నది.

తిప్పన్న శాంతించిన తర్వాత లక్కమ్మ ఆ సాయంకాలము అత నితో ఏకాంతముగా ఇట్లా అన్నది: "నాయనా, మీ అత్తచెప్పేది నిజమేరా, జంగమదేవర పాదాలు పట్టినావు, మీ నాన్నచేత పట్టించినావు. ఇంతకూ మీ నాన్న వ్యాధి ఏ మాత్రమయినా తిరుగు ముఖము పట్టినదటరా, లేనిపోని ఆశే కాని!"

తిప్పనకూ అదే సందేహము కలుగుతున్నందువల్ల నెమ్మదిగా "అమ్మా, ఏ మున్నదమ్మా ఇందులో? అది ఒక తాయెత్తువంటిదని సరిపుచ్చు కోరాదటమ్మా!" అన్నాడు.

"తాయెత్తుకైతే రెండు వంట లెందుకు తండ్రీ!" అని ఆమె అంటూ వుంటే జవాబు చెప్పలేక వినిపించుకోకుండా అక్కడి నుంచి వెళ్ళి పోయినాడు.

అప్పటికే పినతండ్రి ఇమ్మడి తిప్పనకు ఎంతో చెప్పి చూచినాడు.

ఆ జంగమదేవర చేస్తున్న మహాత్త్వాలు ఒకవంక ప్రచార మవుతుండగా, వేరొకవంక ఆయనదంతా భేషజమనీ, మోసము కూడా ఉన్నదని ప్రచారము జరుగుతున్నదని గుర్తుకు తెచ్చినాడు. కళ్ళున్నవానినే పూర్వ సంకేతముతో అంధుడైనట్లూ ఆతురుడై ఆశ్రయించినట్లూ రప్పించి కన్నులు తాకి చూపు వచ్చేట్లు చేసి, అదంతా తన మహత్త్వమైనట్లు శిష్యులచేత ప్రచారము చేయిస్తున్నాడని కొందరు గుసగుసలాడటము తాను విన్నాననీ, అదే నిజమని తనకు సందేహముగా ఉన్నదనీ, అంతా ఊళ్లో ఎరిగిన గుడ్డి భిక్షుకునకు ఎందువల్ల చూపు తెప్పించలేకపోయినాడో బాగా ఆలోచించుకోమనీ, ఆయన తక్కిన లోకోత్తర మహత్త్వాలు కూడా దానికి తుల్యమైనవే అని తన విశ్వాసమనీ, ఇంతకూ మీ నాన్న ఆరోగ్యము ఒక్క పిసరైనా బాగు పడ్డదేమో నీవే ఆలోచించుకోరా!" అని చాలా దూరము చెప్పినాడు. తిప్పన తన మూర్ఖత్వము వదలకపోగా గుడ్లెర్రజేసి పినతండ్రి వంక చూచినాడు. అన్న కుమారుడు తనతో అవినయముగా ప్రవర్తించడము సహించక వదినగారితో జరిగినది వివరించి తానిక జోక్యము కలిగించుకోనని విన్నవించినాడు.

ఇంతలో ఒకనాడు లక్కమ్మ అన్న గోపన్న బావను చూడడానికి బమ్మెర వచ్చినారు. జరిగిన విషయాలన్నీ లక్కమ్మా, సోమిదేవమ్మా వివరించినారు. అతడుకూడా తిప్పన పినతండ్రి ఇమ్మడివలెనే చెప్పి చూచినాడు. మేనమామ మాటకూడా వినలేదు. అతడు అక్కడ ఇకఉండలేక కంట తడి పెట్టి చెల్లెలిని ఓదార్చి, "చెల్లీ, నీకు వచ్చిన ఆపద చూడలేకున్నాను. ఇంటికి వెళ్ళుతానమ్మా! త్వరగా పోతనను పిలిపించు!" అని దిగులుతో వెళ్ళిపోయినాడు.

# 21

ఎప్పుడూ ఏమాత్రమూ పొరపొచ్చెము లేకుండా శాంతంగా వుండే తన యిల్లు ఈ విధంగా అపశ్రుతులతో విరసంగా ఉన్న సమయంలో, తండ్రికి వ్యాధి తిరగబెట్టినదనే వార్త అందుకోకుండానే పోతన బమ్మెర గ్రామము చేరుకున్నాడు. దారి పొడుగునా అతడు శ్రీనాథభట్టు అవసాన దశను గూర్చియే ఆలోచించుకుంటూ కలలో నడుస్తున్నట్లు నడుస్తూ తిరిగి వస్తున్నాడు. పోతనకు శ్రీనాథభట్టులో వైదిక నిష్ఠ మూర్తీభవించినట్లుగా తోస్తున్నది. గృహస్థధర్మము అంత వైభవముగా నడిపినవాడు పోతన దృష్టిలో మరి ఎవరూ గోచరించలేదు. శివకేశవులలో శివునియందు అభిమానమున్నా ఇద్దరి యెడలా సమాన దృష్టి, వైదిక విద్యా సంపన్నత, వైదిక ధర్మనిష్ఠమైన వర్తనము నిర్వహిస్తూ జీవితం మహాప్రస్థానముతో సమాప్తి చేసుకోవటముతో నిశ్చంచలమైన ఆయన వైదిక ధర్మ నిర్వాహణము పరాకాష్ఠ నందుకొన్నది. తురీయాశ్రమములకేగాని సాధ్యపడని నిర్లిప్త భావము శ్రీనాథుడు తన చివరి రోజులలో అందుకోవడము ప్రత్యక్ష్యంగా చూచినందువలన, అది పోతనను ఎంతైనా ఆకర్షించినది. నిజమైన భక్తి మార్గములో ఆమరణాంతము చరించినవాడు — తనకు తెలిసినంతలో — శ్రీనాథుడొక్కడే. పూర్వము గర్భవతియైన శ్రీదేవిని పుట్టింటికి పంపుతూ, కాలధర్మము పొందిన తన ప్రభువు పెదకోమటి వేమారెడ్డి వంశములో రాజరికము నిలిపే ప్రభుకార్యార్థమై, రెడ్ల కటారి నందికంత పోతరాజును తిరిగి కొండవీటికి తీసుకు రావడానికి రాజుకొండకు ప్రయాణమైనాడు. ఇప్పుడు మళ్ళీ గర్భవతియైన భూదేవిని నిశ్చింతగా వదిలి అమర లోకానికి ప్రయాణమైనాడు. దిగంబరుడై సాంబసదాశివునివలె కృష్ణా తీరములో ధ్రువనక్షత్రము మీద దృష్టి ఏకాగ్రంగా పెట్టి సాగిపోయిన కవిసార్వభౌముణ్ణి తలచుకొన్నప్పుడల్లా పోతనకు రోమహర్షముతో పాటు

కన్నీళ్ళు జడిగా కారుతున్నవి. అవి శోకబాష్పములో, ఆనందబాష్పములో పోతనకే తెలియకున్నవి. మధ్య మధ్య ఆ మహాప్రస్థానము చేసినది శ్రీనాథుడు కాక తానే ఏమో అని అనిపిస్తున్నది. పోతన కంత తాదాత్మ్యము కలిగినది.

ఈ ఊహా పరంపరతో నిద్రలో నడుస్తున్నట్లు వస్తూన్న పోతన బమ్మెర ఊరిబయట లక్కసాని చెరువు చేరేప్పటికే, తండ్రి చాలా ప్రమాద స్థితిలో ఉన్నాడనే వార్త విన్నాడు. అది చబుకుతో వీపు చరిచినట్లు అయి పోతనను స్వప్నప్రపంచములో నుంచి ఒక్కపెట్టున బలవంతముగా ఈ ప్రపంచములో పడవేసినది. చీకటి పడేవేళకు ఇల్లు చేరుకొన్నాడు.

పోతన ఇల్లు చేరగానే, ఇంటి వాతావరణము తండ్రి రుగ్మత వల్ల కలిగిన దుఃఖము వల్ల నేకాక ఏదో ఒక అవ్యక్తమైన ఆందోళనతో బిర్ర బిగిసి ఉన్నట్లు పోతన గమనించినాడు. కాళ్ళు చేతులు కడుగుకొని శుచియై తండ్రిని చూడబోయిన క్షణములోనే ఆయన కంఠములో లింగసూత్రము కంటబడినది. ఆశ్చర్యముతో తలయెత్తి చూడగా అన్న మెడలో కూడా కనబడినది. మరింత ఆశ్చర్యముతో తల్లివంక చూచినాడు. ఆమెకు లేదు. దానితో వెంటనే ఇంటి వాతావరణములోని అపశ్రుతికి కారణము స్ఫురించినది. ఈ చిక్కు ఏ కారణంచేత సంభవించినదో కూడ అతడు దిఙ్మాత్రంగా ఊహించుకో గలిగినాడు. అన్న తిప్పన్నకు ఆవేశ ఎక్కువ. తండ్రిని ఎట్లా అయినా బ్రతికించుకోవలె ననే ఆతురతతో అమాయకంగా అన్న ఈ పనిచేసి ఉంటాడు. తండ్రి శరీరస్థితి పరీక్షించగా ఆయన ఎక్కువ కాలము దక్కునట్టుగా తోచలేదు. ఇంతవరకు సోమిదేవమ్మ కాని, లక్కమ్మకాని ఊహించకపోయిన ఎన్నెన్ని కల్లోలాలకు తన కుటుంబములోను, బంధువర్గములోను ఇది దారి తియ్యగలదో పోతన స్పష్టంగా ఊహించుకొని విచారపడుతూ మౌనము వహించినాడు.

అన్నకు తనమీద ఎంత ప్రేమ ఉన్నదో తాను ఎరుగును. తనకు అన్నయందు గాఢ ప్రేమతోపాటు గౌరవముకూడా ఉన్నది. అన్న మనసు సూటిగా ప్రవర్తిస్తుందేకాని, తికమక లెరుగదు. అట్టి అన్నను చిన్నవాడు తానేమి అనగలడు! అన్న మనస్సు అడవి గుర్రము వంటిది. దానిని పూజ్యురాలయిన తన వదినగారూ, పరదేవతా స్వరూపురాలైన తల్లిగారూ సాధారణంగా ఒకదారిలో పెట్ట గలుగుతుండేవారు. ఈ సందర్భములో మాత్రము వాళ్ళ ప్రయత్నాలు ఫలించినట్లు లేదు. పైగా వేదమాతవలె మోమోటము తెలియని మేనత్త సోమిదేవమ్మ తన సహజ కఠిన సత్యోక్తులతో చిక్కును మరింత వక్రింపజేసి ఉంటుంది. ఆమె ఇప్పుడు మూతి ఇంత పొడుగు చేసుకొని మౌనము వహించి దూరదూరంగా ఉండటము కనిపెట్టి, ఇంటిలో ఏదో పెద్ద తుపాను రేగి అణగి వుంటుందని పోతన ఊహించుకొన్నాడు.

"సోమిదేవమ్మత్తా, ఎప్పుడు వచ్చావు?"

"ఐదు రోజు లైందిరా, నాయనా!" అంటూ కంట తడిపెట్టి ఆమె భోరుభోరున విలపించసాగినది.

ఆ రాత్రి భోజన సమయంలో అంతా మౌనముగా వున్నారు. ఆ తరువాత లక్కమ్మా, సోమిదేవమ్మా, తక్కిన స్త్రీలు భోజనాలు చేస్తూ జరిగిన సంగతులన్నీ క్లుప్తముగా పోతనకు ఎరుక పరిచినారు. పోతనకేదో ఆశ కలిగి ప్రశ్నించినాడు.

"ఇంతకూ ఆ జంగమదేవర ఈ ఊళ్ళోనే ఉన్నాడా ?"

వదిన దమ్మక్క అన్నది. "ఈ సాయంకాలమే మీ అన్నయ్య ఆదుర్దాతో జంగమదేవర దర్శనార్థము వెళ్ళి విచారించినారు. గడచిన రాత్రియే ఆయన తన శిష్య బృందముతో ఇతర శిష్యులను అనుగ్రహించడానికి వెళ్ళిపోయినా రని విడిది చేసిన ఇంటివారు చెప్పినారట. ఆయన ఎటు పోయినదీ జాడ కూడా తెలియ రాలేదని చెప్పినారు, పోతయ్యా !"

"అయ్యో!" అని పోతన నిట్టూర్పు విడిచినాడు.

వారట్లా మాట్లాడుతూ వుండగానే, అవతల కేసన పెద్దగా మూలిగిన గొంతువినబడి అంతా త్రుళ్ళిపడ్డారు. సోమిదేవమ్మ, అక్కమ్మ, దమ్మక్క, ఎల్లమ్మ అంతా తింటున్న అన్నాలు విడిచి లేచి చేతులు కడుక్కొన్నారు. వారము రోజుల మధ్య కేసన గొంతు వినపడనేలేదు. ఇదేవో వికటించటమే అని వారికి భయమైనది.

పోతన వణుకుతున్న కాళ్ళతో తండ్రి వద్దకు పరుగెత్తి వెళ్ళి పలుకరించినాడు. అన్న తిప్పన అక్కడనే వున్నాడు.

కేసన ముఖములో పోతనను గుర్తించి తృప్తిపడ్డ లక్షణము కనిపించినది. మాటలాడ ప్రయత్నించినాడు కాని మాట పెకలలేదులేదు. ఎడమ పార్శ్వము చచ్చుపడి ఉన్నది. ఆయన కుడిచేయి రొమ్ముపై బరువుగా ఉన్న ఇష్టలింగమును తీసివేయడానికి తడువుకొంటున్నట్లు కనిపించినది. అది గమనించి పోతన నెమ్మదిగా లింగసూత్రము తొలగించటానికి వంగి స్పృశించినాడు. అంతలో తిప్పన హుంకారము విని ఉలికిపడి తలయెత్తి అన్న క్రోధారుణలోచనాలు దీపము కాంతిలో చూచి ఆగిపోయినాడు. కేసన మంత్రి శరీరముమీద నల్లటి కప్పు ఆవేశించినది.

సోమిదేవమ్మ అక్కడకు వస్తూనే తమ్ముని స్థితి గమనించి, "అట్లా చూస్తారేమి నాయనా, భూశయనము చేయండిరా!" అని పెద్దపెట్టున ఏడ్చినది.

పోతన దర్భాస్తరణము పరచినాడు. కుమారులిద్దరూ పట్టుకొని కేసనమంత్రిని దక్షిణ శిరస్సుగా భూశయనము చేసినారు. తిప్పన తన దృఢ దీర్ఘ బాహువులతో తండ్రి శిరస్సును, కంఠమును, బాహువులను, వక్షఃపార్శ్వభాగములను పొదివి పట్టినాడు. పోతన తండ్రి పాదములను

శిరస్సున చేర్చి తన కోమల బాహువులతో పాదముల నుండి కటిప్రదేశము వరకు పూని పట్టినాడు. ముందు పాదములే దర్భాస్తరమున అనినవి.

హృదయములోనుండి పొంగివస్తున్న దుఃఖమును లక్కాంబ ప్రయత్నపూర్వకముగా నిగ్రహించు కొంటున్నది. పతి అవసాన సమయములో పత్ని ఏడ్చినచో, భర్తకు సద్గతి కలగడానికి అవరోధము కలుగుతుందని పెద్దలవల్ల విని ఉన్నది. అదికాక తాను భర్తతో సహగమనము చేసి పుణ్యవతియై స్వర్గధామము చేరుకొన నిశ్చయించుకొన్నది.

సోమిదేవమ్మ మాత్రము తమ్ముని లలితమూర్తిని బహుకళా విధిత్వము తలచుకొని తలచుకొని వాపోతున్నది. కేసన తమ్ముడు ఇమ్మడి దగ్గరనే నిలుచుండి కన్నీరు తుడుచుకొంటున్నాడు.

తండ్రి కుడిచెవి ప్రక్కన చేరి తిప్పన శివనామ స్మరణ చేస్తున్నాడు. పోతన, అన్న ప్రక్కనే కూర్చుండి, నారాయణస్మరణ చేస్తున్నాడు. వారి ఇంటిలో అందరూ శివభక్తులే అయినా మరణ మాసన్నమయిన వారి చెవులలో నారాయణ నామము ఘోషించుటే సంప్రదాయము.

ఇంతలో మేనత్త తులసితీర్థము తెచ్చి తిప్పన కందీయ బోయినది. తిప్పన అటువైపు చూడక తల ప్రక్కకు తిప్పుకున్నాడు. అది గమనించి పోతన వణకుతున్న చేతులతో, ఆ రాగిపాత్ర అందుకొని అన్న నిషేధించునేమో అని జంకుతూ, అతనివంక క్రీగంట చూస్తూ, తులసి తీర్థ ముంచినాడు. అది గుటక పడినంతనే పోతన మేనత్తతో కలసి నారాయణ నామస్మరణము సాగించినాడు. తిప్పన శివనామస్మరణమే చేస్తున్నాడు. లక్కమ్మ శివనారాయణ స్మరణము చేస్తున్నది.

ఇంతలో దిప్పనకేదో స్ఫురించి చప్పున లేచి వెళ్ళి పెరటిలోనుంచి బిల్వదళములు కోసి తెచ్చి బిల్వతీర్థము తండ్రి అంగిట ఉంచుతున్నాడు.

అది గుటకపడక పెదవులవెంబడి కారిపోతున్నది. సోమిదేవమ్మ విస్తుపోతూ తిప్పన వంక కొర కొరలాడుతూ చూస్తున్నది.

నారాయణ స్మరణచేస్తున్న పోతనకు ఇప్పుడు తండ్రి నిర్యాణమును గూర్చిన దిగులుతోపాటు ఇంకొక దిగులు కూడా బరువుగా ఆవేశించినది. ఆ రెంటిలో ఏది తీవ్రతరమైనదో నిర్ధారణ చేసుకోలేకుండా ఉన్నాడు. అన్న వాలకము చూడగా తండ్రి నిర్యాణముతోపాటు తప్పని సరిగా తనకు పూజనీయుడైన అన్నతో ఘర్షణరాక తప్పేట్లులేదు.

తమ ఇంటిలో అనూచానముగా మహేశ్వర భక్తితోపాటు వైదికాచారము వస్తున్నది. మాతామహుని ఇంటిలో కూడా కొందరు పంచాక్షరి, కొందరు దక్షిణామూర్తి మంత్రము, మరికొందరు పంచ దశాక్షరీ, షోడశాక్షరీ మంత్రాలు జపముచేస్తూ శివకేశవుల భేదము పాటింపని శివభక్తులు. తాను జగద్గురువు ఉపదేశించిన గోపాల సుందరీ మంత్రమునే మహేశ్వర మంత్రముగా భావనచేసి జప పూజాదికము నిర్వర్తిస్తున్నాడు. త్రిపుర సుందరి ఉపాసనము తనకు క్రొత్తగా వచ్చినది కాదు. తన అన్న పేరు తిప్పన. అదే తమ కుటుంబములో త్రిపుర సుందరిమీద ఉన్న భక్తిని వ్యక్తము చేస్తున్నది.

మరి ఇప్పుడో? అన్న వేద కర్మబాహ్యుడైన జంగమ దేవర పాదాలుపట్టి అంతకుముందే గురూపదేశము పొంది జపిస్తున్న పంచాక్షరీ మంత్రమే పునః ఉపదేశము పొంది ధారణ కూడా చేసి తండ్రికి కూడా ధారణ చేయించినాడు. ఒక గురువు ఉపదేశము చేసిన మంత్రమే మళ్ళీ ఇంకొక గురువువల్ల ఉపదేశగ్రహణము చేయడమే శ్రేయస్కరము కాదు. అందులో వైదికాచారపరులు వేద బాహ్యునివల్ల గ్రహించుట అంతకంటె నిషిద్ధము. అన్నిటికీ తోడు ధారణము సమస్త స్మార్త క్రియలకు గొడ్డలిపెట్టు.

ఇప్పుడు అన్నగారికి నారాయణ స్మరణమే, తులసీ తీర్థ సేవనమే సరిపడకున్నది. తండ్రి ప్రాణాలు గొంతులో గుటగుట లాడుతున్నవి. తమ తండ్రికి సద్గతులు కలిగించడానికి జరుపవలసిన పితృమేధమైనా సాగనిచ్చునా, అయ్యో, మా అన్న అని ఇప్పుడు పోతన దిగులు!

కేసన మంత్రి కంఠములో కఫము పేరుకొంటూ తులసీ తీర్థమువల్ల కొంచెము కొంచెము విచ్చుతున్నది. మళ్ళీ యథా ప్రకారము పేరు కొంటు న్నది. కఫము విపరీతముగా కంఠమునకు అడ్డుపడి ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అవుతున్నాడు. పాదములు చేతులు చల్లబడి అసహ్యమయిన జిగురుతో చెమటలు కారుతున్నవి. ఆయాసము భరింపలేకున్నాడు.

హంస లేచినది. పాదాలనుండి నాభివరకు మొద్దువారినది. మరి కొంత సేపటికి కంఠగతమైనది. అక్కడ ఊపిరాడక ప్రాణము గిలగిల కొట్టుకొన్నది. మరి కొంత సేపటికి కేసన కళ్ళల్లోనుండి ప్రాణము ఉత్క్రమించినది. నారాయణ స్మరణతో ఇల్లంతా గొల్లుమన్నది.

ముందు మాట్లాడినది లక్కమ్మ. ఆమె తన మరది ఇమ్మడిసీ, కుమాళ్ళనూ, ఆడుబిడ్డనూ ఉద్దేశించి ఇట్లా పలికినది.

"వారు స్వర్గస్థులైనారు. వారి కీ లోకముతో పని తీరిపోయినది. వారితోపాటు నాకూ పని తీరిపోయినది. నేనూ వారితోపాటు సహగమనము చేయడానికి నిశ్చయించుకొన్నాను. నా కోరికకు అడ్డు చెప్పక నన్ను కృతార్థురాలిని చేయండి."

ఆమె నిష్కంపముగా, నిబ్బరముతో, దుఃఖము ఏమీ లేని దాని వలె, ఉత్సవము చూడబోయే బాలికకు ఉండే ఉత్సాహముతో ఆ మాటలు పలికినది.

ఆ మాటలకు సోమిదేవమ్మయే అబ్బుర మందినది. అప్పుడామె మరదలు తనకు ముందు పోవలసిన దారి నిర్దేశిస్తున్న దనిపించినది. "ఎంత ధన్యాత్మురాలవే! ఇటువంటి సాహస బుద్ధి పుట్టడము నీవంటి పుణ్యాత్మ

రాలికే తగినదే!" అని మెచ్చుకుంటూ ఆమె లక్కమ్మను కౌగిట గట్టిగా గ్రుచ్చుకొన్నది.

## 22

పోతన ముందుగా భయపడ్డట్లే ఐనది. తండ్రికి దహన క్రియ జరప డానికిగాని, ప్రేతకర్మ జరపడానికిగాని తిప్పన అంగీకరించలేదు. తల్లి చెప్పి నది. పిన తండ్రి ఇమ్మడి చెప్పినాడు. పెద్ద పిన తండ్రి గతించినందున ఆయన భార్య చెప్పినది. అప్పటి కక్కడికి వచ్చిన మేనమామ చెప్పినాడు. వచ్చిన బంధువులు గ్రామములోని బ్రాహ్మణులు—అంతా చెప్పినారు. తిప్పన వినలేదు. శివత్వము పొందిన తన తండ్రికి దహనము చేయడము ప్రేత కార్యాలు చేయడము ఘోరపాతకమని కేకలు వేసినాడు! కోపముతో మండి పడుతున్న సోమిదేవి ఏమని ఏమి ప్రమాదము తెచ్చి పెట్టుతుందో అని ఆమెను బ్రతిమాలి బలవంతముచేసి దూరంగా బంధువులంతా అతి కష్టముమీద ఉంచినారు.

పినతండ్రి ఇమ్మడి మంచి వ్యవహర్త. ఆయన తిప్పనను ఏకాంత ముగా పిలిచి బుజ్జగించి బోధచేసినాడు.

"నాయనా, నీవు చిన్నవాడవు. నీకు కష్టసుఖాలు తెలియవు. తండ్రికి దహనముచేసి ప్రేతకర్మ చేయకపోతే బ్రాహ్మణ్యము మనలను వెలివేస్తుంది. ఆ జంగమయ్య నిన్ను మోసము చేసినాడురా. ఆయనకు మహత్త్వముంటే మీ నాయన జబ్బేమైనా నయము చేయగలిగినాడటరా!—ఏంత వెర్రివాడవు

"జంగమదేవర నా గురువు. ఆయన మా నాన్నను బ్రతికిస్తా నని నా కెప్పుడూ మాట ఇవ్వలేదు. మొదట దర్శించినప్పుడే తన చేతులు దాటి పోయినదని స్పష్టముగా చెప్పివేసినాడు. నేనే ఆశపడ్డాను. నాన్నను ఈ లోకంలో బ్రదికించుకో లేకపోయినాను. మా గురుదేవుల అను

గ్రహమువల్ల మా తండ్రి ప్రేతత్వము పొందకుండా శివైక్యము పొంది ధన్యుడయినాడు.

మేనమామ గోపన్న అక్కడికి వచ్చి ఇట్లా అన్నాడు: "నాయనా, జంగమదేవర పూర్వకథ నీకు తెలియదు. నీకు ఆశపెట్టినట్లే గ్రామములో ఎందరు పెద్దలకో నేర్పుగా ఆశలు కల్పించి పుష్కలంగా కట్నాలు పుచ్చుకొన్నాడు. మీ తండ్రికి వ్యాధి విషమించినట్లుగానే, వాళ్ళఆశలుకూడా అన్నీ విఫలమైనవి. అందువల్లనే ఆయన అర్ధరాత్రివేళ ఎవరికీ చెప్పకుండా మాయమై పోయినాడు—అయినా ఆయన సంగతి మనకెందుకులే? జరిగినదేదో జరిగిపోయినది. పెద్దల నడిగి వాళ్ళు విధించే ప్రాయశ్చిత్తము చేసుకొని తండ్రి కర్మ సక్రమంగాచేసి పితౄణము తీర్చుకో! కాదంటావా, మీ నాన్నతోపాటే మేమంతా గూడా నీకు లేమన్నమాటే!"

తిప్పన అంతరంగములో ఆందోళనపడుతూ, వాళ్ళకు ఎవరికీజవాబు చెప్పలేక కఠిన స్వరముతో తన గురువులను నిందిస్తే సహించేది లేదని నిష్కర్ష చేసినాడు.

సమయము చూచి భార్య దమ్మక్క గడగడ వడకుతూ తిప్పనతో ఒంటరిగా చెప్పి చూచినది. "అయ్యో, అనాదిగా వస్తున్న ఆచారము మారుస్తారా?—మన ఆప్తులంతా అంటున్నది గమనించరా ? మన ఇంట్లో అవతరించిన సాక్షాల్లక్ష్మీదేవి మీ అమ్మ. ఆమె మాటలైనా ఆలకించరా ! —దహనకర్మ చేయకపోతే ఆమె సహగమనము ఎట్లా చేయగలుగుతుంది ?—ఆమె ముఖము చూచి ఐనా మీ పట్టు విడవండి — అడుగో, మీ తమ్ముడు పోతయ్య మీతో మాట్లాడడానికి వస్తున్నాడు. మీ తమ్ముని కంటె ధర్మము తెలిసిన వాళ్ళెవరున్నారు! అతను చెప్పినట్లుగా చేయండి!" పైట చెరగుతో కళ్ళద్దుకుంటూ పక్కకు పోయినది.

పోతనకూ, తిప్పనకూ ఇట్లా సంభాషణ జరిగినది :

"అన్నయ్యా!"

"ఏమి తమ్ముడూ?"

"వైదిక ధర్మము మనము విడువరాదు. భక్తాగ్రేసరులు ఒక్కొక్క ప్పుడు లోకాతీత కార్యాలు చేస్తారు. మహత్త్వాలు చూసేవాళ్ళు తరుచుగా ఇంద్ర జాలికులు, మాయావులూ. తండ్రికి పిండప్రదానము చేస్తూ ఉండగా, భీష్మునికి తండ్రి కంకణ హస్తము చాచినట్లుగా కనబడ్డది. ఆయన ఆలో చించి, పిండప్రదానము దర్భాస్తరణముమీదనే చేయవలెనని శాస్త్రము విధి స్తున్నది కనుక, దర్భాస్తరణముమీదనే చేసినాడని, దేవతలంతా భీష్ముని ధర్మనిష్ఠను ప్రశంసించినారనీ, భారతాఖ్యానములో వినలేదా? — నిజంగా చిల్లర మహత్త్వాలు చేసేవాళ్ళ వాక్యాలకంటే, శ్రుతి స్మృతుల వాక్యాలూ, శిష్టాచారమూ మనకెక్కువ ప్రమాణాలు. కొన్ని అలౌకికాద్భుత చర్యలు. ముఖ్యముగా, తుచ్ఛదేవతల అమంగళోపాసనలవల్ల కూడా చేయవచ్చును. అవి చూసి మనము భ్రాంతి పడరాదు."

"తమ్ముడూ, జంగమదేవర శ్రుతి వాక్యాలు, ఆగమ వాక్యాలు ఉదా హరించి లింగధారణము విధివిహితమని చెప్పినాడే!"

"అన్నయ్యా, ఆ జంగమ దేవరకు యజ్ఞోపవీతము ఉన్నదా?"

"లేదు."

"ఆయన ఎప్పుడైనా ధార్యాగ్నిలో కాని త్రేతాగ్నులలో కాని హోమము చేయుట చూచినావా?"

"లేదు."

"వేదోక్త కర్మలు చేయనివాళ్ళు ఉదాహరించే వేదవాక్యాలు, వాళ్ళు చెప్పే అర్థాలూ వేదోక్త కర్మలు ఆచరించే మన బోంట్లకెట్లా అంగీకరింప దగినవి!"

"మరి ఆగమాలు?"

"ఆగమాలు చాలా భాగము తంత్రాల వంటివే. వేద ధర్మానికి విరు

ర్థము కానంతవరకే వాటిని కొంత కొంత మనము గ్రహించవచ్చును — అన్నయ్యా, మనము కాదు. మన పెద్దలంతా మనవై పున. అమ్మవై పున, ఎంత శివభక్తి కలవారు! వాళ్ళలో ఎంతమంది విద్వాంసులు లేరు! వాళ్ళెవరయినా లింగధారణముచేసి దహన కర్మా, ప్రేతకర్మా వదిలి వేసినారా?"

"లేదు. కాని, తమ్ముడూ, వాళ్ళంతా వేదజడులు. భవులకు శివలీలలు ఎట్లా అర్థమవుతవి?"

"అన్నా, జంగమదేవర భవులనే వాళ్ళకు పరదేవత వేదమాత. వేదము ఆయన భవులనేవారు నోటితో ఉచ్చరిస్తేనే వేదము. ఆయన వంటి వారు శ్రుతివాక్యాలు ఉచ్చరించినా అది వేదము అనిపించుకోదు. అయినా, ఒకమాట అడుగుతాను. నాన్న ఎన్ని శైవశాస్త్రాలు చదివినాడో నీకు తెలుసును కదా! ఆయన జంగమదేవరలను ఎప్పుడైనా కొలిచినాడా? పోనీ ఆయన స్పృహలో ఉన్నప్పుడు ఇష్టలింగధారణము చేయించినావా? స్పృహ లేనప్పుడా?"

"స్పృహ లేనప్పుడే అనుకో!"

"అన్నయ్యా, నాన్న తన రొమ్ముమీద బరువుపెట్టినట్లున్న లింగము తీసివేయటానికి ప్రయత్నిండము రాత్రి గమనించినావా?"

"చూచినాను కాని అది వ్యాధి బాధ, తెలిసి చేసినది కాదు."

"అది తెలిసి చేసినది కాకపోతే లింగధారణము కూడా తెలిసి చేసినది కాదు కదా!—అన్నా, నీ అంత మంచివాడు ఇంకొక డీ లోకంలో లేడు. అమ్మ మనకు పరదేవత. ఆమె మాటలకు ఎదురాడవద్దు. నాన్నకు ఇది ఇష్టము లేదు. మన బాబాయి, మన మేనమామ, మన మేనత్త, మన ఆప్తవర్గము, మన గ్రామములోని విద్వాంసులు, ఎవరూ నీవు చేయదలచినది హర్షించడము లేదు. నా మాట విని నాన్న దహన కర్మకు అంగీకరించు. నీవు ప్రేతకర్మ చేస్తేనే ఆయన కృతార్థుడవుతాడు. మనకు పితౄణము

కొంత తీరుతుంది—నాన్న మెడలో ఇష్టలింగ మంటావు—దానిని శివాలయములో ఉంచుదాము." ఈ విధంగా పలుకుతూ పోతన అన్న రెండు కాళ్ళూ పట్టుకొన్నాడు.

తిప్పన్నకు కన్నీళ్ళు వచ్చినవి. బావురుమని ఏడ్చినాడు. ఆ ఏడుపులో తాను శిష్టాచారము ఉల్లంఘించి అవైదిక మార్గంలో అడుగు పెట్టుతున్నాననే దుఃఖము కూడా అంతర్గతమై ఉన్నది. వైదిక మార్గము ప్రహతమయినది. సాఫీగా సాగిపోతుంది. ఈ జంగమ మార్గమో తనకు క్రొత్త గహనమయినది! ఆ ఆచారము తెలిసిన వారెవరూ అక్కడ లేరు. జంగమదేవర జాడ తెలియలేదు. తా నేమి చేయవలెనో తెలియకున్నది.

భర్త ఏడుపు చూచి దారికి వస్తున్నాడని సంతోషించి," అట్లా ఏడవకండి. బంధువులు, గ్రామస్థులు అంతా చేరుతున్నారు. లేచి స్నానముచేసి మామగారికి దహన సంస్కార ప్రయత్నము చేయండి!" అన్నది నెమ్మదిగా దమ్మక్క.

తాను ఏడ్చిన ఏడ్పుతో తిప్పన హృదయములో కూడుకొన్న భారమంతా కరిగిపోయినది. శివ స్వరూపుడైన తండ్రికి దహన సంస్కారము చేయడము మహాపరాధ మనిపించింది. అది కాక దహనము చేస్తే తల్లి సహగమనము చేస్తా నంటుంది. అది లేకపోతే ఆమె కది సాధ్యము కాదు. అతనికి తల్లి మీద ఎంతో ప్రేమ వున్నది. ఈ విధంగా తాను తల్లి ప్రాణాలు దక్కించుకున్న వాడవుతాడు. ఆవేశము తెచ్చుకొని, కఠినంగా పోతనతో అన్నాడు: "ఛీ! నీ అజ్ఞానపు మాటలు వదులు. నీవు భవివి. శివత్వం పొందిన నాన్న కాయాన్ని నీవు తాకడానికి కూడా ఒప్పుకోను. ఫో !"

పోతన కన్నీళ్ళు కారుస్తూ విధిలేక దూరముగా పోయినాడు. బంధు

వులు, అప్తులు, గ్రామస్థులు అంతా పోతన చుట్టూ మూగినారు. "పోతనా, తండ్రికి దహనము కూడా చేయననే కొడుకు కొడుకేకాదు. నీవే కొడుకువు, దహనము చేయి. మేమంతా నీకు అండగా ఉంటాము. ఒక్కడు మీ అన్నయ్య ఏమి చేయగలడు!" అన్నారు వాళ్ళు.

పోతన వాళ్ళకందరికీ నమస్కారము చేసి ఇట్లా అన్నాడు.

"ఏమైనా, నాన్న పితృకర్మలకు జ్యేష్ఠుడైన అన్నయ్యే కర్త. అన్నయ్యను ధిక్కరించి నాన్న దేహాన్ని బలవంతముగా తీసుకొని పోవడానికి నేను ఎంతమాత్రము అంగీకరించను. అన్నయ్య ఏమి చేస్తాడో చూచి కాని నేను ఏమీ ముందు చేయను. నాన్న శవము మీద, నన్ను నా తండ్రి వంటి అన్నయ్యతో పోట్లాట పెట్టుకో మంటారా? వద్దు బాబుల్లారా" అంటూ పోతన వలవల ఏడ్చినాడు. పినతండ్రి, మేనమామ పోతన నిశ్చయానికి సంతోషించినారు.

ఖనన విధానము ఎట్లా చేయవలెనో తోచకున్న తిప్పనకు ఊరిలోని విశ్వకర్మ కులస్థులు, కంసాలి పని చేసేవారు జ్ఞప్తికి వచ్చినారు. వారంతా శివదీక్షితులు. వారికి ఖనన పద్ధతులు తెలియును. వారిని పిలిచి వాళ్ళ చెప్పిన ప్రకారము అనాడు ఖననము చేయించి తర్వాత ఓరుగల్లునుంచి జంగమదేవరలను పిలిపించి, వాళ్ళు చెప్పినట్లు ఆరాధన క్రమము జరిపించుటకు నిశ్చయించినాడు.

విశ్వకర్మలకై బయలుదేరి పోతూ, తాను వచ్చే లోపల ఎవరైనా తండ్రి శరీరాన్ని ముట్టుకుంటే నరికివేస్తా నని కట్టడి చేసి పోయినాడు.

తిప్పన వెళ్ళిపోయినంతలోనే బంధువర్గ మంతా తిప్పనను నెట్టివేసి. పోతనను దహనాదికము చేయమని సలహా ఇచ్చిరి. తన జ్యేష్ఠ భ్రాత యజమానిగా ఉండి చేయవలసిన కర్మకాండ తా నెట్లా చేయగలనని పోతన అన్నాడు. అప్పటికే వచ్చిన పురోహితుడు కూడా అట్లా చేయటము

మంచిది కాదన్నాడు. "అంతా కలసి పురోహితునిద్వారా తిప్పనకు ఇంకొక సారి చెప్పించి చూతాము. పురోహితుడు విద్వాంసుడు. తిప్పనకు ఆయన యందు ఎంతో గౌరవము కలదు. ఆయన మాట వినవచ్చును. వినక పోతాడా, తిప్పన ఏమి చేస్తాడో ఆగి చూసి తర్వాత వేరుగా పోతన చేత దర్భ ప్రతీక పెట్టి కేసనకు దహన సంస్కారము చేయించి నిత్యకర్మాది కము చేయించవచ్చును." అని నిశ్చయించినారు. అంతే.

కొద్ది సేపటిలో ఊరిలోని విశ్వకర్మలు జంకుతూ తిప్పనతో బమ్మెర వారి ఇంటికి వచ్చినారు. పురోహితుడు తిప్పనకు ఎన్నో విధాల చెప్పి చూచినాడు. అతడు వినలేదు.

విశ్వకర్మలు భూశయనము చేసి ఉన్న కేసనమంత్రి శవాన్ని చూడ గానే, "అయ్యయ్యో, బాసి పెట్టు వేసి కూర్చోపెట్టవలసినది. ఇట్లా చేసినా రేమి?" అంటూ బాధ పడినారు. బమ్మెరవారి బంధువులంతా తమ్మును ఏమి చేస్తారో అని వడకి పోయినారు. తిప్పన వాళ్ళను లోపలకు రమ్మ న్నాడు. బంధువు లెవ్వరూ ఏమీ మాట్లాడక పోవడము చూసి కొంచెము కొంచెమే ధైర్యము చేసి లోపలికి వచ్చారు. అప్పటికే బిగిసిపోయిన కేసన శవాన్ని విశ్వకర్మలు బలవంతాన విరిచి కూచోబెట్టి విమానము మీద తీసుకొని పోయి ఖననము చేసినారు. ఆ రీతిగా బ్రాహ్మణ శవాన్ని విశ్వ కర్మలు ముట్టుకొని అగ్నిహోత్రము లేకుండా తీసుకొని పోతుంటే, బమ్మెరవారి బంధువర్గములోను, గ్రామీణులలోను పుట్టిన హాహాకారాలు వర్ణించడము సాధ్యముకాదు. ముక్కుమీద వేలుపెట్టుకొని తిప్పన మూర్ఖ త్వాన్ని ఆడిపోయనివాళ్ళు లేరు.

పోతన దుఃఖానికి పరిమితి లేదు. మధ్య మధ్య అన్నమీద ఆగ్ర హము వచ్చి ఆవేశముతో అడ్డము పోవలె ననుకున్నాడు. మళ్ళీ బలవం తాన నిగ్రహించుకొన్నాడు.

లక్కాంబకు ఇప్పుడు భర్త పోయినందుకే కాక, మరి రెండు

దుఃఖాలుకూడా తోడయినవి. ఒకటి తన భర్త శరీరానికి సంస్కారము లేక పైగా అపవిత్రమైనదని. రెండవది తాను సంకల్పించినట్లు తనకు సహగమనము చేసే భాగ్యము తప్పిపోయినదని. ఆమె కిప్పుడు దుఃఖము పొరలిరాగా నేలపైనపడి దొరలుచు రోదనము చేయసాగినది.

ఏమున్నది? మూడవనాటికి తిప్పన ఓరుగల్లునుంచి జంగమలను పిలిపించి తండ్రికి ఆరాధనాదిక మారంభించి పన్నెండవ నాటికి పూర్తిచేసి నాడు. దమ్మక్కకు తిప్పనతో వుండక తప్పలేదు.

తిప్పన తండ్రి శవాన్ని తీసుకొని పోయిన తర్వాత పోతన బంధు వర్గముతో కలసి వెళ్ళి, పురోహితుడు నడిపించిన ప్రకారము దర్భ ప్రతీక లోనికి కేసనను ఆవాహన చేసి, దహనకర్మ జరిపి, ఇంటికి వచ్చి ఆనాడే పిత్యకర్మ ఆరంభించి తండ్రికి పితృమేధము పన్నెండవ నాటికి వేదోక్తముగా పూర్తిచేసినాడు. పితృమేధము ముగియగానే పోతన బ్రాహ్మణాశీర్వాదము పొందినాడు....

ఆవల తిప్పన జంగమ దేవరల ఆశీర్వాదమూ పొందినాడు.

ఒక్క ఇంటిలో ఒక్క విగత జీవునికి కొడుకు లిద్దరిలో ఒకడు ఖననపూర్వకమైన ఆరాధనమూ, ఒకడు దహన పూర్వకమైన పితృమేధమూ చేసినారు. వైదికాచారానికి పేరుపడ్డ బమ్మెర వారి ఇల్లు రెండు ముక్క లైనది.

దానితో వచ్చిన చిక్కు అంతటితో ఆగలేదు. అది బంధుగణానికి అంతా ప్రాకినది.

సోమిదేవమ్మ పదమూడవనాడు వైకుంఠ సమారాధనలో భుజించి ఓరుగల్లుకు బయలుదేరినది. ఆమె భర్త ముక్కోపి. ఆయన అప్పటికే బమ్మెరలో జరిగిన వృత్తాంతము విని కోపముతో మండిపోతున్నాడు. ఆ కోపమంతా, ముందు భార్యమీద, ఆమె ఇల్లు చేరిన వెంటనే వెళ్ళగక్కి

నాడు. విశ్వకర్మలతో జంగములతో కలసి కులభ్రష్టులైన బమ్మెర వారింట నీరూ, అన్నమూ ఇన్నాళ్ళు ముట్టి వచ్చినందున సోమిదేవిని "నీవు పనికిరా" వంటూ మూడు రోజులు ఇంట్లోకి రానీయక పశులపాకలో ఉపవాసము చేయించినాడు. ఆమె తాను తిప్పన ముఖము చూడలేదనీ, పోతన సక్రమంగా జరిపిన పితృమేధములోనే కల్పించుకున్నాననీ, జరిగిన సంగతులు ఘోషపెట్టి చెప్పినా, సోమయాజి వినిపించుకోలేదు.

ఇంతలో దర్శతిథి వచ్చినది. అప్పుడు విధిగా చేయవలసిన శ్రౌత కర్మకలాపాలకు భార్య ఉనికి తప్పనిసరి ఐనది. అప్పుడాయన గతిలేక తన్ను పది తిట్టుకొని, భార్యను నూరు తిట్టి, బమ్మెరవారిని, తిప్పనను వేయి తిట్లు తిట్టి భార్యకు ప్రాయశ్చిత్తము చేసి ఇంటిలోకి రానిచ్చి మళ్ళీ జన్మలో పుట్టింట అడుగు పెట్టకుండా కఠినముగా శాసించి త్రేతాగ్నులను విహరింపజేసుకొన్నాడు.

ఇంత ఆఘోషణ ఊరకే పోతుందా? కేసన చనిపోయి నెల తిరగక ముందే తిప్పన అకస్మాత్తుగా గుండె ఆగి ప్రాణాలు వదిలినాడు. బంధువర్గ మంతటిచేతను "ఛీ" అనిపించుకొన్న ఫలిత మని కొందరన్నారు. తండ్రికి పితృకర్మ చేయని ఫలమని కొందరన్నారు. కర్మిష్ఠి ఐన సోమయాజి శాప ఫలమే అని మరికొందరన్నారు.

ఏమైతే ఏమి? తండ్రికి చిచ్చుపెట్టడానికి నిరాకరించిన తిప్పన బమ్మెరవారి యింటిలో దుఃఖపు చిచ్చుపెట్టి మరణించినాడు. అతని శవ సంస్కారము విషయము మీమాంస రాలేదు. అతని వంటిమీద ఇష్ట లింగమును శివాలయములో పెట్టి విశేష ప్రాయశ్చిత్తాలు చేసి దహనము చేయడానికే, పెద్దల నిర్ణయము ప్రకారము పోతన నిశ్చయించినాడు.

ఈ నెల రోజులూ తిప్పన భార్య దమ్మక్కకు జీవయాత్ర నరక యాతనగా ఉన్నది. భర్త అందరికీ వ్యతిరేకముగా నడవడము ఆమె కిష్టము లేదు. కాని భర్తతో ఉండక తప్పలేదు. ఆమె పుట్టింటి వారు కూడా

మామగారు చనిపోయిన పన్నెండవ నాటికి [illegible] ఆశీర్వదించడానికైనా రాలేదు.

భర్తకు దహనము జరగబోతున్నదని తెలిసిన వెంటనే తాను సహగమనము చేస్తానని, అత్తకు నమస్కరించి, అనుజ్ఞ వేడినది. మహా భాగ్యమని తాను చేయదలచిన సహగమనము చేయవద్దని ఆమె కోడలి కిప్పుడు ఎట్లా చెప్పగలదు! ఐనా తన కెంతో ఇష్టురాలైన కోడలు చిచ్చులోకి ఉరుకుతా నంటే ఎట్లా సహించగలదు! "అమ్మాయీ, చిన్న పిల్లవే! బాగా ఆలోచించుకో తల్లీ. తొందర పడకు!" అంటూ సహగమ నములో ఉన్న కష్ట నిష్ఠూరా లన్నీ విపులీకరించి వర్ణించినది. ఆలోచించు కొమ్మన్నది. దమ్మక్క పట్టు విడువ లేదు. తనకు పిల్లలు కూడా లేరు? భర్త ఇప్పుడు గతించినాడు. ఎవరి కోసమని తానిప్పుడు జీవించవలె!

దమ్మక్క మహానందంతో ముత్తయిదువల కందరికీ పసుపు కుంకుమ పంచిపెట్టినది. పూల పాన్పుపైన పడుకొన్నట్లు ఆమె తిప్పన ప్రక్కను చితిపైన పవ్వళించి చిరు నవ్వులు ఒలక బోసినది.

బమ్మెరలోను చుట్టుపట్టులను జనమంతా ఆమె సహగమనము చూడడానికి గుంపులు గుంపులుగా వచ్చినారు. దహనకాండ పూర్తి అయ్యే దాకా జనమంతా దమ్మక్క సతీత్వాన్ని పొగడుతూ, ఆవేశముతో కేకలు వేస్తూ, పాటలు పాడుతున్నారు. తామంతా ఆచితిలో నుంచి దమ్మక్క దివ్యరూపమును ధరించి భర్తను కూడా చేయిపట్టి లేవదీసి ఆనంద నాట్యము చేస్తూ దివ్యవీథిలో పోతున్నట్లు చూచినారట. "అదుగో, అదుగో!" అంటూ వాళ్ళ దివ్య రూపాలు మేఘాలచాటుకు పోయి అదృశ్యమయ్యేదాకా జనము ఒకరికొకరు చూపించుకొన్నారు. జయజయధ్వానాలు చేస్తూ ఆనందభాష్పాలు వదలినారు.

అప్పటి నుండి దమ్మక్క బమ్మెరగ్రామములో దేవతగా వెలసినది.

ఏ కష్టము వచ్చినా ఆమెకు మ్రొక్కుకొని ముడుపులు కట్టుకొని కష్టాల నుండి గట్టెక్కడము ఆచారమైనది.

శ్రీనాథమహాకవి మహాప్రస్థానముతో ఆరంభమై, తండ్రి మరణము. అప్పటి గృహకల్లోలము, అన్న ఆకస్మికమృతి, చివరకు వదినగారి సహగమనమూ—ఇవి అన్నీ కలసి పోతన మెత్తని హృదయముమీద చెరగని ముద్ర వేసినవి. ఒక్క పని చేయలేదు. ఒక గ్రంథము చదవలేదు. ఒక పద్యము చెప్పలేదు. నిత్యము సంధ్యావందనము చేస్తూనే పరధ్యానములో పడిపోతూ, ఏమంత్రము చెప్పినదీ మరుస్తూ చెప్పిన మంత్రమే మళ్ళీ చెప్ప వలసి వస్తున్నది. ఒకానొక శూన్యభావము అతనిని ఆవేశించినది. భాగవతము మాత్రము బలవంతాన చదవడానికి ప్రయత్నము చేస్తున్నాడు.

# 23

సంవత్సర కాలమిట్లా గడిచిపోయినది. తండ్రివీ, అన్న వది నెలవీ సంవత్సర విమోకాలై పోయినవి. తండ్రి లేని లోపము, అన్న లేని లోపము, వదినెలేని లోపము, ఇప్పుడు శత గుణముగా కనిపిస్తున్నది. తండ్రి నిర్యాణ సమయములో ఆరంభించిన నారాయణ స్మరణము అప్పటి నుంచీ నిరంతరాయంగా సాగుతున్నది.

ఒకనాటి తెల్లవారుజామున యథా ప్రకారము నారాయణ స్మరణము చేస్తూ ఉండగా, పోతన వాక్కున ఈ పద్యము వెలువడ్డది:

"ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయము లెల్ల వందిగణమై బ్రహ్మాండ మాకారమై
సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై
వరుసన్ నీ ఘన రాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా!"

అంతలో తల్లి లక్కాంబ మాటలు వినవచ్చినవి. "నాయనా, పోతన్నా, శ్రీనాథకవి సార్వభౌములవారు మహాప్రస్థాన సమయములో నీ కేమయినా ఉపదేశము చేసినా రటరా!"

"ఏమీ లేదమ్మా. నేను వెళ్ళినప్పటినుంచీ, వారి మనస్సు ఈ ప్రపంచముమీదనే లేదు. ఒక్క అర్ధరాత్రివేళ నన్ను భాగవతాంధ్రీ కరణము చురుకుగా సాగించమన్నారమ్మా! ఆయన ప్రస్థానయాత్రా సంబంధ మయిన వేదమంత్రము చెప్పుతూ వెళ్ళుతూ ఉండగా నాకే "కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వజిహ్వ" అంటున్నా రనిపించిందమ్మా!"

"దుగ్గన ఏమయినా అన్నాడా?"

"దుగ్గనా, గంగనమంత్రీ కూడా నన్ను భాగవతాంధ్రీకరణము సమ ర్థతతో నిర్వహిస్తావని ఆశీర్వదించినా రమ్మా!"

ఆ సంభాషణ మంతకంటె ఎక్కువగా సాగలేదు. వెంటనే పోతనకు శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనా కుతూహలము అంత రంగములో నిండినది. గోపాల సుందరీమంత్ర ముపదేశించిన శ్రీశృంగేరీ విరూపాక్ష స్వామివారిని హృదయములో ధ్యానించినాడు. ఆ పద్యము నోట వచ్చినది.

"శ్రీకైవల్య పదంబు జేరుటకునై చింతింతెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కలా సంరంభకున్ దానవో
ద్రేక స్తంభకు గేళిలోల విలస ద్దృగ్జాల సంభూత నా
నాకంజాత భవాండ కుంభకు మహానందాంగనా డింభకున్"

అంతట శూలికిని విధాతకును వందనముచేసి విఘ్నవల్లికాచ్ఛేదికి మ్రొక్కినాడు. పిమ్మట వాణిని నుతించినాడు. ఆ తరువాత కవిత్వసంపదకై దుర్గాదేవి కృపను ఇట్లు అర్థించినాడు:

"అమ్మల గన్న యమ్మ" ముగురమ్మల మూలపుటమ్మ, చాలపె
ద్దమ్మ, సురారులమ్మకడు పారడి ఱుచ్చిన యమ్మ, తన్ను లో
నమ్మిన వేల్పుటమ్మశల మనమ్ముల నుండెడి యమ్మ, దుర్గ మా
యమ్మ, కృపాబ్ధి యీవుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్"

అంతట నిత్యకల్యాణము లిచ్చే సిరిని భావించినాడు. దినకరుని కుమారస్వామిని ఇతరదైవతములను భావించినాడు. వాల్మీకిని నుతించి వ్యాసునకు మ్రొక్కి శుకయోగికి నమస్కరించి బాణుడాది యగు సంస్కృత కవులను, నన్నయాదులగు ఆంధ్రకవులను ప్రణుతించి వర్తమాన కవులకు ప్రియంబు పలికి భావికవులను బహూకరించినాడు.

తాను రచింపదలంచిన భాగవతమును, శిష్టాచారమును అనుసరించి ఏ మనుజేశ్వరునికి అంకితము చేయుదునా అను ఆలోచనలో నిమగ్నుడైనాడు. మనిస్సు కుదరలేదు.

ముందు అతని మనస్సు రావుసింగ భూపాలునిమీదికి పోయినది. ఇంతలో తాను చెప్పిన దండకము స్మృతిలోకి వచ్చినది. దుగ్గన మాటలు జ్ఞప్తికి వచ్చి సిగ్గుపడ్డాడు. "సింగభూపాలు, భూపాల గోపాల గోపాలికా కృష్ణగోపాలు, గోపాలదేవోత్సవ క్రీడలో" ఇత్యాదిగా చెప్పిన మాటలు తలపుకురాగా చిరునవ్వు వచ్చినది. తానప్పుడు నవయౌవనుడు. సింగ భూపాలుడూ నవయౌవనపు మిసిమిలో ఉన్నాడు. అతనినిచూచి మోహించి కామించిన భోగిని విరహాదికము తాను వర్ణించినాడు. అందులో తాను చేసిన తప్పేమీ లేదు. వయస్సు వచ్చినకొద్దీ తాను కేవల శారీరక కామమును అధి గమించినట్లుగానే, ఈపాటి కెప్పుడో సింగభూపాలుడూ అధిగమించి ఉంటాడు. ఐనా ఇప్పుడు సింగభూపాలుణ్ణి దర్శిస్తే వెనకటి కామవాసనలు ప్రకృతి సిద్ధంగా ఉద్బుద్ధము కావచ్చు. ఈ ఆలోచనలతో తనమనస్సు రాజు కొండమీదినుంచి మరల్చుకున్నాడు.

భాగవతరచన ఆరంభించవలెనని తహతహ లాడుతున్నాడు. ఐనా

ఏవో అడ్డు తగులుతున్నది. నారాయణస్తోత్ర పద్యాలు సాగుతున్నవి. అందులో భాగవత రచనాకుతూహలమూ, శ్రీకృష్ణలీలలు వర్ణించే ఘట్టాలు వస్తున్నవి.

"కేలన్ గోలయు గూటి చిక్కము లోగిం గిలించి నెత్తంబునన్
గేకిపింఛము జుట్టి నెన్నడుమునన్ బింఛావళిన్ గట్టి క
ర్ణాలంకార కదంబ గుచ్ఛ మధుమత్తాళీస్వనం బొప్ప నీ
వాలం గాచిన భావ మిట్టిదని నే వర్ణింతు నారాయణా!"

ఇటువంటి పద్యాలు ఇరవై వరకు సాగినవి. అతడు అవి తనలో తాను శ్రావ్యంగా చదువుకొంటూ ఉంటే, వింటున్న తల్లికీ, భార్యకూ అతనికి భాగవత రచన చేయవలెననే ఉత్కంఠ యెంతగా ఉన్నదో తెలిసినది.

ఒకనాడు మల్లన్నకు నాయనమ్మ గోవర్ధనోద్ధరణ కథ చెప్పినది. మరునాడు అతడు చిన్న రాయి చేతితో పైకి పట్టుకొని, నాయనమ్మనూ, అమ్మనే కాక తండ్రిని కూడా దాని క్రింధికి "రండి రండి" అని ఆహ్వానించినాడు. పోతన హృదయం ద్రవించి కుమారునికి ఈ పద్యము చెప్పినాడు.

"బాలుండీతడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపగా
జాలండో యని దీని క్రింద నిలువన్ శంకింపగా బోకు డీ
శైలాంభోనిధి జంతు సంయుత ధరాచక్రంబు పైబడ్డ నా
కేలల్లాడదు బంధులార, నిలు డీ క్రిందన్ ప్రమోదంబునన్."

లక్కమ్మ, ఎల్లమ్మ వెంటనే ఆ పద్యము నోటబట్టినారు. తరుచుగా వాళ్ళా పద్యము మల్లనకు చెప్పగా చెప్పగా, వచ్చీరాని మాటలతో ముద్దుగా మల్లన ఆ పద్యము చెప్పగలుగుతున్నాడు. ఇంటిలోని వాళ్ళందరూ అదివిని ఆనందపడుతున్నారు.

సర్వజ్ఞ సింగభూపాలుడు ఈ మధ్యనే కాలధర్మము పొందినాడనీ, తమ్ముడు వసంతావనీనాథుడు రాజుకొండలలో రాజ్యము చేస్తున్నాడనీ తెలిసినది. పోతన రాజు కొండకు వెళ్ళి బహుకాలమైనది. అక్కడ తన వెనుకటి మిత్రులను చూచి రావలెననే ఉత్కంఠ కలిగినది. తమకు ప్రభువు లిచ్చిన భూములకు క్రింది అధికారులవల్ల చిక్కులు రాకుండా కాపాడుకో డానికి కొత్త ప్రభువును ఒకసారి వెళ్ళి దర్శనము చేసివస్తే క్షేమమని చిన్న పినతండ్రి ఇమ్మడీ, పెద్ద పినతండ్రి మాధవుని వితంతుభార్యా పోతనతో అన్నారు. లక్కమ్మకూడా అమాటే చెప్పినది. పోతన రాజు కొండలోని విద్వాంసులను, మిత్రులను చూచి రావలెననే కోరిక తోడై మంచి రోజు చూచి కొద్ది పరివారముతో అశ్వారూఢుడై రాజు కొండకు ప్రయాణమైనాడు. ఆ పరిజనములో ముఖ్యుడు బొడ్డుపల్లి కి పోతనతో వెళ్ళిన రామన్న. అతనిని సంబోధించడముతో పోతన్నకు రామనామ స్మరణము నిత్యమూ సిద్ధిస్తున్నది.

రాజు కొండకు ప్రధాన ప్రభువు వసంత రాయలైనా, రాజుబంధువు లెందరో రాజ్యములో చిన్న చిన్న భాగాలను సామంతులుగాను, జాగీరు దారులుగాను పాలిస్తున్నారు. వారిలో కొందరు చిత్ర చిత్రమైన పన్నులువేసి ప్రజలను బాధిస్తున్నారు.

పోతనకు దారిలో ఒక గ్రామము తగిలినది. అది పూర్వ మెందరో సంపన్నులు నివాసముచేస్తూ పాడి పంటలతో పచ్చగా ఉండిన గ్రామమే. ఇప్పుడు చూడగా అందులో ఇళ్ళెన్నో—పెద్దవీ, చిన్నవీ-నిర్మానుష్యంగా ఉన్నవి. పోతన ఆశ్చర్యపడుతూ రచ్చచెట్టువద్దకు రాగా, అక్కడ తన స్తనద్వయము కత్తితో కోసుకొంటున్నట్లు గండరించి ఉన్న స్త్రీ విగ్రహము కానవచ్చినది. దానికి పూజలు కూడా జరుగుతున్న గుర్తులు కనబడ్డవి. అది చూచి పోతన నిశ్చేష్టుడై నిలబడి పోయినాడు.

అదేమిటో తెలుసుకోవలెనని పోతన చూడగా ఎవరూ మనుష్యులు

కనబడలేదు. అతడు అశ్వారూఢుడై సపరివారముగా విలువగల దుస్తులు ధరించి వస్తున్నందున, చూచి రాజ పురుషుడని భావించి దండించుననే భయముతో గ్రామీణు లంతా ఇళ్ళలో దాగినారు. పోతన అది కనిపెట్టి రామన్నచేత తాను రాజ పురుషుడను కానని అభయమీయగా, గ్రామ వృద్ధు డొకడు వచ్చినాడు. అతడు ఎవరు వత్తురో అని భయముతో మాటిమాటికి దిక్కులు చూస్తూ, పోతనకు ఆ విగ్రహ ప్రతిష్ఠ కథ ఇట్లా చెప్పినాడు:

"బాబూ, ఏమి చెప్పేది! క్రొత్తక్రొత్త పన్నులతో కుంగి పోతు న్నాము. ఇక్కడి ప్రభువు క్రొత్తగా యౌవనమువచ్చి పైలా పచ్చీసుమీద అందగత్తెలను బలవంత పరుస్తున్నాడు. ఆయన చుట్టూ కుశ్రకారు చేరి దుస్సలహా లిస్తున్నారు. వాళ్ళలో ఎవరికో ఒక ఊహ తట్టినది.

"ప్రభూ తమ రాజ్యంలో ప్రజలందరితోపాటు స్త్రీల స్తనాలన్నీ తమ హక్కు భుక్తాలలో ఉండవలసినవే. వనితల స్తనాలు భర్తలకు వదలి నందుకు పన్ను రావద్దా తమకు? స్త్రీల స్తనాలకు సరిపోయే పాత్రలలో పట్టే మాడలలో ఆరవవంతు ప్రభువుకు పన్ను కట్టవలె. అట్టి వాళ్ళకు నిర్బంధము ఉండదు. పన్ను కట్టనివారి స్తనాలను ప్రభువువారే అనుభ విస్తారు." ఈ విధంగా చాటింపుచేశారు. ఆ మరుసటి రోజునుంచీ, ఆయన భటులమంటూ రకరకాల కొలతలుగల గిన్నెలు పట్టుకొని ఇళ్ళమీద వచ్చి పడ్డారు. వాళ్ళు చేసిన దుండగాలు ఏమని వర్ణించేది నాయనా? స్త్రీలు చాటుకుపోయి తమ కొలత పాత్ర ఇది అని చూపితే, వినక, వాళ్ళు, ముఖ్యంగా యౌవనవతులైన యువతులను "సరిగా కొలవక మోసము చేస్తావా" అంటూ కొలిచే మిషతో ఆ భటులు వాళ్ళ స్తనాలు గ్రహించి "దొంగా, తక్కువ పాత్ర చూపినావా, ఇంత పెద్దవైతే!" అంటూ నవ్వు లాటలు సాగించారు. గ్రామస్థుల కిది దుర్భరమైనది.

"చివరకు వాళ్ళు పేరమ్మ అనే ఈమె యింటికి వెళ్ళినారు. ఆమె

మహాసాధ్వి. ఎన్నడూ ఇంటి గడప దాటి ఎరగదు. ఆమె భర్త అప్పుడు గ్రామాంతరము వెళ్ళి ఉన్నాడు. ఆమె కోపావేశముతో చురకత్తితో భటుల వద్దకు వచ్చినది. వాళ్ళు ఆమె తమ్ముని నరికి వేస్తుందని భయపడి పక్కకు తప్పుకొన్నారు.

"పిరికి వెధవల్లారా, పక్కకు తప్పుకొంటా రేమిరా? మీకు మీ ప్రభువుకూ కావలసినవి ఇస్తాను. తీసుకుపోండిరా!" ఇట్లా అంటూ ఆమె మహాకాళివలె కత్తితో ఈ రచ్చచెట్టు వద్దకు పరుగెత్తుకొని వచ్చినది. భటులూ, గ్రామీణులూ ఈ చెట్టువద్దకు ఆమె వెంట వచ్చారు.

"ఇక్కడ గ్రామ పెద్దలను కూర్చినది. నేనూ ఉన్నాను. మా కందరికి ఆ తల్లి నమస్కారం చేసింది. "ఇటువంటి ప్రభువు రావణాసురునికంటే దుష్టుడు. వీడికి పరస్త్రీల స్తనాలు తాకవలననే దుర్బుద్ధి పుట్టినది కాదూ! అట్టివాళ్ళకు యమభటులు ఎర్రగా కాచిన ఇనుప సూదులతో వేళ్ళు పొడుస్తూ దండిస్తారు. ఆ గతే మీ ప్రభువుకూ, మీకూ త్వరలోనే పట్టబోతున్నదిరా!"

"ఇట్లా అంటూ ఆమె చప్పున తన పైట అందరి ఎదటా తీసి ముందుకు వేసి, తన రెండు స్తనాలూ ఎడమ చేతితో ఎత్తిపట్టి కుడిచేతిలోని చురకత్తితో మెరపు మెరిసినట్లు కోసివేసి రక్తమోడుతున్న స్తనాలు రెండూ రెండు చేతులతో పట్టి ప్రధానభటుని ముఖాన విసరివేసి, "ఇవి మీ ప్రభువు కియ్యండిరా తీసుకుపోయి. వాడింకా మీరు వెళ్ళేదాకా బ్రతికి వుంటే!" అన్నది. ఆమె ప్రాణాలు మరొక గడియ కంటే నిలవ లేదు. మధ్యాహ్న వేళకు ఆమె ప్రాణాలు వదలినది.

"భటులంతా నివ్వెరతో ప్రభువు వద్దకు పారిపోయినారు. సరిగ్గా ఆ మధ్యాహ్నవేళకే ఆ ప్రభువు అకస్మాత్తుగా విపరీతమైన బాధతో తన రొమ్మున చేయిపెట్టుకొని "అబ్బా!" అంటూ ప్రాణాలు వదిలినాడు.

నాయనా! అత్యుత్కృష్టమైన పాపము చేస్తే వెంటనేపాప ఫలము అనుభ
వానికి రాదా, మరి!

"తర్వాత ఆమె ఊళ్ళో వాళ్ళకు పూనకం పూని చెప్పిన ప్రకారం విగ్రహము ఈమె పేర ప్రతిష్ఠచేసి, పేరమ్మకు పూజలు చేస్తున్నాము నాయనా! పేరమ్మ పేరంటాలే ఇప్పుడు మా గ్రామానికి రక్ష! — నీవు కళ్ళ నీళ్ళు పెట్టుకుంటున్నావు. ఎవరో సాధుపురుషుడవుగా వున్నావు. ఎందుకు నాయనా ఈ కథ నీకు?—"

పోతన బాధతో "రామ రామా!" అంటూ ఆ ప్రభువు పేరేమని అడిగినాడు.

ఆ గ్రామ వృద్ధుడు, "ఆ ప్రభువు పేరు ఉచ్చరిస్తే వాళ్ళ నోరు వెంటనే పడిపోతుందని పేరమ్మ పేరంటాలు ఆనపెట్టినది. బాబా!— తెలియక అన్నవాళ్ళ నోరు పడిపోవడము ఎన్నోసార్లు కళ్ళార చూచాను. ఆమెకు మొక్కుకొని అపరాధము చెల్లిస్తే కాని మళ్ళీ మాట రాదు!— ఆ పాపిష్ఠి ప్రభువు పేరు నీకెందుకు నాయనా!—నేనూ ఉచ్చరించను!— చూస్తున్నావుగా రోజురోజుకూ మా ఊరు నిర్మానుష్యమవుతున్నది. త్వరలోనే ఈ ఊరు అరణ్యమవుతుందని పేరమ్మ ఎందరు భక్తులకో కలలలో కనబడి స్పష్టంగా చెప్పినది. ఆమెకున్న సత్యము మరొక దేవతకు లేదు నాయనా!" *

వెంటనే పోతనకు కన్నీళ్ళు ఏకధారగా కారినవి. అతడు తన కన్నీటితో పేరమ్మ పేరంటాలు పాదాలు అభిషేకించినాడు. పెదవులు వణకుతుండగా, "అయ్యో, రామచంద్రా, ఇమ్మనుజేశ్వరాధములు! ఇమ్మను జేశ్వరాధములు!— ఇమ్మనుజేశ్వరాధములు!" అని ముమ్మారు కేక పెట్టి నాడు.

* అరణ్యములో ఉన్న విగ్రహము సంగతీ, పన్ను సంగతీ, శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారి "ప్రాచీన నగరములు" అనే గ్రంథములో ఉన్నవి.

ఆపైన పోతన రాజుకొండవైపు ఇంకొక అడుగు వేయలేదు, "రామన్నా!" అంటూ తన పాలికాపును పిలిచి, "ఇక ఇంటికి పోదా" మంటూ గిరుక్కున పరివారముతో వెనుకకు తిరిగినాడు.

ఆనాడు పగలూ, రాత్రీ పోతనగాని, పరివారములో ఒకరైనాగాని భోజనము చేయలేదు. దారిలో ఎక్కడా ఆగకుండా విశ్రాంతి తీసుకోకుండా ఏక బిగువున ప్రయాణము చేసినారు. దారి పొడుగునా పోతన పాలికాపు రామన్నను "రామన్నా, రామన్నా" అంటూ పిలుస్తూ ఏదో చెబుతూనే ఉన్నాడు. తెల్లవారేసరికి పోతన సపరివారముగా బమ్మెర చేరుకొన్నాడు.

పోతన స్నానముచేసి శుచియై ముందు తన వదిన దమ్మక్క పేరంటానికి పూజచేసి టెంకాయ కొట్టినాడు. తర్వాత ఇంటికి వచ్చి పంచాయతన పూజచేసి భార్య ఎల్లమ్మ సిద్ధము చేసిన యన్నము నివేదన చేసి ఆమె చేతి మీదుగా వడ్డింపగా శివప్రసాదము ఆరగించినాడు.

ఆశ్చర్యపడుతున్న తల్లికి జరిగిన వృత్తాంతము చెప్పి, "అమ్మా, భాగవతమును ఇమ్మనుజేశ్వరాధములకు అంకిత మీయగూడ దని నిశ్చయించానమ్మా!" అని నివేదించి ఆమె ఆశీర్వాదము పొందినాడు!

*  *  *

ఈవిధముగా రాజుకొండ ప్రయాణము తీరా పూర్తికాకుండా తిరిగి వచ్చిన కొద్దిరోజులకే, పోతన తన మేనత్త పెనిమిటి ఆశీర్వాదము పొందడానికి ఓరుగల్లుకు వెళ్ళినాడు. కోపిష్ఠి అని ప్రతీతిగల సోమయాజి అంటే బంధువులందరికీ భయమేకాని పోతనకు ఆయన వద్ద ఏమాత్రమూ జంకు లేదు. ధర్మనిష్ఠగల సోమయాజి ధర్మనిష్ఠ కలవారిని ఎన్నడూ కోపించి ఎరగడు.

మేనత్త మాత్రము భర్తకు కోపం వస్తుందనే భయంతో, వాకిటి లోనికి వచ్చిన పోతనను చూచికూడా చూడనట్లే ఇంటిలోనికి తప్పుకొని

పోయినది. అప్పుడే త్రేతాగ్నులసేవ నిర్వర్తించి విద్యార్థులకు వేదపాఠము ప్రారంభించిన సోమయాజి పోతన చేసిన పాదాభివందనము ప్రీతితో స్వీకరించి, శిరస్సున చేయిపెట్టి ఆశీర్వదించినాడు. వెంటనే సోమిదేవమ్మను పిలిచి, "ఏమే, నీకు మతిపోయినదా? మన పోతన్న వచ్చినాడు. కాళ్ళకు నీళ్ళిచ్చి అతడి సంగతి చూడు ఏమి కావలెనో!" అన్నాడు.

అంతవరకూ అణచుకొన్న ఆపేక్ష ఇప్పుడు పొంగి రాగా సోమిదేవమ్మ పోతన్నను ఎంతో ఆదరించినది. యజ్ఞేశ్వర ప్రసాదము భుజిస్తూ సోమయాజి ఆశీర్వచనము పొందుతూ పోతన వారము రోజులక్కడనే గడిపినాడు. సోమయాజికి పోతన తన యింటి గొడవ నివేదించినాడు. అంతకుముందే సోమయాజులు వృత్తాంతమంతా విని పోతన చేసినది బాగున్నదని తెలుసుకొన్నాడు గనుక పూర్వము మాదిరిగానే పోతనను ఆదరించినాడు. ఒకనాడు కన్నీళ్ళు కారుస్తూ ఆయన పోతనతో ఇట్లా అన్నాడు:

"నాయనా, మన తిప్పన్న వట్టి వెర్రికుంకరా! వాడు తెలియక భ్రష్టు అయినదే కాక మీ నాన్ననుగూడా భ్రష్టుణ్ణి చేసేవాడే,— ఇంతకూ మీ ఇంట్లో ఆ దమ్మక్కతల్లీ, మా తండ్రివి నీవూ వుండబట్టి మీ అన్నయ్యకూ, మీ నాన్నకూ సద్గతులు కల్పించినారు!"

ఏకశిలానగరంలో పోతన ఉండగా, కర్ణాటక దేశాగతులైన కవి పండితులవల్ల నారణప్ప గడుగిన భారత విశేషాలు మళ్ళా విని ఆనందించినాడు. అందరూ ఆయనను దేవతను పొగడినట్లు పొగడినవారే. నారణప్ప భారత రచన సంగతి విన్నప్పుడు తాను భాగవత రచన చేయలేకున్నానని పోతనకు దిగులు అంకురిస్తున్నది. కాని ఒక ఆలోచన కలిగి నిశ్చయానికి వచ్చినాడు.

"నారణప్ప భారతమంతా భామినీ షట్పదిలో రచిస్తున్నాడంటారు.

అది కన్నడభాషకు, సంస్కృతానికి అనుష్టుప్పువలె, దీర్ఘకావ్యాలకు అనుకు తుంది కాబోలు! ఆంధ్రభాషలో ఎంతో అభిమానంతో దీర్ఘకావ్యాలకు సోమనాథుడు ద్విపద ప్రయోగించినాడు. రంగనాథ రామాయణమూ ద్విపదలో వ్రాసినాడు. అవి ఒక్కసారి వరుసగా చదవడానికి విసుగుపుట్టి స్తున్నవి. గౌరవ రచనలకు కూడా ఆ స్థితి తప్పలేదు. ఈమధ్య కవిసార్వ భౌములే పల్నాటి వీరచరిత్ర ద్విపదలో చెప్పినారు. అది వీరకథ. పిడుగు వీరభద్రయ్య దానిని జనసమూహానికి వినిపించే ధోరణి ఎట్లా ఉంటుందో బొడ్డుపల్లిలో మిత్రుల ఎదుట ప్రదర్శించి చూపినాడు. ఎంతో బాగున్నది. గ్రంథము నేను తీసుకొని చదవగా విసుగు పుట్టినది. ఆంధ్రభాషలో దీర్ఘ కావ్యాలు వ్రాయవలెనంటే కవిత్రయము అవలంబించిన చంపూ మార్గమే బాగుంటుం దనిపిస్తున్నది. ఎప్పటికైనా భాగవతము వ్రాసే భాగ్యము నాకు లభిస్తే నేనూ అదే అవలంబిస్తాను!"

ఈ విధమైన ఆలోచనలతో వారము రోజులు ఏకశిలా నగరములో గడపి, సోమిదేవి పెట్టుతున్న యజ్ఞేశ్వర ప్రసాదము ఆరగిస్తూ ఉండ సోమయాజులయొక్క, సోమిదేవియొక్క ఆశీర్వాదాలు పొంది బమ్మెరకు తిరిగి వచ్చినాడు.

ఇంటికి చేరిన రాత్రే, భోజనాలయిన తర్వాత, లక్కమ్మ, "పోతా, వచ్చే మాసములో సంపూర్ణ చంద్రగ్రహణము రానున్నదట గదా. జ్యోతి ష్కులను అడిగినావా?" అన్నది.

"తెలుసుకొన్నాను. అది పూర్ణాధికగ్రాసమట కూడాను!"

"మరి ఏమి చేయదలచినావు ?"

"అమ్మా, నీవు అనుమతిస్తే గ్రహణ స్నానానికి గంగకు పోవలెనని ఉన్నది."

"అవశ్యము నాయనా, నీవేదో ఎప్పుడూ విచారముతో మథనపడు తున్నావు. గంగా స్నానము సర్వకల్మష హరము గదా!"

"ఏ రేవుకు వెళ్ళితే బాగుంటుందమ్మా?"

"గంగకు ఏ రేవైతే ఏమిగాని, ఐనా అడిగినావు గనుక నాకు తోచినది చెబుతున్నాను. కొంచెము దూరమైనా, భద్రాద్రి రేవుకు వెళ్ల నాయనా! ఆ పరిసరాలన్నీ పర్ణశాలలో నివాసము చేసినప్పుడు శ్రీ సీతారామ లక్ష్మణుల పాద విన్యాసముతో పవిత్రమైన ప్రదేశాలు గదా!"

"పర్ణశాల రేవుకే పోతే?"

"బాగానే ఉంటుందనుకో ! భద్రాద్రి దాకా దారి బాగుంటుంది. మా చిన్నతనంలో మా నాన్నతో నే నక్కడి కొకసారి వెళ్ళినాను. అప్పు డా భద్రాచలముమీద శ్రీరామ చంద్రమూర్తి వెలసి ఉన్నట్లు నా కెందుకో గాని తోచినది. ఆ క్షేత్రము పేరే భద్రాద్రి కదా! నీకు సర్వభద్రాలూ చేకూరుస్తుంది."

"అయితే, అమ్మా, నీవు కూడా వస్తావా?"

"నాయనా, నే నీ బమ్మెర వదలి రాలేను. మీ నాన్న సమాధిమీద మీ అన్నయ్య స్థాపించిన శివలింగము న న్నీ ఊరికి శాశ్వతంగా బంధించి వున్నది. మల్లన్నను కూడా నాతోనే ఉంచి వెళ్ళు! పసివాడు ప్రయాణాయాసము భరించలేడు."

"సరే, అమ్మా!"

## 24

బమ్మెరవారి కుటుంబాలు గ్రహణ స్నానానికి గంగకు బయలుదేరుతున్నవని తెలియగానే, బమ్మెరలోను, ఆ చుట్టు ప్రక్కల గ్రామాలలోను ఎన్నో కుటుంబాలవారు భద్రాచలమువద్ద గోదావరీ గంగలో స్నానము చేయడానికి బయలుదేరినారు. బమ్మెరవారి కుటుంబాలు మూడు: పోతనది, ఇద్దరు పినతండ్రులవి. అట్లా బయలుదేరినది బ్రాహ్మణ కుటుంబాలే కాదు,

చాతుర్వర్ణ్యముల కుటుంబాలూ బయలుదేరినవి. దారిలో దొంగల భయమే కాక పులులూ, చిరుతగండ్ల ప్రమాదముకూడా ఉన్నది గనుక పురుషులంతా ఖడ్గాలు, శూలాలు, గండ్ర గొడ్డళ్ళు, అంబులు, విళ్ళు—ఎవరికి అభ్యాస మయిన ఆయుధాలు వారు తీసుకొని సాగినారు. పోతన పాలికాపులు రామన్న, అతని తమ్ముడు లక్ష్మన్న బందూకులు పట్టుకుని నడచినారు. బందూకుల వాళ్ళు వెంట ఉంటే ప్రయాణములో ఎటువంటి భయమూ ఉండదని ధైర్యము. రామన్న, లక్ష్మన్న లిద్దరూ బహు దృఢకాయులు కూడాను.

వారిలో ఎక్కువమంది గుర్రాలూ, కంచర గాడిదలూ, ఎడ్లమీదను ముఖ్యముగా స్త్రీలు రెండెడ్ల బండ్లమీదను బయలుదేరినారు. దారిలోవంటలు చేసుకోడానికి ఆహార పదార్థాలు, పాత్ర సామాగ్రి తీసుకొన్నారు. వారము రోజులు పోను, రాను ఇంకొక వారము రోజులూ. భద్రాచలములో ఉండేది మూడు రోజులూ—అన్ని రోజులకూ కావలసిన ద్రవ్యాలన్నీ సిద్ధము చేసు కొన్నారు. ప్రయాణ మధ్యములో ఎక్కడెక్కడ ఎప్పుడు మకాములు చేయ వలెనో ఇత్యాదుల కార్య భారమంతా పోతన పినతండ్రి ఇమ్మడీ, ఆయన కుమాళ్ళు రామన్నలక్ష్మన్నల సహాయముతో చేస్తున్నారు. పోతన్న కవీ, విద్వాంసుడూ. ఏపనీ చేసినవాడు కాడు కనుక అతని కుటుంబానికి కావల సిన ఏర్పాట్లుకూడా ఇమ్మడి, తక్కిన గ్రామస్థులే ఎక్కువ భాగము చూచే వాళ్ళు.

దారిలో కొంతదూరమువరకు జనసమ్మర్దమున్న గ్రామాలు తగిలి నవి. భద్రాచలము చేరేముందు మూడు యోజనాలు అరణ్యప్రదేశము గుండా ఎక్కువ భాగము ప్రయాణము చేయవలెను. అప్పుడందరు ఎక్కువ జాగ రూకులై ప్రయాణము చేయవలె.

అందరికీ ఆదుర్దా కలిగిస్తున్న ఆ ప్రయాణము పోతనకు చెప్పలే

నంత ఆనందము కలిగిస్తున్నది. ఆ అరణ్యభూములు చూస్తూ ఉంటే పోత నకు నైమిశారణ్యము జ్ఞప్తికి వస్తున్నది. దారిలో వాళ్ళు ఎన్నో వాగులు దాటవలసి వచ్చినది. ఆ చైత్రమాసములో నీరు కొద్దిగానే ప్రవహిస్తున్నది. కొన్నిటిలో నీటి జాలులేక పూర్ణప్రవాహ కాలాన్ని సూచించే ఇసుక ప్రదే శము మాత్రము కనిపిస్తున్నది. ఐతే ఆ ఇసుకలో చిన్న గుంట తీసినా పుష్కలంగా నీరు ఊరుతున్నది. వాళ్ళ వంటల కోసము మకాము చేసేది సామాన్యంగా సెలయేటి తీరాలలోనే. ఈ నేలలన్నీ శ్రీసీతారామలక్ష్మణుల పాదవిన్యాసముతో పవిత్రమైనవి. ఈ తీర్థాలన్నీ జనక తనయా స్నానపు ణ్యోదకాలు. దారిలో శ్రీరాముడు జన్మించిన నవమితటస్థించినది. అక్కడ పోతన తాను ఏ మంత్రము జపము చేసినా భావములో శ్రీరామచంద్రుడే ఆవేశిస్తూ ఉండడము మొదట చిత్రమనిపించినా, విరుద్ధమనిపించలేదు. నారాయణుని దశావతారాలేమి, ద్వావింశత్యవతారాలేమి, అన్నీ నారాయ ణుని దివ్యాంశాలైనట్లే, శివకేశవాది రూపాలు కూడా ఈశ్వరుని అనంత చైతన్య రూపాలే గదా! శ్రీశృంగేరీ శ్రీ విరూపాక్ష శ్రీ గురుదేవులు గోపాలసుందరీ మంత్రము తనకుపదేశించి శ్రీ గోపాలకృష్ణునికీ, శ్రీత్రిపుర సుందరికీ ఐక్యము ఉపదేశించినారు గదా! భగవంతుని అనంత రూపాలు, అనంత నామాలు, అనంతకార్యాలు పరస్పర విరోధములేనివంటూ భాసిస్తూ పోతన శ్రీవిద్యాశంకర భగవత్పాదుల దక్షిణామూర్తి స్తోత్ర శ్లోకముతో గురుదేవులకిట్లా నమస్కరించినాడు :

"భూ రంభాం స్యనలోనిలోంబర మహర్నాథో హిమాంశుః పుమాన్
ఇత్యాభాతి చరాచరాత్మక మిదం యస్యైవ మూర్త్యష్టకమ్,
నాన్యత్కించన దృశ్యతే విమృశతాం యస్మా త్పరస్మా ద్విభోః
తస్మైతే గురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే"

"అయితే ఏమి? ఒక్కొక్క అంశ ఆవిర్భవించి సంచరించి దేవ

కార్యము నిర్వర్తించినచోట ఆ ఈశ్వరాకారము ప్రబలంగా ప్రకృతిని శాశ్వతంగా ఆవేశించి ఉంటుందేమో! ఇదంతా శ్రీరామచంద్రమూర్తి ఆవేశించిన దివ్యక్షేత్రము కాబోలు, మా అమ్మకు కూడా ఇక్కడ శ్రీరాముడే వున్నట్లు తోచినదట! —" అని ఈ విధంగా పోతన భావన చేస్తున్నాడు.

ఇంతలో వాళ్ళకు కిన్నెరసానివాగు తగిలినది. దాని ఐతిహ్యము కొంచెము భేదముతో శుక్తిమతి కోలాహలుల పురాణ కథను స్మరణకు తెస్తుంది. ఆ కథ పెద్దలవల్ల పోతన ముందేవిని ఉన్నాడు. భద్రాచలారణ్యాలలో సంచారముచేసే యాత్రికుల నందరినీ కిన్నెరసాని వంపులు తప్పకుండా ఆకర్షిస్తవి. దానికితోడు దాని అందమైన పేరు కవీశ్వరుడైన పోతనను విశేషంగా ఆకర్షించినది.

అప్పుడు కిన్నెరసాని తన పరిపూర్ణతతో ప్రవహించకున్నా, విశాలమైన ఇసుక పడియా, దానిమధ్య పుష్కలమైన నీటిజాలూ ఆకర్షిస్తూ దాని పరిపూర్ణ స్వరూపాన్ని ఊహకు అందిస్తున్నవి. పోతన కిన్నెరసాని జలములలో స్నానముచేసి, ఒడ్డున పల్లవ పుష్పఫలాలతో నిండి మనోహరంగా ఉన్న ఆమ్రవృక్షచ్ఛాయలో కూర్చుండి, మహేశ్వరజపము చేయసాగినాడు. ఆ ఆమ్రతరువు యొక్క నున్నని నల్లని గుండ్రనిబోదె, దాని ఎఱ్ఱని చిగుళ్ళు, సువర్ణ శోభితమైన పూత, పెద్ద ఫలాలు ఆయననెంతో ఆకర్షించినవి. సమాధితుల్యమయిన అవస్థను ఆయన చిత్తము ఏకాగ్రమై అందుకొన్నది. ఎదుట పేరంటాలైన పుణ్యసతి. రామభక్తురాలు. తన కెంతో పూజ్యురాలు ఐన వదినగారు దమ్మక్క కూర్చుని, వ్యాసపీఠముమీద భాగవతము ఉంచి చదివి వినిపిస్తున్నట్లు లీలగా తోచినది. మామిడి చెట్టుపైనుంచి రామచిలుక "రామా" అని అరచినట్లు వినిపించినది. పిట్టలు కిలకిలలాడుతున్న స్వప్న సదృశ్యమైన దశలో పోతన నోట ఈ పద్యము వచ్చినది.

"లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామంబు మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వల వృత్తంబు మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయమై"

యాత్రిక తండమంతా ఆ పద్యము విని విస్తుపోయి చుట్టూ చేరినారు. పోతన అది గమనించక ధ్యాన నిష్ఠలో చాలా సేపు ఉండి పరమ శాంతముగా లేచినాడు. అతని మూర్తిలో అప్పుడు స్పష్టముగా ద్యోతితమైన ఆనంద మందరూ గమనించినారు. ముఖ్యముగా పినతండ్రి ఇమ్మడి ఎక్కువ సంతోషించినాడు.

ఆనాటి ప్రయాణములో నారాయణ శతకములో మరికొన్ని పద్యాలు పోతన చెప్పినాడు. ఆ మరునాడు మధ్యాహ్నానికే, రేపు పూర్ణిమ అనగా, బమ్మెర యాత్రికులు భద్రాచలానికి ఎదురుగా గోదావరికి ఇవతలి ఒడ్డున ఉన్న బూర్గంపాడు అనే చిన్న గ్రామము చేరుకొన్నారు.

అక్కడ గోదావరి పాయలు పాయలై, లంకలు లంకలుగా ఉండి సౌమ్యముగా ప్రవహిస్తున్నది. ముందు రామన్న, లక్ష్మన్న గోదావరి లోతు పరీక్షించి వచ్చినారు. వాళ్ళిద్దరూ గజయీతగాళ్ళు. ప్రవాహ మెక్కడా నడుములోతు కంటె లేదనీ, క్షేమముగా తరించ వచ్చుననీ నివేదించినారు. వెంటనే యాత్రికులు గోదావరి దాటి భద్రాద్రి చేరుకొని భద్రగిరి దగ్గరగా తూర్పుగా గోదావరికి సమీపాన ఉన్న మామిడి తోటలో విడిది చేసి, అన్ని ఏర్పాట్లు చేసుకొన్నారు. వారంతా ఆ రాత్రి విడిది చుట్టూ నెగళ్ళు వేసుకొని నిద్రలకు ఒరిగినారు. రామన్నా, లక్ష్మన్నా మాత్రము రాత్రి వంతుల ప్రకారము మేలుకొని ఉండి కాపుకాచినారు.

పోతన కావెన్నెల రాత్రి ఎంతో ఆనందము కలిగించినది. చంద్రుడు ప్రసరింపజేస్తున్న వెన్నెలలో అమృతము స్రవిస్తున్నట్లే ఆయనకు

తోచి ఆ అమృతము ప్రాశనచేస్తూ, ఆనందముతో పులకరిస్తున్న సర్వాంగ ములతో చాలసేపు జాగరణము చేసినాడు.

మరునాటి ఉదయము యాత్రికులంతా చీకటితో లేచి, భక్తి శ్రద్ధలతో గోదావరీ గంగలో స్నానాలు చేసినారు. పోతన కూడా గోదావరిలో స్నానసంధ్యలు చేసి ఆ గంగాతీరాన పులినము మీద ఉన్న విశాల మండపములో కూర్చుండి మహేశ్వర ధ్యానము చేస్తున్నాడు. ఆయన చుట్టూ శాఖామృగాలు పది పన్నెండు చేరి ప్రదక్షిణాలు చేస్తూ, కిచకిచ లాడుతూ, మధ్య మధ్య పోతనను అనుకరిస్తూ, అతనివలెనే జపము చేస్తున్నట్లు ప్రవర్తిస్తున్నవి. అందులో పెద్ద వానరము చెంగు చెంగున గంతులు పెట్టుతూ పరుగెత్తి భద్రాద్రి శిఖరము మీద కూర్చుని జపము అభినయిస్తూ పెద్దగా కిలకిలారావము చేసినది. పోతనకు ఎంతో వినోదము కలుగుతున్నది. "ఇక్కడ రామసేన కూడా ఉన్నదన్న మాట!" అను కొన్నాడు.

ఆ రాత్రి సూర్యాస్తమయమైన తర్వాత రెండు గడియలకు చంద్ర గ్రహణము పట్టగలదని జ్యోతిష్కులు నిర్ణయము చేసినందున రెండు జాములు కాకముందే ఆ యాత్రికులంతా భోజనాదులు ముగించుకొన్నారు.

# 25

సాయంకాలమైనది. పోతన సంధ్యావందనము ముగించుకొని చంద్రోదయమును, గ్రహణమును నిరీక్షిస్తూ గ్రహణస్నానానికి సిద్ధముగా ఉన్నాడు. ప్రక్కనే భార్య ఎల్లమ్మ భక్తి శ్రద్ధలతో నిలిచి ఉన్నది.

ఇంతలో పూర్ణిమా పూర్ణచంద్రుడు గోదావరీ జలమధ్యములో నుంచియే ఉదయించినాడు. నదీ మధ్యము నుంచి ఉదయిస్తున్న చంద్ర బింబము చూస్తూ ఉంటే, పోతన దాని అందానికి తన్మయత్వము పొంది

నాడు. అది అమృత లింగముగా భాసించినది. అందులో చెట్టు క్రింద గోపాలకృష్ణుడు వ్యత్యస్త పాదారవిందుడై వేణుగానము చేస్తున్నట్లూ, ప్రక్కనే నారాయణీమూర్తి ఆనంద పారవశ్యముతో ఆలకిస్తున్నట్లూ స్ఫురించినది.

ఇంతలో చంద్రగ్రహణము పట్టు కనబడ్డది. జన సందోహములో కలకలము వినవచ్చినది. స్వప్న సదృశ్యమైన అవస్థలో ఉన్న పోతన ఉద్బుద్ధుడై గ్రహణ స్పర్శ చూచినాడు. వెంటనే అతడు పత్నితో సహా గోదావరీ గంగలో సోమోపరాగస్నానానికి సంకల్పము చేసి ఉపక్రమించి నాడు. స్నానానంతరము స్నానాంగ తర్పణాదులు పూర్తిచేసినాడు.

ఆ పిమ్మట పోతన మడుగువస్త్రాలు ధరించి గంగాతీరాన "మహనీయ మంజుల పులిన తలమండప మధ్యంబున మహేశ్వర ధ్యానంబు చేయుచు కించిదున్మీలితలోచనుండై" కొంత సేపు ధ్యానము, కొంత సేపు జపమూ చేస్తూ కూర్చున్నాడు. ఆ ధ్యానము కూడా ఒక విధంగా ఉండడము లేదు. కొంత సేపు,

"క్షీరాంభోధిస్థ కల్పద్రుమ విలసద్రత్నయుఙ్మండలాంతః
ప్రోద్య చ్ఛ్రీపీఠసంస్థం కరధృత జలజారీషుచాపాంకుశేషుమ్
పాశం వీణాం సువేణుం దధత మవని మాశోభితం రక్తకాంతం
ధ్యాయేద్గోపాల మీశం విధిముఖ విబుధై రీడ్యమానం సమంతాత్"

అని ధ్యానించును. మరి కొంత సేపు

"మూలే కల్పద్రుమస్యద్రుతకనకనిభం చారుపద్మాసనస్థం
వామాంకారూఢ గౌరీ నిబిడకుచభరాభోగగాఢోపగూహమ్
నానాలంకారకాంతం వరపరశు మృగాభీతిహస్తం త్రినేత్రమ్
వందే బాలేందు మౌళిం గజవదన గుహాశ్లిష్టపార్శ్వం మహేశమ్"

అని ధ్యానించును. మరి కొంత సేపు

"శాంతం పద్మాసనస్థం శశధరమకుటం పంచవక్త్రం త్రినేత్రమ్
శూలం వజ్రంచ ఖడ్గం పరశుభయదం దక్షభాగే వహంతం
నాగం పాశం చ ఘంటాం ప్రళయహుతవహం సాంకుశం వామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి."

అని ధ్యానిస్తున్నాడు.

పోతన అర్ధనిమీలితలోచనుడై నాసాగ్రమందు దృష్టి నిలిపి ధ్యానము. జపము చేస్తున్నాడు.

చంద్రమండలము పూర్తిగా గ్రస్తమైనది. ఆ అరణ్య మధ్యములో దిక్కులంతట గాంధాంధకారము ఆవరించినది.

అప్పుడు పోతన క్రిందికి వంచిన కంఠము పైకి ఎత్తినాడు. కంఠముతోపాటు శిరస్సు కూడా పైకిలేచినది. ఇప్పుడాతని దృష్టి నాసాగ్రము మీది నుండి సూటిగా భద్రాచలం శిఖరము మీదికి ప్రసరించినది. సమాధి సదృశమైన స్థితిని అందుకొన్నాడు. భద్రాద్రి శిఖరము మీద నీలమేఘాకారము కనిపించినది. అందులో మెరపు మెరసినట్లయినది. వెంటనే మేఘ గర్జనము వినిపించినది.

ఆ మేఘమువంక కించిదున్మీలితలోచనములతో చూస్తూ ఉండగా, ఆ మేఘము మసకమసకగా పురుషాకారము ధరింపసాగినది. మరి కొంత సేపటికి అది స్పష్టముగా రాజపురుషాకారము ధరించినది.

నది. తాను రాజులను విరసించి రాజవిము ఖుడై ఈ అడవిలోకి వచ్చి మహేశ్వర ధ్యానముచేస్తూ ఉంటే, రాజ ముఖ్యుని ఆకారముతో మహేశ్వరుడు కనబడుటేమి అని ఆశ్చర్యపడ్డాడు. ప్రక్కనున్న కమండలువు జలముతో కన్నులు తుడిచికొని భద్రాద్రి శిఖరము వంక దృష్టి సారించినాడు. సమాధి దశ ప్రాప్తించినది. ఇంత వరకు మసక మసకగా వున్న ఆ యాకార మిప్పుడు స్పష్టముగా కాన వచ్చినది.

"మెరుగు చెంగట నున్న మేఘంబు కైవడి
నువిద చెంగట నుండ నొప్పువాడు
చంద్రమండల సుధాసారంబు పోలిక
ముఖమున జిరునవ్వు మొలచువాడు
వల్లీయుతతమాల వసుమతీజము భంగి
బలువిల్లు మూపున బరగువాడు
నీల నగాగ్ర సన్నిహితభానుని భంగి
ఘనకిరీటము దల గల్గువాడు
పుండరీక యుగము బోలు కన్నులవాడు
వెడదయురమువాడు విపుల భద్ర
మూర్తివాడు రాజముఖ్యు డొక్కరుడు (వాని)
కన్నుగవకు నెదుర గానబడియె"

ఈ విధముగా స్పష్టముగా ప్రత్యక్షము కాగా తాను ధ్యానించుచున్నది మహేశ్వరుని, ఇట్లు ప్రత్యక్షమైనది రాజముఖ్యుడు. "ఇదేమి చిత్రము, ప్రభూ, నీ వెవ్వరవు?" అని భాషింప యత్నించుచుండగా చిత్రముగా ఆ రాజశేఖరుడు, "నేను రామభద్రుండ. మన్నామాంకితంబుగా శ్రీ మహాభాగవతంబు తెనుంగు చేయుము, నీకు భవ బంధంబులు తెగును" అని మేఘగంభీర భాషణములతో ఆనతిచ్చినాడు. అంతట ఆ దివ్యతేజోమూర్తి సన్నసన్నమై మసకమసకయి మేఘరూపమై ఇంకా దిక్కులందు ఆవరించియే ఉన్న గాఢాంధకారములో కలసి మాయమయినాడు

అంతలో గ్రహణము విడుపు ప్రారంభించి చంద్రరేఖ తోచినది. అప్పుడు భద్రాద్రి శిఖరముమీద మహాకపిమూర్తి ఒకటి పోతనకు కానవచ్చినది. అది చంద్రమండలానికి లంఘిస్తూ మాయమయినది.

అప్పటికి పోతనకు ధ్యానభంగమయినది. ధ్యానభంగమయినప్పుడు

యోగులకు కలిగే చిరాకుతో కన్నులు విప్పిచూడగా రాహుముక్తమయిన చంద్రరేఖ కానవచ్చినది. ఇంతవరకు తన కన్నులతో చూచినాననుకొన్నది. విన్నాననుకొన్నది స్వప్నవృత్తాంతముగాను, ఇప్పుడు చూచేది, వినేది ప్రత్యక్ష వృత్తాంతమైనట్లు పోతనకు తోచినది.

ఆనంద తరంగితమైన అంతరంగముతో పోతన యిప్పుడు యథాపూర్వకముగా కూర్చుండి, శ్రీరామతారక మంత్రము జపిస్తూ దృష్టి భద్రగిరిమీద సారించినాడు. కాని ఈమారు శ్రీరామభద్రుడు కనబడలేదు. ఆర్తి ఆవేశించినది, ఆర్తితోనే జపము సాగించగా, కొంతసేపటికి ఆయన కిట్లు స్ఫురించినది:

"నా హృదయములో సుస్థితుడై ఉన్న మహేశ్వరుని గోపాలసుందరుని శ్రీరామభద్రుని బయల నెక్కడనో కొండ కోనపైన వెదకుతున్నాను. ఎంత వెర్రిని! రాజద్వేషము పనికిరాదని నాకు ఉపదేశించుటకై స్వామి రాజశేఖర రూపముతో నాకు తోచి ఉపదేశించి అదృశ్యమైనాడు! ఆయన ఆనతి శిరసా వహింపవలె!"

గ్రహణ మోక్షము వరకు శ్రీరామతారక మహామంత్రము జపిస్తూనే, భాగవత రచన విషయమయి తన కుండిన సమస్త సందేహాలూ వదలి రచన చేయవలెననే ఉత్సాహము అతిశయిస్తూ ఉండగా ఇట్లా అనుకున్నాడు.

"పలికెడిది భాగవతమట
పలికించు విభుండు రామభద్రుండట నే
పలికిన భవహర మగునట
పలికెద వేరొండు గాథ బలుకగనేలా?
"భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన దమ్మి చూలికైన:

విబుధ జనులవలన విన్నంత కన్నంత
తెలియ వచ్చినంత తేట పరతు

ఎటువంటి భాషలో వ్రాయవలెననే మీమాంస ఉదయించినది. పూర్వము తాను విద్యానగరములో ఉండగా తన భాష విషయము చెప్పిన పద్యము విని, దుగ్గన పరిహాసముచేసి శ్రీనాథకవి సార్వభౌముని పద్యము చదివి, అది ఎంత బాగున్నదో పోల్చి చూచుకో మన్నాడు.

"ప్రౌఢి బలికింప సంస్కృత భాష యంద్రు
పలుకు నుడికారమున నాంధ్ర భాష యందు
రెవ్వ రేమనుకున్న నాకేమి కొరత
నా కవిత్వంబు నిజము కర్ణాట భాష!"

అవును. వక్రోక్తిలో శ్రీనాథకవి సార్వభౌమునికి అతడే సాటి. తన కవిత్వము కర్ణాట భాష అంటూ ఎంత మనోజ్ఞమైన వక్రిమ చూపినాడు! తాను కవిసార్వ భౌమునివలె వ్రాయలేడు. ఆయన కాయనయే సాటి. ఒక్క కవిత్వములోనే ఏమిటి! ఆయన దివికేగిన విధముకూడా సాటిలేనిదే. శాస్త్ర గ్రంథాలలోనూ, పురాణాలలోనే కాని ప్రత్యక్షముగా ఎవరూ కన్నదీ విన్నదీ కాదు, మహాప్రస్థానము. ఆయన కారణ జన్ముడు. ఎంత రక్తితో ఇహలోక సుఖాలు అనుభవించినాడో, అంత విరక్తితోనూ తన దేహము వదలినాడు. ఆ శరీరానికి అవమాన రూపమయిన కళంకలేశము ఆపాదింపగా తన కిక అది పనికిరాదని నిర్లిప్తుడై దాని నావల పారవేసి అమరపురికి ప్రయాణ మైనాడు! ఆయన మహత్త్వము పూర్తిగా ఎరిగినవారు అరుదు. ఆ కారణ జన్ముడు నన్ను "సహజ పాండిత్యా" అని ప్రేమతో సంబోధించేవాడు. నాది సహజ పాండిత్యమే. నా బుద్ధి సూటిగా తప్ప ప్రసరించదు. సూటిగా పండిత పామర పాఠకుల హృదయాలకు తాకేట్లు చెప్పడమే నా ధర్మము. ఆనాటి పద్యమే నాకు మార్గదర్శకము!

కొందరికి తెనుగు గుణమగు,
కొందరికిని సంస్కృతంబు గుణమగు, రెండున్
కొందరికి గుణము లగు, నే
నందర మెప్పింతు గృతుల నయ్యై యెడలన్!"

అంతట తన పురాకృత శుభాధిక్యాన్ని భావన చేసినాడు. "నన్నయ తిక్కనాది మహాకవులు పురాణావళులు తెలుగుచేస్తూ భాగవతము వదలి పెట్టినారు. నేనిది తెలుగుచేసి పునర్జన్మము లేకుండా ఈ నా జన్మము ధన్యము చేసుకొంటాను! శ్రీ మహాభాగవత పురాణ పారిజాత పాదప సమాశ్రయంబునను, హరికరుణా విశేషంబునను కృతార్థత్వంబు సిద్ధించెను."

పోతన ఒక వంక జపము చేస్తూ ఉండగానే వేరొక వంక ఈ విధ మయిన భావాలు బుద్ధిలో సాగిపోతున్నవి.

ఇంతలో గ్రహణ మోక్షము కాగానే భార్యతో మోక్ష స్నానము చేసినాడు. వంటలు పూర్తి అయ్యేవరకు పోతన పరధ్యానముగానే ఉన్నాడు. అతని నెవ్వరు పలకరింపలేదు. పోతన ముఖములో విరిసిన ఆనందాతి శయము చూచి అక్కడి వారందరు ఆశ్చర్యపడ్డారు. అప్పుడే భగవంతుణ్ణి ప్రత్యక్షము చేసుకొని భాషించిన మహాభాగ్యము పొందిన మానవోత్త ముని ముఖమూ, మూర్తీ, ఆకారమూ, తేజస్సూ, ఎంత మహోజ్జ్వలంగా ఉంటవో భావన చేయవలసినదే! అటువంటి పోతన రూపము చూచి అంతా ముగ్ధులైనారు.

వంట సిద్ధమైన తర్వాత పోతన బంధువు లందరితో కలసి భోజన మారగిస్తున్న సమయములో పినతండ్రి ఇమ్మడి, "ఏమిరా నాయనా, నీ విట్లా చిత్రంగా మారిపోయినట్లు కనిపిస్తున్నావు. విశేష మేమయినా జరిగి నదా?" అని పోతన్నను ప్రశ్న వేసినాడు.

పోతన కంఠము గద్గదమయి వెంటనే మాటరాలేదు. కళ్ళ వెంట ఏకధారగా బాష్పధారలు కారుతున్నవి. దేహమంతా గగుర్పొడిచి ఉన్నది. ఆయన శిరస్సున కిరీటమువలెను, శరీరము చుట్టూ దివ్యాంబరము కప్పి నట్లుగాను వెన్నెల కాంతివంటి దివ్యకాంతి ఆవరించినట్లయినవి. అది బమ్మెరనుంచి వచ్చి ఎదుట ఉన్న యాత్రికులంతా గమనించి, ఏమని ప్రత్యుత్తర మిస్తాడో అని ఔత్సుక్యముతో ఉన్నారు.

"కక్కా-, శ్రీరామ-భద్రుడు-ప్రత్యక్షమై-భాగవతము-ఆంధ్రీకరించి-తనకు- అంకితము—చేయమని - ఆదేశించినాడు- నాకు భవబంధాలు తెగి పోతవి-" అన్నాడు!

వెక్కి- వెక్కి- ఏడుస్తూ ఈ మాటలు పోతన నట్టు నట్టుగా అతి కష్టముమీద చెప్పగలిగినాడు.

ఆ మాటలూ, అవి చెప్పిన తీరూ విన్నవారి నందరినీ విభ్రమా నందములలో ముంచి వేసినవి. "మన పోతనకు రామభద్రుడు ప్రత్యక్ష మైనాడు-ఇప్పుడే—ఇక్కడే!- మన మంతా ఎంత ధన్యులము!" అని ఈ విధముగా బహు భంగులుగా ధన్యవాదాలు చెలరేగినవి.

వాళ్ళంతా మళ్ళీమళ్ళీ ఆలోచించుకున్నారు. అందరూ సంపూర్ణ గ్రాసమైన సమయములో భద్రగిరి శిఖరముమీద తామందరూ మేఘమూ అందులో మెరుపూ చూచినట్లూ, ఆ తర్వాత మేఘ గర్జనము దడదడ లాడుతూ విన్నట్లూ ఏకగ్రీవంగా వర్ణించినారు.

"ఆహా! శ్రీరామభద్రుడు ఆ మేఘా కారంగానూ, సీతమ్మవారు ఆ మెరుపు రూపంలోనూ ప్రత్యక్షమై, ఆ మేఘ గర్జన రూపములో స్వామి మాట్లాడినా డన్నమాట!—ఆ మాటలు పోతన్న స్పష్టముగా విన్నాడు. రూపాలు స్పష్టముగా చూచినాడు!— మనమూ చూచినాము. మనమూ విన్నాము. మనమూ ధన్యులమే! స్పష్టంగా చూచి వినగలిగినాడు గనుక

మన పోతన్న ధన్యతరుడు! ఆ ఉరుము ఈ గోదావరీ వారిలో ప్రతి ధ్వనించినది కాదూ. అందుకే కాబోలు, చూడండి, ఈ గోదావరీ గంగ ఇంకా ఆనంద నాట్యము చేస్తున్నది—"

ఈ రీతిగా అందరూ ఎవరికి తోచినట్లు వారు పరిపరి విధాల శ్రీరామ భద్ర స్మరణ చేయసాగినారు. బమ్మెరనుంచి బయలుదేరినవారు ఆ మరు నాడు పంచవటికి వెళ్ళి దర్శించి భద్రాద్రికి వచ్చినారు. మరి ఒకరోజు భద్రాచలంలోనే ఉండి విశ్రాంతి తీసుకుంటూ, శ్రీరామ కథలు చెప్పు కొంటూ కాలక్షేపము చేసినారు. ఆ తర్వాతి రోజున అంతా స్వగ్రామోన్ము ఖులై బయలుదేరినారు. ఈ మాటు కొంచెము దూరమైనా ఏకశిలానగరము మీదుగా ప్రయాణమైనారు.

ఆ కాలములో ఎవరైనా తీర్థయాత్రచేసి తిరిగి వస్తున్నారంటే, వారికి తిరుగుదారిలో తగిలే గ్రామాల జనులు మంచి ఆతిథ్యము ఇచ్చేవాళ్ళు. తీర్థయాత్రికులు సంపాదించిన పుణ్యములో ఏదో ఒక లేశమాత్రమయినా ఈ విధంగా తాముకూడా పంచుకోవచ్చుననే ఆశ కావచ్చును, దానికి కార ణము! యాత్రికుల కోసము గ్రామీణులు ఊరి బయటికి దూరాన ఎదురు వచ్చి, మా ఇంటి కంటే మా యింటికి రమ్మని పంతులు పడి బ్రతిమాలి, ఏ కులమువారు ఆ కులస్థులను తమ ఇళ్ళకు గౌరవముతో, ప్రీతితో తోడ్కొని పోయి విందు చేసేవారు. ఈమాటు వారికొక విశేషము కూడా సంభవించినది. బమ్మెరవారు పర్ణశాలకు వెళ్ళినరోజుననే ఎందరో యాత్రి కులు తిరుగు ముఖమైనారు. వారు దారిపొడుగునా పోతనకు శ్రీరామభద్రుడు ప్రత్యక్షమైన వృత్తాంతమూ, తామంతా కూడా భద్రాచలంమీద కారు మొయిలూ, మెరుపూ చూచినదీ, ఉరుము విన్నదీ అద్భుతానందాలతో వర్ణిస్తూ పోయినారు. ఆ వృత్తాంతము యాత్రికుల స్వకపోల కల్పనలతో చిలవలుపలవలై వృద్ధిపొంది దేశమంతటా పాకిపోతున్నది.

అందువల్ల బమ్మెరవారి తిరుగు ప్రయాణము తిరణాల వలె సాగుతున్నది. దారి పొడుగునా వారికి జరుగుతున్న మర్యాదకు అంతులేదు. ఎంత ప్రయత్నము చేసినా, వారు సొంత వంటలు చేసుకోవడము గ్రామీణులు పడనీయలేదు. వారు అంత బలవంతము చేస్తున్నారు!

ఇక పోతనకు జరుగుతున్న గౌరవము అప్రతిమాన మైనది. పెద్దలు, పిన్నలు-ఆబాల గోపాలము దూరమునుంచే భయభక్తులతో ఒకరి కొకరు పోతనను వేలుపెట్టి చూపుతూ, గుసగుస లాడుకొంటూ నమస్కారాలు చేసేవారే! ఆయన దివ్యతేజస్సుకు ఆశ్చర్యపడేవారే! ఆబాల గోపాలమే కాదు, ఆ భద్రారణ్యములో ఉండే చెంచులూ, కోయలూ, ఆటవిక జనులూ, దారిదోపిడివల్ల జీవించే కిరాతజాతులవారు కూడా ఈ ఆశ్చర్యము విని బమ్మెర యాత్రికులను, ప్రత్యేకముగా పోతనను దర్శించి మ్రొక్కి యథాశక్తిగా కానుకలు అర్పించి పోతున్నారు. బమ్మెరవారి తిరుగు ప్రయాణము ఈ విధముగా అద్భుతమూ, అపూర్వమూ ఐన విజయయాత్రవలె మహాకోలాహలంగా సాగుతున్నది. కతిపయదినాలకు బమ్మెరవారు ఓరుగలు సమీపించినారు.

## 26

ఏకశిలానగరము తూర్పుద్వారము క్రోశము దూర మున్నదనగానే బమ్మెరవారికి మేళతాళములతో ఎదురువస్తున్న ఏకశిలానగర పౌర జనసమూహము దూరాన కానవచ్చినది. ఆ పౌర జనసమూహానికి ముందు బమ్మెర వారి బంధువు లున్నారు. వారందరిలో అగ్రగాములై పోతన మేనత్త పెనిమిటి సోమయాజులుగారు మానవాకారము ధరించిన గార్హపత్యాగ్ని వలెనే వస్తూ ఉండడము పోతనకు అద్భుతాశ్చర్యాలు కలిగించినది. భక్తి పూర్వకముగా పోతన ఎదురుపోయి పాదాభివందనము చేయగా, సోమయాజి అతనిని లేవదీసి బిగికౌగిటిలో హత్తుకొని దీవించినాడు.

బమ్మెరవారినే కాక, వారితో వస్తున్న యాత్రికుల నందరినీ చాతుర్వర్ణ్య జనులను సోమయాజి తన యింటికే రమ్మని ఆహ్వానించి కొంపోయినాడు. వేదవిప్రులు స్వస్తివాచకముచేస్తూ ముందు నడచిరి. ఆ వెనుక భజనపరులు, గాయకులు, బహువిధ వాద్యవాదకులు విద్యా ప్రదర్శనము చేస్తూ నడచిరి. అందరి వెనుక వారవనితల మేళములెన్నో పోటీలు పడుతూ, శ్రీరామలీలలూ, శ్రీకృష్ణ లీలలూ, శివలీలలూ అభినయిస్తూ, జనసమూహాలను ఆకర్షిస్తున్నవి.

ఆ యజ్వ ఇంటికి చేరగానే వాకిటిలోనికి మేనత్త సోమిదేవి సీతమ్మవారి వలెనే ఇద్దరు కోడళ్ళతో ఎదురువచ్చి పోతనను ఎర్రనీళ్ళు చూపి దిగదుడిచి దృష్టి తీసినది. ఆమెకు పోతన భక్తిపూర్వకముగా నమస్కరించగా, ఎనభై ఏళ్ళ పండు ముత్తైదువ అతనిని లేవనెత్తి, అతని శిరస్సు తన రెండు బాహువులతో పొదివి, ఆలింగనము చేసుకొని ఆనందము వెల్లివిరుస్తున్న మూర్తితో స్వాగతమిచ్చినది.

పోతనకు మేనత్తా, మేనత్త భర్త మాత్రమే కాక ఓరుగల్లులో ఇంకా ఎందరెందరో బంధువులు, గురువులు, ఆప్తులు ఉన్నారు. వాళ్ళంతా పోతనను చూడవచ్చినారు.

శ్రీరామభద్రుడు ప్రత్యక్షమైన భాగ్యశాలి తమ పట్టణానికి వచ్చాడన్న వార్త ఆ మహా పట్టణంలోనూ, చుట్టుప్రక్కలనూ ప్రభంజనం వలె వ్యాపించింది. జనులు—పెద్దలు, చిన్నలు—పోతనను దర్శించి పోతున్నారు. పోతన మూర్తి అపూర్వమైన దివ్యతేజస్సుతో వెలుగుతూ వుండడము వాళ్ళకు అద్భుతము కలిగిస్తున్నది. పోతన తాను దర్శించిన శ్రీరామచంద్రుణ్ణి నిరంతరము ధ్యానిస్తున్నాడు. చూడవచ్చిన వాళ్ళు ఆయనను ఎక్కువగా పలకరించి ధ్యానభంగము చేయడము లేదు. ఇందరు వచ్చి మ్రొక్కిపోతూ ఉంటే ఆ మ్రొక్కులన్నీ శ్రీ రామార.

ణము చేస్తున్నాడు. పండిత పామరులందరికీ సంతోషమయ్యేట్లు భాగవతరచన ఎట్లా సాగిస్తానా అని భావన చేస్తున్నాడు. శ్రీరాముడు రచన చేయమని పెద్ద బాధ్యత తన మీద పెట్టినాడు. ఈ జనమంతా—పండితులూ పామరులూ—ఈ విధంగా తన్ను గౌరవిస్తూ ఆ బాధ్యతను రెట్టింప జేస్తున్నారు. ఏమి చేయవలె అని పోతన మధ్య మధ్య దిగులుపడు తున్నాడు. అంతలో గురుతర బాధ్యత సర్వమూ ఆ రామభద్రుని మీదనే—ఆ రాజశేఖరుని మీదనే ఉంచి తాను బరువు దింపుకొని తేలిక పడుతున్నాడు.

అందరికీ భగవంతుడు నిత్యసన్నిహితుడే. అయినా మనబోటి సామాన్యుల కన్నులు ఆయననుచూడలేవు. ఆయన మాటలను మన చెవులు వినలేవు. ఆయనను మన చేతులు తాకలేవు. ఆయన దివ్య గంధాన్ని మన నాసిక గ్రహించలేదు. ఆయనలో మూర్తివంతమైన అమృతాన్ని మన నాలుకలు రుచి చూడలేవు. అందుచేత ఆయన సర్వకాల సర్వావస్థలలో మనకందరికీ అతిసన్నిహితుడే అయినా, దూరస్థుడుగానే ఉంటాడు.

కాని భగవద్దర్శన భాగ్యము పొందిన మహాభక్తుడు అట్లా కాదు. అతని రూపము మనమంతా చూడగలము. మాటలు వినగలము. అతనిని స్పృశింపగలము. అతనిలో నుండి ప్రసరించే దివ్యవాసన మనము గ్రహింప గలము. అతని దర్శనామృతము జుర్రగలము. అందువల్లనే భగవంతుని కంటే కూడా భగవద్దర్శనము చేసుకొన్న భక్తుడు మనకు ప్రియతరుడుగా ఆత్మీయుడుగా ఉంటాడు.

పోతన ఏకశిలానగరములో కొంత కాలము గడపదలచినందు వలన బమ్మెర నుంచి వచ్చిన యాత్రికులు చాలా మంది సెలవు తీసుకొని వెళ్ళి పోయినారు. పోతనతో అతని భార్య మాత్రము అక్కడ నిలిచి ఉండిరి.

ఒకనాడు పోతన సోమయాజిని ఏకాంతముగా, ఆయన అగ్నులు

వ్రేల్చిన వెంటనే కలసికొని, తన కర్తవ్యమును గూర్చి ప్రశ్నించినాడు. శుద్ధ ఛాందసుడైన సోమయాజి, "నాయనా, సమస్త శుభకర్మలూ పరిషదనుజ్ఞ పొందనిది ప్రారంభించరాదు" అని ఉపదేశించినాడు. అది భగవదాదేశముగానే పోతన గౌరవించి పరిషత్తును కూర్చినాడు.

పరిషత్తు కూడినది. అందులో సభ్యులు మొత్తము ఇరవై నలుగురు ఉండిరి. ప్రభుకార్యార్థులై అప్పుడు ఏకశిలానగరానికి వచ్చిన దగ్గుపిల్లి దుగ్గన, చెందలూరి గంగనమంత్రి కూడా ఆ పరిషత్సభ్యులలో ఉన్నారు. తక్కిన వారిలో వివిధ శాస్త్ర విద్వాంసులు పౌరాణికులు సంస్కృతాంధ్రకవులు, వేదవిదులు ఉన్నారు. అందరిలో వృద్ధుడు, వేద వేదాంగ విదుడు, స్వయముగా సోమయాగము చేసి నిత్యము త్రేతాగ్నులను ఉపాసిస్తున్న సోమయాజినే—పోతన మామయైన సోమయాజినే—పరిషత్సభ్యు లంతా ఏకగ్రీవంగా అధ్యక్షునిగా వరించి గురుస్థానములో కూర్చుండబెట్టినారు.

ఆ విద్వత్సభలో ప్రేక్షకులలో ఉప్పల శాంతయ్య, పిడుగు వీరభద్రయ్యకూడ ఉండడము దైవికముగా తటస్థించినది.

సోమయాజియే పోతనను మొదటి ప్రశ్న వేసినాడు.

"శ్రీరాముడు నీకు ప్రత్యక్షమై భాగవతము అంధ్రీకరించమని నిన్ను ఆదేశించినాడని అంటున్నావు. నిజమేకావచ్చు కాని అది నీకు చిరకాలముగా ఉన్న కోరికవల్ల కలిగిన భ్రాంతి కూడా కావచ్చు గదా!—నీకు భాగవతాంధ్రీకరణము చేయవలెనని ఎప్పటినుంచో ఉబలాటమున్నది కదా?"

పోతన: "ఉబలాటమే కాదు. కొన్ని భాగాలు వ్రాసినాను కూడాను, వేడుక పుట్టినపుడు."

సోమయాజి: "నీ కృతిని ఎవరికయినా అంకితము చేయవలెనను కున్నావా?"

పోతన : "చిత్తము రాజసత్తమునికి అంకితము చేయుటే ఆంధ్ర కవీశ్వరుల సంప్రదాయము, భారత, భాగవత, రామాయణాదుల వంటి గ్రంథాలు ఉపదేశించే ధర్మము ప్రవర్తింపజేయ గలవారు రాజశ్రేష్టులే కదా—అయితే ఆ మధ్య పేరమ్మ పేరంటాలు విగ్రహముచూచి ప్రభువులు చేస్తున్న దుండగాల కథ విన్న తర్వాత, ఇమ్మనుజేశ్వరాధములకు కావ్యము అంకితము చేస్తే నరకము వస్తుందని భయము కలిగినది."

సోమయాజి:"బాగున్నది. అందుకే రాజశేఖరుడైన రామభద్రుని మీదికి అప్రయత్నముగా నీ అంతరాత్మ ప్రసరించి ఉంటుంది. అది శుభ సూచకము."

పోతన:"ధన్యుణ్ణి. తమరు సెలవిచ్చేవరకు ఈ రహస్యము నాకు స్ఫురించనేలేదు.

పరిషత్తులో మీమాంసకుడు ఇప్పుడు ప్రశ్నించినాడు: "మహాభాగవతము అర్థావగాహనకు ప్రస్థానత్రయము గురుముఖతః అధ్యయనము చేసి వుండవలె. లేని వారు ఆంధ్రీకరించటానికి అధికారులు కారు. మరి నీ సంగతేమిటి?"

పోతన:పరమహంస పరివ్రాజకుల శ్రీముఖమననే ప్రస్థానత్రయము శ్రీ శంకరభగవత్పాదుల భాష్యముతో సహా శ్రవణము చేసినాను."

వైయాకరుణుడు ఇట్లా ప్రశ్నించినాడు: "నీవు సంస్కృత వ్యాకరణ మేమయినా అధ్యయనము చేసినావా?"

"పోతన: "కాశికా వృత్తితో పాణినీయము పాఠము చేసినాను. ఇప్పుడంతా ముఖస్థముగా ఉన్నదని గట్టిగా చెప్పలేను."

తర్వాత సంస్కృతాంధ్రకవులు, పౌరాణికులు, వేదవిదులు, మంత్ర శాస్త్రవేత్తలు వేసిన ప్రశ్నలకు పోతన ఇచ్చిన ఉత్తరములవలన ఈ విషయములు పరిషత్తుకు తెలిసినవి.

పోతన ఆంధ్రశబ్ద చింతామణి, అథర్వణకారికావళి, కేతన ఆంధ్ర భాషా భూషణము, భీమకవి కవిజనాశ్రయము పాఠము చేసినాడు. నన్నయ, తిక్కన, ఎఱ్ఱయల రచనలు, సోమనాథ, శ్రీనాథుల కావ్యాలు అభిమాన పాత్రములైనవి. సంస్కృతములో వాల్మీకి రామాయణము, వ్యాస మహాభారత భాగవతములు, కాళిదాస, భారవి, మాఘకవుల కావ్యాలు పఠించినాడు. బాణుని కాదంబరి, మయూరుని సూర్యశతకమును అభిమాన పాత్రములైనవి. వేదాధ్యయనము, నిత్య పూజకు అవసరమైన నమకచమకములు, పురుషసూక్త శ్రీ సూక్తములు, దశశాంతులు, మంత్ర పుష్పములతో పాటు ఆరుణము కూడా అధ్యయనము చేసినాడు. గోపాల సుందరీ మంత్రము సాంగముగా జగద్గురు శ్రీ శృంగేరీ విరూపాక్ష శ్రీ పీఠాధీపులైన శంకరస్వాముల వల్ల దీక్ష పొందినాడు. మహాభాగవతము - శ్రీధరుల వ్యాఖ్యానముతో ముమ్మారు పఠించినారు.

పోతన ఇచ్చిన ఉత్తరములు ఆలకించి అనుజ్ఞ ఇవ్వబోతుండగా పరిషత్తు నాపి ఓరుగంటి ఆంధ్రకవి ఈ ప్రశ్న వేసినాడు:

"నీవేవో కొన్ని భాగవతపద్యాలు వ్రాసినానన్నావు. అవి కవీశ్వరుల కెవరికైనా విన్పించినావా? అయినా, మేము కూడా వింటాము, కొన్ని వినిపించు."

వెంటనే పోతనకు శ్రీనాథభట్టు తలపునకు వచ్చినాడు. కన్నులు తడియైనవి. శ్రీనాథుని స్మరణతో ఆవేశించిన ఆర్ద్రభావముతో తాను వెనుక వ్రాసిన పద్యాలు — వామనావతార, నృసింహావతార ఘట్టాలలోవివి —

వినిపించి ఈ విధముగా నివేదించినాడు: "ఇవి కవిసార్వభౌములు శ్రీనాథ భట్టారకులు, అవల ఉండి ఆలకించి, కంఠస్థము చేసికొన్నవి. నన్ను భాగవతము ఆంధ్రీకరింపుమని ప్రోత్సహించి అందుకు కొన్ని ఉపాయాలు కూడ ఉపదేశించినారు."

ఆ పద్యాలు, మాటలు ఆలకించి పరిషత్తు ఆనందముతో వెంటనే పోతనకు భాగవతాంధ్రీకరణానికి అనుజ్ఞ ఇచ్చినది. పోతన పరిషత్తుకును, సభ్యులకును నమస్కరింపగా, స్వస్తిమంత్రాక్షతలు చల్లి ఆశీర్వదించినారు. వెంటనే పోతన తన ఆంధ్ర మహాభాగవత ప్రథమ పద్యము పరిషత్సభాముఖములో పఠించినాడు.

> "శ్రీకైవల్య పదంబు జేరుటకునై చింతించెదన్ లోక ర
> క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దాన వో
> ద్రేక స్తంభకు గేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
> నాకంజాత భవాండకుంభకు మహా నందాంగనా డింభకున్."

# 27

అంతలో ఆ సభకు ఏకశిలానగర ప్రభువు సపరివారముగా విచ్చేసినాడు. మర్యాదలు జరిగిన తర్వాత ప్రభువే పరిషత్తుకు ఇట్లా విన్నవించుకొన్నాడు:

"పోతన్న గారికి శ్రీరామభద్రుడు ప్రత్యక్షమై భాగవతము ఆంధ్రీకరించమని ఆదేశించినారనీ పరిషదనుజ్ఞకై ఇక్కడ సభ తీరినారనీ విన్నాము. అట్టి పుణ్యకృతిని గ్రహించే భాగ్యము మాకు ప్రసాదించమని అర్థించి, కవిని యథాశక్తిగా సమ్మానిద్దామనే ఉత్సాహముతో మేమిక్కడికి వచ్చినాము. అందుకు అనుజ్ఞ ఇవ్వమని ఈ పరిషత్తును ప్రార్థిస్తున్నాము."

ఆ మాటలు విని పరిషత్సభ్యులు ఒకరిమొగ మొకరు చూచు కొన్నారు. అధ్యక్షుడు సోమయాజి ఇట్లా అన్నాడు:

"ప్రభూ, పోతన్న కన కృతి తమబోటి ధర్మప్రభువులకు అంకితము ఇవ్వడము నబబే. అయితే అతనికి శ్రీరామభద్రుడు ప్రత్యక్షమై భాగవత మును ఆంధ్రీకరించమని కూడా ఆజ్ఞాపించి కటాక్షించినాడు."

ప్రభువు వెంటనే అన్నాడు: "అపరాధ మపరాధము! ఆ విషయము తెలియక అంటిమి. శ్రీరామభద్రుడు కోరిన గ్రంథమును మాబోంట్లు కోరుటకు అర్హులు కారు. అయితే కృతిపొంది పోతన కవీంద్రునకు బహూకరింపవలెనని ఈ అంబరాభరణాలు తెచ్చినాము. వీని నేమి చేయ మందురో సెలవీయమని ఈ పరిషత్తును అర్థిస్తున్నాము."

సోమయాజి వెంటనే జవాబు ఇచ్చినాడు: "ప్రభూ, శ్రీరామభద్రుడే మీలో ఆవేశించి మీ రూపములో ఇప్పు డిక్కడికి ఈ విధముగా వచ్చినా డని సంభావిస్తున్నాను. మా సభ్యులంతా చూపులతో నా మాటలకు అంగీకా రము తెలుపుతున్నారు. శ్రీరామభద్రుని పేర మీ రా అంబరాభరణాలు పోతనకు అర్పించండి—పోతనా, లేచి గ్రహించు!"

వెంటనే ప్రభు పురోహితుడు లేచి అంబరాభరణాదులు కర్పూర తాంబూల పురస్సరముగా శ్రీరామభద్రుని పక్షాన పోతనకు సమర్పించినాడు. పోతన ఎర్రబడ్డ ముఖముతో వినమిత మస్తకుడై వానిని గ్రహించి పరిష త్తుకు, ప్రభు పురోహితునకును నమస్కరింపగా దీవించిరి. సోమయాజి సంతోషమునకు అవధి లేకున్నది.

ఇంతలో దేవరకొండ ప్రభువు, రాజుకొండ ప్రభువు పరివారసమే తులై రెండువైపులనుండి ఆ సభకు వచ్చినారు. వారుకూడ ఓరుగల్లు ప్రభువువలెనే ముందు కృతి అర్థించి విషయము సమగ్రాముగా తెలిసికొని

అపరాధము చెప్పుకొని తాను తెచ్చిన అంబరాభరణాలు శ్రీరామభద్రుని పక్షాన పోతనకు సమర్పించినారు.

ఈ విధముగా తనపైన ప్రసరించిన శ్రీరామభద్రుని అనుగ్రాహాతిశయానికి పోతనకు బ్రహ్మానందము కలిగినట్లయినది. పోతన ముఖము వికసించిన కోకనదమువలె మరింత ఎర్రనై ప్రేక్షకులకు ముచ్చట కలిగించినది.

అప్పుడు రాజుకొండ ప్రభువు పరిషత్తుకు ఇట్లా నివేదించినాడు:

"ఈ శుభ సమయములో బమ్మెర గ్రామము అగ్రహారముగా చేసి బమ్మెర గ్రామములోని శ్రీ వేణుగోపాలస్వామివారి కైంకర్యార్థము సమర్పించుకో దలచినాము. దానికి సభవారు అనుమతింతురుగాక!"

సభ సంతోషముతో సాధువాక్య పురస్సరముగా అనుమతించినది. అప్పుడు పోతన లేచి సభకు వినీతుడై నమస్కరించి ఇట్లు ప్రకటించినాడు.

"నా భాగవతము మా బమ్మెరలోని శ్రీ వేణుగోపాలస్వామివారి సన్నిధానములోనే కూర్చుండి రచన సాగిస్తానని విన్నవిస్తున్నాను. ప్రభువుల అగ్రహారముతో పాటు నా రచన కూడా బమ్మెరలో శ్రీరామభద్రస్వరూపుడైన శ్రీ గోపాలకృష్ణస్వామికే సమర్పణము అవుగాక!

"హారికి నందగోకులవిహారికి జక్రసమీరదైత్య సం
హారికి భక్తదుఃఖపరిహారికి గోపనితంబినీమనో
హారికి దుష్టసంపదపహారికి ఘోషకుటీ పయోఘృతా
హారికి బాలక గ్రహమహాసుర దుర్వనితా ప్రహారికిన్.

"శీలికి నీతిశాలికి వశీకృతశూలికి బాణహస్త ని
ర్మూలికి ఘోరనీరద విముక్త శిలాహత గోపగోపికా
పాలికి వర్ణధర్మ పరిపాలికి నర్జున భూజయుగ్మ సం

చాలికి మానికిన్ విపుల చక్రనిరుద్ధ మరీచిమాలికిన్.
"క్షంతకు గాళియోరగ విశాల ఫణోపరి నర్తన క్రియా
రంతకు నుల్లసన్మగధరాజ చతుర్విధ ఘోరవాహినీ
హంతకు నింద్రనందన నియంతకు సర్వచరాచరావళీ
మంతకు నిర్జితేంద్రియ సమంచిత భక్తజనానుగంతకున్.
"న్యాయికి భూసురేంద్రమృతనందనదాయికి రుక్మిణీ మన
స్థ్సాయికి భూతసమ్మద విధాయికి సాధుజనాను రాగసం
ధాయికి పీతవస్త్ర పరిధాయికి పద్మభవాండ భాండ ని
ర్మాయికి గోపికానివహమందిరయాయికి శేషశాయికిన్.

"సమర్పితంబుగా నే నంద్రభాషను రచియింపబూనిన శ్రీ మహా భాగవతంబునకుం బ్రారంభంబు—"

అప్పుడు సభలో ఉన్న ఉప్పల శాంతయ్య ఉత్తరీయము నడుముకు బిగించి "నిజమైన మహేశ్వర భక్తుడంటే నీవేనయ్యా!" అంటూ పోతనకు పాదాభివందనము చేసినాడు.

అట్లే పిడుగు వీరభద్రయ్య నమస్కరిస్తూ, "శ్రీనాధకవి సార్వభౌముని వలెనే భేదములేని భగవద్భక్తుడవు నీవేనయ్యా!" అంటూ అగ్గించినాడు.

దుగ్గనకు అప్పుడు కలిగిన ఆనందము ఇంతంతకాదు. అతడు పోతనను గాఢాలింగనము చేసుకొన్నాడు.

చెందలూరి గంగనమంత్రి శివపూజా పవిత్రతమై అమృతముస్రవించు తన దక్షిణహస్తము పోతన శిరస్సుపై వాత్సల్యాతి శయముతో ఉంచి మనసారా ఆశీర్వదించినాడు.

ఈ విధముగా ఏకశిలా నగరములోని "సకల గురు వృద్ధబంధు

జనానుజ్ఞాతుడై " పోతన శ్రీరామకృష్ణులనే ధ్యానము చేస్తూ, భాగవత రచనా కుతూహలముతో ఆ మరునాడే శస్యూషస్సులో బమ్మెర గ్రామోన్ముఖుడై సకుటుంబముగా బయలుదేరినాడు.

ఏకశిలా నగరములోని మహాజనమంతా భాగవతాంధ్రీకరణానికి స్వగ్రామానికి ప్రయాణమై వెళ్ళుతున్న పోతన్నను మేళతాళాలతో చాలా దూరము అనుగమించినారు. దారిపొడుగునా పల్లెలలో పట్టణాలలో పోతనకు స్వాగతాలూ, సాగనంపులూ అట్లాగే జరుగుతున్నవి. బమ్మెరచేరి గ్రంథారంభము చేసినాడు.

(సమాప్తం)